సాహిత్యమాల. ౯.

941
జా. 28

# నారప్పా యాత్ర

( నిత్యనారాయణ బెనర్జీ. )



నవంబరు 1937.

శ్రీ ... రామమోహన్ ...
తెల్లప్రోలు

# గ మ ని క.

విశ్వసాహిత్యమాల కిది నూతనశకారంభము. ఇప్పటివరకు సంపాదకులుగానుండి గ్రంథమాలను యింత ఉన్నతస్థితికి గొనివచ్చిన కామ్రేడ్ మహీధర రామమోహన్‌రావు తమ భారమును నాపై విడి తప్పుకొని యున్నారు. ప్రస్తుతమువరకూ ఉన్న గ్రంథమాలనిబంధనల నన్నిటిని పరిస్థితుల ననుసరించి పూర్తిగా మార్పుచేయక తప్పినది గాదు.

చందాదారులను చేర్చు పద్ధతి తొలగించబడింది. ముందు పుస్తకములను కూడ చౌకలో, అందముగా ప్రచురించెదము. పుస్తకములను విడిగా ఎప్పటికప్పుడే వెలనిచ్చికొని, మా గ్రంథమాలకు సహాయముచేయ ఆంధ్రమహాజనులను గోరుచున్నాము.

కాని, గ్రంథమాలయొక్క ఆదర్శాలలో మాత్రము మార్పులు గలుగవు. వెనుకటి ఆదర్శాలతో అదే మార్గములో నడిపించగలము. ఆంధ్రమహాజనులు తమ సహాయసానుభూతులను యథాపూర్వముగా నందింపగోరుచున్నాము.

ముంగండ
30—10—37

మహీధర కృష్ణమోహన్‌రావు
సంపాదకుడు.

# ఒక చిన్న విషయం.

1933 లో నిత్యనారాయణ బెనర్జీ రష్యాలో సంచారంచేసి చూసివచ్చిన విషయాలను "Russia to-day" అనేపేరుతో పుస్తక రూపంలో ప్రకటించేడు. ఆపుస్తకానికి ఇది స్వేచ్ఛానువాదం.

'బెనర్జీ' పుస్తకాన్ని ఎంతనిష్పాక్షికదృష్టితో వ్రాసినా అచ్చట ప్రత్యక్షమైన ప్రజలబాధలు, వానికి కారణాలు ఒకేచోట లేకపోవడంచేత చదివేవారికి రష్యాఅంటే ఒకజుగుప్స కలగడానికి కారణం అవుతుంది. అన్నిటికంటె ముఖ్యంగా రష్యనుల ఆహారంవిషయంలో బెనర్జీ తెలిపిన అభిప్రాయాలు చాలా భయంకరంగా వున్నాయి. దేశదేశాలు చూడ డానికి తగినంత ధనంగలపెద్దమనిషి తినేతిండిని పట్టిచూస్తే రష్యనుల ఆహారం చాలా నికృష్టంగా తోచవచ్చును. కాని, ఏదేశంలోనైనా కూలీలు—రైతులు తింటూన్నతిండిని పట్టిచూస్తే రష్యనుల తిండి గ్రంథకర్త వర్ణించినంత భయంకరంగా ఉండదు. ఇంకా ఇతరదేశాలలో కంటె బాగానే వుంటుందేమో ననుకోవచ్చును. సోవియటుల సగటు ఆదాయాన్ని అనుసరించి వారి తిండి—గుడ్డలు ఉన్నాయి, కొలది తేడాలో. ఆవిధంగానే మనదేశంస్థితికూడా ఆలోచిస్తే, మనపాలబడే ఏడుకాసులకి ఎటువంటి తిండి అమరుతుందో ఊహించండి. విదేశాలన్నీ వెలిపెట్టి కారాలు—మిరియాలు నూరుతూంటే; పంటలు, ఇచ్చి సరుకు తెచ్చుకోవలసి వస్తూంటే; కరువులు, కుట్రలు, దేశాదాయాన్ని నేల కలుపుతూంటే; ధనికులదృష్టిలో బాగుండకపోయినా పుష్టికరమైన ఆహారం తృప్తిగానైనా పెట్టగలిగింది, రష్యాప్రభుత్వం. అక్కడ భారతదేశంలోవలె తిండిలేక చచ్చిపోతూన్నవాళ్లు లేరు.

రెండవది రహదారులవిషయం. ఇదివరకు మోటార్లు, ట్రాములు, బండ్లు, పట్టణాలలోనే ఉండేవి. వీటిలో యెక్కువభాగం విలాసవిహారాలకే ఉపయోగించబడేవి. కాని, నేడు అవన్నీ ఉత్పాదకసంస్థలకు—కార్ఖానాలకు, పంచిపెట్టబడి, దేశం నలుమూలలకీ పంపబడినాయి. యంత్రాలయాలన్నీ ట్రాక్టర్లు మొదలయినవానినే నిర్మించడంలో మునిగి ఉండడంచేత వీనివిషయం కొంచెం వెనకపెట్టబడింది. అక్కడకీ వీని యొక్కఉత్పత్తి ఇతరపెట్టుబడిదారీ దేశాల్లోకంటే ఎక్కువగానే వుంది. 1927 నాటికి రష్యాలో 20,000, మోటార్లు మాత్రమే ఉండేవి. నిత్యనారాయణ వెళ్ళిననాటికి రష్యాలో నాల్గులక్షల మోటార్లుఉన్నాయి. అంత ఎక్కువగా పెరిగినా అవన్నీ సమిష్టిక్షేత్రాలకీ, కార్ఖానాలకీ సరిపడకుండా ఉండడంచేత ప్రజల విహారానికి తగినన్ని లభ్యంకాలేదు.

మూడోది ఉద్యోగుల సామర్థ్యాన్ని గురించి. కాపిటలిస్టు దేశాలలో వలెగాక, రష్యాదేశంలో మూలమూలంకంతకూ విజ్ఞానం, చైతన్యం, కలిగిస్తూండడంచేత ప్రతిశాఖ విపరీతంగా పెంచివేయబడవలసివచ్చింది. అవన్నీ నిర్వహించబడాలి అంటే, దేశంలోని కూలీవర్గము నుండే చదువుకున్నవారు రావాలి కదా? విద్యావిషయంలో చాలాఅభివృద్ధిచెందిన దేశాలలోకూడాఅటువంటివిధానం అవలంబించబడేటట్లయితే సమర్థులయిన ఉద్యోగులకోసం తడుముకొనవలసివస్తుంది. అల్లాంటప్పుడు రష్యావంటి వెనుకబడియున్న దేశంలో సమర్థులు దొరకడం ఎంతకష్టం? సమర్థులు లేరని రష్యా తనప్రయత్నాలు వెనుకబెట్టలేదు. అనుభవం లేనివారితోనే పనినడిపి అభివృద్ధిమార్గంలోకి నడుస్తూంది. చేతకానివారిని అనుభవజ్ఞులను చేస్తూంది. అంతవరకు విద్యాసంస్కారముకూడా కలిగించబడని పీడితవర్గాలనుంచి క్రొత్తగా వచ్చిన వారినుండి అంతమాత్రపు చాతుర్యం కూడా ఆశించడం కష్టమే.

ఇంక స్టాలిన్‌కు రష్యన్ ప్రభుత్వంలో అధికారాన్నిగురించి. ప్రభుత్వంలో స్టాలిన్‌కు ఏమాత్రపు సంబంధంలేదు. కేవలం రష్యను ప్రభుత్వంలో కమ్యూనిస్టులకుగల పైచేయి, ప్రజలకు వారిపైగల అచంచల విశ్వాసము వలననే కలిగింది. కమ్యూనిస్టులు తమపార్టీ నిర్ణయాల ననుసరించి తమఅధికారాల్ని సాగిస్తున్నారు. ఆపార్టీకి స్టాలిన్ సెక్రటరీ మాత్రమే. విశేషప్రతిభావంతుడు, అనుభవముగల సెక్రటరీకి పార్టీనిర్ణయాలలో పైచేయి ఉండడంలో ఆశ్చర్యం లేదు. "స్టాలిన్" నేడు పార్టీకి సెక్రటరీకూడా కాదు. కాని, ఆతనికిగల అనుభవం ఆపెద్దతనాన్ని నిలువ పెడుతూంది. ఇంక కార్యదర్శిగా యున్నపుడు ఆతని అభిప్రాయాలు పార్టీకి సలహాలు. కమ్యూనిస్టుల్ని గౌరవించే ప్రజలకి ఆజ్ఞలు. 'స్టాలిన్'కి గల నియంతృత్వం ఇంతమాత్రమే.

ఇంక, బెనర్జీ పుస్తకం పొడుగునా రష్యనులు వర్గభేదం అంతరింప చేశామని చెప్పుకుంటూన్నట్లు, ఆచరణలో అది భగ్నమైనట్లు నిరూపించడానికి చాలా తంటాలుపడ్డాడు. రష్యనురాజ్యాంగవిధానంలో నేడు ఒక వర్గమే (ప్రొలిటేరియటు) అధికారంలోవుంది. ఇదివరకు బూర్జువాలు రాజ్యాంగం నిర్వహించేవారు. నేడు ప్రొలిటేరియటు నిర్వహిస్తున్నారు. కాని, ఈప్రొలిటేరియటువర్గాధికారం మూలకంగా వర్గభేదాన్ని నాశనం చేయగలమని వారి నమ్మకం.

మరొకటి. ఆస్తులు కలిగిఉండడం విషయంలో బెనర్జీ కంగారుపడి పాఠకులకు చికాకు కలిగించేడు. రష్యాలోనేకాదు, కమ్యూనిస్టులు, వ్యక్తిగతమైన ఆస్తి (Personal Property) ఉండకూడదనిచెప్పరు. ప్రత్యేకపుటాస్తి (Private Property ) హక్కు-కలిగి దానిద్వారా ఇతరులను దోచుకునేటందు కవకాశాలు కలిగియుండడానికి అభ్యంతరం చెప్పుతారు.

ఈమాదిరి చిన్న విషయాలు విడిచిపెట్టితే మొత్తం మీద ఈపుస్తకంలో బెనర్జీ రష్యాను గురించిన అనేకసందేహాలకు సమాధానం ఇచ్చేడు. ఇది ఇంగ్లీషు—హిందీ భాషలలో చాలా ప్రచారం మెప్పుకూడా పొందింది. నాస్నేహితులు పెక్కురు దీనిని అభినందించుతూండడంచేత, గ్రంథం అభినందనాలకి తగియుండడంచేత ప్రజాసామాన్యానికి దీనిని చదివే అవకాశంకలిగించాలనే ఆసక్తితో అనువదించేను. ఈఅనువాదం ఆంధ్రసోదరుల ఆదరాభిమానాల్ని పొందగలదనే నాయాశ.

ముంగండ,
18 జూలై 1937.

అనువాదకుడు.

# ఉపక్రమణిక.

నాగరికత అభివృద్ధి పొందినకొలది మానవజాతి. అభివృద్ధికోసం. ప్రపంచానికి సుఖసమృద్ధులు కలుగచేయడానికోసం. నిరంతరం కొత్త కొత్త ఆలోచనలు. కొత్తకొత్త సిద్ధాంతాలు పుట్టుకొని వస్తున్నాయి. వీనిలో కమ్యూనిజము ఆధునికము. ఇంతవరకు ప్రపంచం ఏసిద్ధాంతాల ననుసరించి నడుస్తూందో అవన్నీ సాధారణప్రజలకి అపకారం చేస్తూన్నా యని కమ్యూనిస్టుల వాదన. సామ్రాజ్యవాదం, ప్రజాతంత్రవాదం, ఫాసిజం, మొదలయినవన్నీ సమాజంలోని ఒకప్రత్యేకవర్గంయొక్క లాభానికే ఉపయోగిస్తున్నాయని, ఆవర్గమైనా, ప్రపంచసమాజములోని అల్పసంఖ్యా కులవర్గమని కమ్యూనిస్టులవాదన. అందుచేత జనసామాన్యాన్ని వృద్ధిలో నికితెచ్చి ప్రపంచాన్ని సుఖసమృద్ధులతో నింపడానికి ఒక్క కమ్యూనిజమే ఉపయోగిస్తుందంటారు. కారల్‌మార్క్సు నిర్మించిన ఈఆర్థికసిద్ధాంతాలను 'నికోలాయ్‌లెనిన్' రష్యాలో కార్యరూపానికి తెచ్చేరు. ఈనూతనసిద్ధాం తాలప్రకారం రష్యా తనఇంటిని ఏలా చక్కపెట్టుకుంటూ ఉందోనని ప్రపంచం అంతా దానిమీదనే కళ్లు పెట్టుకొని చూస్తూంది.

రష్యనులు ఇంతవరకు కమ్యూనిస్టులు కారు.. సోషలిస్టుపద్ధతుల మీదనే ఇంతవరకు వారు నడుస్తున్నారు. ఈమార్గమే తమఆదర్శమైన కమ్యూనిజానికి దారితీస్తుందని వారినమ్మకం.

నేడు ప్రపంచంలోని అన్ని దేశాలలోని బుద్ధిమంతులలోను (Intellectuals) బహిరంగంగానో, రహస్యంగానో, కమ్యూనిస్టు సిద్ధాంతాలను ఆరాధించేవారు ఉన్నారు. నాగరికదేశాలన్నిటిలో అన్ని మూలల కూలీలసమ్మెలు, హర్తాళములు, రైతువిప్లవాలు, కమ్యూనిష్టుల

పోరాటాలు, మొదలయినవి తరుచుగా జరుగుతూన్నట్లు పత్రికలు చెప్పు తున్నాయి. కాని, వీనిలో భాగస్వాములుగా ఉన్నవారికి "మార్క్సు"– "లెనిన్" సిద్ధాంతాలను ఆచరణలో పెడుతూన్న రష్యాలో ఈసిద్ధాం తాలు కార్యరూపంలో పెట్టేటప్పుడు ఎటువంటి చిక్కులు కలుగుతు న్నాయో తెలియవనే నాయూహ.

విప్లవకారుల భయంకరవార్తలతో విదేశీవార్తాపత్రికలలో పేజీలకి పేజీలు నలుపుచేయబడడం చూసి, ఆకర్షితుడనై, ఆరహస్యమయదేశాన్ని కళ్లారా చూడాలనే ఉద్దేశ్యంతో 1933లో బయలుదేరివెళ్ళి నాకుగల స్వల్ప కాలంలో చూడగలిగినవన్నీ చూసేను. తిరిగివచ్చినాక 'Modern Review' లోను 'విశాలభారత' లోను కొన్ని వ్యాసాలు వ్రాసేను. అవి పాఠకులను అధికంగా ఆకర్షించడంచేత పుస్తకరూపంలో నాయాత్రా వృత్తాంతాన్ని అంతనీ పాఠకుల ఎదుట పెడుతున్నాను. రష్యామీద పుస్త కాలు వ్రాసేవారు రష్యనుశబ్దాలను అనేకతరహాలుగా ఉచ్చరిస్తూంటారు. అందువలన 'Kolkhoz' - 'Fabkom' మొదలయిన వాని ఉచ్చారణలో పాఠకులకి చాలా తేడాలు కనిపిస్తాయి.

వేరు వేరు అధ్యాయాలలో వేరు వేరు విషయాల్నిగురించి వ్రాయక ప్రయాణంలో ఎక్కడచూసినవాని నక్కడనే వ్రాస్తూ రావడంచేత ఒకే విషయాన్నిగురించి తెలుసుకొనడానికి రెండు–మూడు అధ్యాయాలు చూడ వలసివస్తుంది. ఇందుకు పాఠకులు నన్నుక్షమించెదరు గాక.

మే. 1934.
లవపుర–వీరభూమ్. } నిత్య నారాయణ బెనర్జీ.

౧

౧౯౩౩ నాటిమాట.

"ఫిన్‌లాండ్" యొక్క రాజధానియైన ''హెల్సింగ్‌ఫోర్సు''లో బయలుదేరి, పద్ధాఱుగు గంటలకాలం ప్రయాణం చేసి, రైలుబండి ''లెనిన్ గ్రాడ్'' స్టేషనులో ఆగింది. నేనూ రైలుదిగేను.

జనవరి నెల. తెల్లని మంచు నిరంతరాయంగా కురుస్తూంది. శీతలం భూమియొక్క పచ్చదనాన్ని మాపైని, పైన తెల్లని బట్టలా కప్పేసింది. పచ్చికమైదానాలు, పచ్చనిచేలు తెల్లగా అయిపోయినాయి. ఇళ్ళ కప్పులన్నీ తెల్లగా ఉన్నాయి. ఎప్పుడూ పచ్చగా తలలెత్తుకొని ఉండే చెట్లుసహా తెల్లనిమంచుబరువుకి వంగిపోయాయి. అబ్బ! ఆరోజు ప్రొద్దుట ఎంతో చలిగా వుంది. నరాలన్నీ బిగిసిపోతున్నాయి. అల్లాంటి చలిని బ్రతికియుండగా మరచిపోను. ''సెంటీగ్రేడ్ థర్మామీటర్'' లోని పాదరసం సున్నకిగూడా 20° తక్కువ చూపిస్తూంది. అంటే మనుష్యుని వంటి వేడి కంటె, 102° కంటెకూడా తక్కువగా యుందన్న మాట.

రెండుమూడు నిముషాలలో రైలంతా ఖాళీ అయిపోయింది. నాపెట్టెలోనే ఇంగ్లీషు మాటాడగల ఒక పెద్దమనిషి ఉంటే," యాత్రిక శాఖ" వారి ఏజంటును తెలుసుకొనడానికి కాస్తసహాయం చేయండని

ఆయనని కోరేను. విదేశీప్రయాణీకులకి తక్కువఖర్చులో దేశంలో ముఖ్యంగా చూడదగిన ప్రదేశాలన్నీ చూపించేటందుకై "యాత్రికశాఖ" (Intourist )నొకదానిని రష్యాప్రభుత్వంవారు స్థాపించేరు. నేనుకూడా ఈ యాత్రికశాఖవారి సహాయంతోనే రష్యాలో ప్రయాణం చేసేను. ఆపెద్దమనిషి నాసామాను కూడా తనకూలీ నెత్తికే ఎత్తి, "యాత్రికశాఖ" వారి ఏజంటుకోసం వెదకడం ఆరంభించేడు. ''కోపెన్‌హేగన్''లో రష్యాయాత్రకి టిక్కట్టు కొన్నప్పుడే, ఆమేనేజరు ''లెనిన్‌గ్రాడ్'' స్టేషన్‌లో అడుగుపెట్టగానే తమ ఏ జం టు వచ్చికలుసుకుంటాడని చెప్పేడు.

మేము అయిదునిమిషాల దాకా ఏజంటుకోసం చూస్తూ నిలుచు న్నాము. వేడిదేశాలలో ఉండే నావంటి వాడికి ఆ అయిదునిమిషాలూ చాలు, రక్తం గడ్డకట్టిపోవడానికి. చేతులు చలికి కొంకరించుకు పోతు న్నాయి. కాలివేళ్ళు బిగిసిపోతున్నాయి. చెవులు ఎర్రబడిపోయినాయి. పైనున్న రుమాలు తడిసిపోయింది. నరాలన్నీ సలుపుతున్నాయి. అబ్బ! చలి ఎంతభయంకరంగా వుంది? అయితేమాత్రం చేసేదేముంది? దిక్కా? మొక్కా? నాకీదేశంలో మాట్లాడే భాషలో ఒక్కముక్క కూడా తెలి యదు. అయినా అదో పెద్దచిక్కు గాదు. ఉన్నచిక్కేమిటంటే ఇది అన్ని దేశాలవంటిదీ కాదు. ఇక్కడి చట్టాలే వేరు. ప్రపంచానికంతకీ విపరీతం. అక్కడ ధనికులు, దుర్మార్గులు—సమాజశత్రువులు గాను లెక్క. ఆభయం తోటే నేను కూలీని పిలవలేకపోయాను. మోటారూ కుదుర్చుకోలేక పోయాను. ఇక్కడ కూలీకి డబ్బేలా ఈయాలో ఎవరికి తెలుసును? తిన్నగా కూలివాని చేతిలో డబ్బుపెడితే, సామ్యవాదప్రభుత్వం దోషిగా ఎంచి నన్ను పట్టుకుంటే? అల్లాగంటే ఈచలిని భరించడం ఏలాగ? నేను ఆప్లాట్‌ఫారంమీద అటూ ఇటూ తిరగడం ఆరంభించేను. అటూ

ఇటూ తిరుగుతూవుంటే కాస్త ఒళ్లు వేడెక్కింది. ప్రభుత్వంచేసిన ఏర్పాట్లతో తమదేశంలో తిరగడానికి వచ్చిన విదేశీయుని విషయంలో ఇంత ఉపేక్షయా? ఇటువంటి అసామర్థ్యానికి వాళ్లో నేనే తిట్టుకున్నాను.

ఇంతలోకీ ఒకపడుచుపిల్ల వచ్చి "మీరేనా" కోపెన్‌హేగన్ నుంచివస్తూంట?" అని స్వచ్ఛమైన ఆంగ్లభాషలో ప్రశ్నించింది.

"ఔను. మీరు యాత్రికశాఖవారి ఏజెంటా ఏమి?" అన్నాను నేను.

"ఔను."

ఆలస్యం అయినందుకు క్షమార్పణనైనా చెప్పకుండా కూలీ నెత్తికి సామానంతా ఎత్తి, స్టేషను బయటనున్న మోటారులో పెట్టించింది. అది చూశాక కాస్త ప్రాణం కుదుటబడింది. బ్రదికేమురా బాబూ! అనుకున్నాను. మేము ఇద్దరం పోయి మోటారులో కూర్చున్నాము. ఆపిల్ల ఆకూలివానిచేతిలో డబ్బులకుబదులు ఒకచీటీ పెట్టింది. కారు నడుస్తూవుంది. మేము ఇద్దరం ఎంతోకాలం నుంచి పరిచయం ఉన్నట్లుగా మాటలాడుకుంటున్నాము. మామాటలు, నవ్వులు, చూసినవాడెవ్వడూ మాపరిచయం రెండుమూడు నిముషాలనుంచేయని అనుకోలేడు. ఆమె సంభాషణ, ఆతీరు, చాల ఆకర్షకంగా వుంది. పెట్టుబడిదారుల దేశాలలోని పత్రికలు చూశాక రష్యాదేశంలో ప్రజలు చాలా పెడసరంగాను కఠినంగాను ఉంటారనీ, వాళ్ల మొహాన నవ్వెప్పుడూ కనపడదనీ, వాళ్లకి సరదా అంటేనూ, కళలంటేనూ, ఏమిటో కూడా తెలియదనీ, నామనస్సులో ఒకభావన ఏర్పడిపోయింది. కాని, ఆపిల్లతో కొంచెంసేపు మాటలాడేటప్పటికే ఆభావన ఎగిరిపోయింది. యూరపులోని ఇతరదేశీయులలాగే రష్యనులుకూడా నాగరికులని నాకు అర్థం కాసాగింది.

"స్టేషనువద్ద కూలీలు ఆశ్టేమంది చేరనుకుంటాను." అని నేను సంభాషణ నారంభించేను.

"ఔను. ఇప్పుడు అంతా ఎవరిసామానును వారే మోసుకుపోతున్నారు. చిన్నపెట్టి తీసుకొనిరావడానికి కూలీలు కావాలని సూకరాలు పోయే ఆబూర్జువాలు ఇప్పుడు లేరు."

"అయినా పెద్దపెద్ద సామానులకోసం కూలీలు అవసరమేగా?"

"ఔను. అందుకే కొద్దిమంది కూలీలను స్టేషనులో ఉంచేరు. మాకార్ఖానాలలోను, పొలాలలోను, పనిచేయడానికి ఎంతోమంది కూలీలు అవసరమని మీకు తెలియనేతెలుసు. అందుచేతనే ఈపనులకి ఇంతమంది కంటె ఎక్కువ ఉంచలేకున్నాం."

మామోటారు "లెనిన్‌గ్రాడ్" వీధులగుండా పోతూంది. బాటకిరుప్రక్కలా చాలాప్రదేశాలలో సగంసగం కట్టినఇళ్లు కనపడ్డాయి. నేను ఆఇళ్లు ఆలాగే ఉండిపోవడానికి కారణం ఏమిటని అడిగేను.

"చలిరోజుల్లో హోరుగాలిలో ఈలాగంటి పనులు చేయడం కష్టం. అందుచేత ఇళ్లు కట్టే కూలీలు చేలల్లోకీ, యంత్రాలయాలలోకీ, పంపించి వేయబడ్డారు. మళ్లీ వేసవికాలంలో వచ్చి, సగంకట్టి విడిచిన ఈయిళ్లపని పూర్తిచేస్తారు.

కొంచెం సేపాగి మళ్లీ అడిగేను.

"వేసవి కాలంలో పొలాలలోకూడా పనులరద్దీ ఉంటుందికదా? అప్పుడే ఈఇళ్లు కట్టడానికీ కూలీలు కావలెనామె. వేసవికాలంలో మిల్లులు పనిచేస్తూనే ఉంటాయి. కాని, నిద్రపోవుకదా. అల్లాంటప్పుడు నేడు మిల్లులలోకి పంపినకూలీలని, ఎండలలో తిరిగిపిలిపిస్తే మీమిల్లులు కూలీలు చాలక పని మొండి పడిపోదూ? లేకుంటే, కూలీలందర్నీ ఒకవేళ పనిలో ప్రవేశపెట్టడమే లేదేమో!"

"అబ్బే! అబ్బే!! మాకు కూలీల అవసరం చాలావుంది. మాదేశంలో తగినంతమంది కూలీలు లేనేలేరు."

"కావచ్చు. నేడు మీదేశంలో జరగవలసినపని కావలసినంతగా వుంది. మీరు ఒకకొత్త దేశాన్నే సృష్టిస్తున్నారు. వ్యవసాయప్రధానమైన దేశాన్ని పారిశ్రామికదేశంగా మార్చేస్తున్నారు. వ్యర్థంగా బంజరు పడి వున్న భూము లెన్నో దున్నాలి. గనులు తవ్వాలి. కొత్త ఇంజన్లు తయారు చేయాలి. బాటలు వేయాలి. ఇళ్ళు కట్టాలి. కనక ఇంతమందికీ పనిచెప్పు తూన్నారు. కాని, ఈఅభివృద్ధికి సంబంధించిన పనులన్నీ ఏదో ఒకనాటికి పూర్తికాకపోవు. ఆనాడు అమెరికాలోలాగే మీదేశంలోకూడా ఖర్చుకంటె ఉత్పత్తి ఎక్కువ అవుతుంది. అప్పుడేమిటి చేయదలచుకొన్నారు? ఈవేళ పనులలో మునిగియున్న కూలీలకి ఆనాడు పనేమిటి చెప్పుతారు. ఈవేళ పెట్టుబడిదారుల దేశాలలో గొప్పబాధ కలగచేస్తూన్న నిరుద్యోగసమస్య, ఆనాడు మెదేశంలో బాధకరంగా సిద్ధం అవుతుంది."

స్వాభావికమైన చిరునవ్వుతో ఆమె అంతా వింది.

"అవదు. ఎప్పుడూ అవదు. ఇది రష్యా కాని అమెరికా కాదు. నేడు ప్రపంచాన్ని బాధిస్తూన్న నిరుద్యోగసమస్య కంతకీ కారణం పెట్టుబడిదారులు ఉన్నదంతా ఊర్చివేయడమే. మాదేశంలో ఒకరిని పీక్కుని తిందామనే వారికి చోటులేదు. ఇక్కడ ఎవ్వడూ పరాయివాని కష్టఫలితాన్ని తేరగా తినడానికి ఆశపడడు. ప్రతిమనిషీ రోజుకి ఏడుగంటల చొప్పున పనిచేస్తేనే మాకవసరమైన దానికంటె ఎక్కువ ఉత్పత్తి చేయగలుగుతామని తోచినప్పుడు, పనివారిని తగ్గించడానికిబదులు పనిచేసే గంటల్ని తగ్గించుకుంటాము. ఊ. ఇంక ఉత్పత్తి దానంతట యదేతగ్గిపోతుంది. నిర్వ్యాపారత పుట్టనే పుట్టదు. మొట్టమొదట్లో పనివారిచేత రోజుకి ఎనిమిదిగంటలు పనిపుచ్చుకొనేవాళ్ళము. ఈమధ్యనే దానిని తగ్గించి ఏడుగంటలు చేశాము. అవసరం అయితే ఆరు. అయిదు. నాలుగుగంటలకి కూడా తగ్గించివేస్తాము."

మేము ఒక సన్నని ద్వారం గుండా వెళ్లేము. పాతపట్టణానికి ఇదేద్వారమని ఆమె చెప్పింది. ఈద్వారానికి ఆవలనే జారుల కాలంలో పెట్టుబడిదారులు, వర్తకులు, నివసిస్తూ ఉండేవారు. ఇక్కడిప్రజలు నా కంటికి పెట్టుబడిదారీదేశాలలోని ప్రజలకంటె బీదవారుగా కనిపించేరు. ఈ కొత్తదేశాన్ని ఒకదానినీ విడిచిపెడితే, యూరపులోని మిగిలిన దేశాలన్నిటిలోనూ ప్రజలు శుభ్రమైన బట్టలూ, చురుకైన ఆకారాలూ, కలిగి ఉంటారు. మెరుస్తూ ఉండే బళ్ళూ, బాటకి ఈప్రక్కన ఆప్రక్కన ఉండే అద్దాలకిటికీలు గలఇండ్లలోని దుకాణాలూ, చూస్తేనే అక్కడి ప్రజల జీవితవ్యయప్రమాణము తెలిసిపోతుంది. కాని, రష్యాలోపద్ధతి దానికి కేవలం వ్యతిరేకం.

ట్రాంబండ్లు— రెండూ—మూడూ ఒక్కొక్కప్పుడు నాలుగేసి కూడా కలిసి రోడ్లమీద పరుగుపెట్టుతూవుంటాయి. చాలమంది బాటసారులు ఫుట్‌బోర్డులమీద రేలింగులు పట్టుకొని నిలుచున్నారు. మోటార్లు తప్పి జారి ఒకటో రెండో అప్పుడప్పుడు కనిపిస్తూవచ్చేయి. రోడ్డుమీద కాస్త శుభ్రంగా అందంగా ఉన్న దుకాణం ఒక్కటీలేదు. మంచుకురిసి కరిగిపోవడం చేత రోడ్లన్నీ చాలా జారుడుగాఉన్నాయి.

ఆఖరుకి మా మోటారు "అక్టోబరుహోటలు" దగ్గిరకి వచ్చి ఆగింది. హోటలు మంచి అందంగా రాజభవనంలా వుంది. కొత్తరకం అద్దాల తిరుగుడురతుపులు, అందమైనమెట్లు, అలంకరించబడ్డ పెద్దపెద్ద గదులు. మొత్తంమీద హోటలు చాలా బాగావుంది. నన్ను హోటలు కార్యదర్శి దగ్గరకు తీసుకొనిపోయేరు. చదువుకొన్న పడుచువాడొకడు కార్యదర్శి. విద్యావంతుడైన రష్యన్‌యువకునితో మాటలాడేటందుకు దొరకిన ఈయవకాశాన్ని నేజారవిడువ తలుచుకోలేదు. ప్రజలకి ఈయబడుతూవున్న జీతాలని గురించి ఆతనిని అడిగితెలుసుకున్నాను. ప్రతిమని

షికీ అతని యోగ్యత ననుసరించి ప్రభుత్వం వేతనం ఇస్తుంది. కార్ఖానా లోని మామూలు కూలీకంటె ఇంజనీయరుయొక్క జీతం ఎక్కువగానే యుంటుంది. హోటలులోని వంటవానికంటె మేనేజరుకు జీతం ఎక్కువ. ఈవిషయంలో పెట్టుబడిదారీదేశాలకీ రష్యాకీ తేడా ఎక్కువలేదు. కాని ఒక్కటి. రష్యాలో ఎవ్వనికీ స్వంతంగా వ్యాపారం చేసుకుందుకుకాని, ఆస్తి పోగుచేసుకుందుకుగాని, అధికారంలేదు. ఈవిషయం నాకు సరిగ్గా బోధపడలేదు.

"సోషలిస్టుల సమాజంలోని ఎక్కువ-తక్కువ తరగతుల్ని పోగొట్టాలని చెప్పుతున్నారు. కాని, ఏదేశంలోకూడా జీతాలలో ఎక్కువతక్కువ లున్నాయే. మరిసమాజంలోని తరగతు లేలాగ నశిస్తాయి? మీరు "జార్" కాలంనాటి భేదాలు తొలగించి కొత్త తరగతులు సృష్టించేరన్నమాట."

"కొంతమందివద్ద ఇతరులకంటె ఎక్కువధనం వుంటుందని కాబోలు మీయూహ. కాని, జీతం ఎక్కువ తెచ్చుకుంటేమాత్రం తరగతు లేలాగ ఏర్పడతాయి?"

"మునుపు ఏలాపుట్టేయో అల్లాగే. యూరపులో మతభేదం గాని, వర్ణభేదం కాని, లేవు. అయినా, యూరపియన్ సమాజంలో ధనంవలననే వర్గభేదం కలిగిందని మీకు తెలియదు?"

కార్యదర్శి కళ్ళెర్రపడ్డాయి.

"ఏమండోయ్! రష్యాలో ధనానికి విలువ తగ్గిపోతూవుంది. ఇతరదేశాలలో ఆలాకాదు. ఒకడు ఇతరులకంటె ఎక్కువసంపాదించి ఎక్కువగా పోగుచేస్తాడనే అనండి. కాని, ఆతడు ఆడబ్బు నేమి చేసుకుంటాడు? ఆడబ్బుతో అతడేమీ వ్యవహారం చేయలేడు. అతడు తనస్వంతానికి ఇల్లు కొనలేడు. స్వంతానికి కార్లు-గిర్లు కొని షికారుతిరగలేడు.

తనపిల్లలకి పనిపాటలవసరంలేకుండా పోగుచేసి ఇచ్చిపోలేడు. అతడు చేయగలిగినదల్లా వారానికి ఇంకో నాల్గయిదుసూయలు సినీమాలకి పోవడం, ఇంకో రెండుజతల బూట్లు కొనుక్కోవడం, ఇంకో నాలుగు కుర్చీలో, మేజాలో కొనుక్కోవడంతప్ప ఇంకేమీ చేయలేడు. సరే. ఇంక ఆతడు అల్లాచావగానే ఇల్లా ఆతనికి అవసరంలేని ఆస్తినంతనీ ప్రభుత్వం స్వాధీనం చేసుకుంటుంది. అల్లాంటప్పుడు ఇంక తరగతులు ఏలాగ పుట్టుతాయి?"

"కాని, ఈనాడు కూడా మీదేశంలో రెండుతరగతులున్నాయని మీరు ఒప్పుకొనకతప్పదు. ఒకశ్రేణికి చెందుతారు, మీరూ ఈమె. (ఏజంటునుచూపించేను.) మీవద్ద శుభ్రమైన బట్టలున్నాయి. మంచిరకం బూట్లు, అందమైనకోట్లు ఉన్నాయి. ఇంక మీరు ''ప్రొలిటేరియట్లు'' అనేసామాన్య జనానికి మాసికలతోయున్న మురికిగుడ్డలు, గొర్రెచర్మాలతో కుట్టిన ఓవరుకోట్లు, పిగిలి చిరిగి పోయిన కాలిజోళ్లు, చామనచాయరంగు, ఉబికి నరాలతోనున్న మణికట్లు, తప్ప వేరుకవపడడం లేదు."

నామాటలకి ఆతనికి చాలాకోపం వచ్చింది.

''మేముకూడా 'ప్రొలిటేరియట్ల' మే''

నేను నవ్వేను.—"కాని, నేను అంగీకరించలేను. మీరు ఉత్తమశ్రేణికి సంబంధించినవారనే నానమ్మకం. మీదేశంలోకూడా ఇంకావర్గభేదం వుంది.

ఈమారాతడు అంగీకరించేడు.

''ఔను. కాని, మేము ఇప్పటివరకు సోషలిష్టులమే. కమ్యూనిస్టులము కాము. మాదేశంలో కమ్యూనిజం స్థాపించబడినాక డబ్బు ఇచ్చి పుచ్చుకొనడాలు కట్టిపెట్టివేస్తాము. అప్పుడు ఎవ్వడికీ ధనం ఇవ్వరు. ప్రతివాడూ పని చేసితీరాలి. ప్రతివాడూ సమాజానికి ఏమిసహాయం చేయగ

లడోచేస్తాడు. దానికి ప్రతిఫలరూపంలో ఆతనికి కావలసిన దానిని ప్రభుత్వం ఇస్తుంది. కాని, ఒక్కటి. అతని అవసరాలకి చాలినంత కాని, ఎక్కువగా గాని, ఇవ్వబడదు. "కమ్యూనిజం" చేరేలోపున సోషలిజం ఒకమెట్టు మాత్రమే. అది సాధనమాత్రమే— కాని, లక్ష్యం కాదు. ఈవిషయం ప్రజలకి బాగానచ్చచెప్పవలసియుంది. వారి బుద్ధికి ఈవిషయం పట్టించాలి. కనుకనే మాఅభివృద్ధి చాలా నెమ్మదిగా జరుగుతూవుంది. మాలక్ష్యం సాధించబడినరోజున ప్రజలలో వర్గభేదం నశిస్తుంది.''

''ఆరోజు ఎప్పటికైనా వస్తుందా ?"

"ఆహా ! పదేళ్లు కావచ్చు. ఇరవై-ముప్పై- ఏభై ఏళ్ళయినా పట్టవచ్చు. ఎప్పుడు వస్తుందో ఎవ్వరూ చెప్పలేరు. కాని, ఏదో ఒక రోజున వచ్చితీరుతుంది."

ఈమాటలు చెప్పుతూవుంటే అతనికళ్ళు నక్షత్రాలలా మెరిసిపోయినాయి. అతని ముఖంలో దృఢవిశ్వాసం ప్రతిబింబించింది.

''ప్రతిమనిషికీ పుట్టే కోరికలు తీర్చడం ఎన్నటికైనా సాధ్యం అవుతుందా ? నేను రోజూ సాయంకాలం మోటారులో షికారుకి పోవాలంటాను, ప్రభుత్వం నాకోరికతీర్చగలదా ?''

''తప్పకుండా. ప్రతిమనిషికీ మోటారును ఈయగలిగినపుడు అల్లాగే ఇస్తుంది. లేకుంటే నల్గురైదుగురు కలిసివున్న కుటుంబాలకొక్కొక్కటి చొప్పునో, లేకుంటే ఒకరోజున ఒకరికీ మరొకరోజున ఇంకొకరికీ, వంతులువారీగానో ఇస్తారు. మొత్తంమీద దేశంలోవున్న ప్రతిమనిషికీ, ప్రతివస్తువూ సమానంగా అందుబాటులో వుండాలి."

"అయితే, నాకు కావలసిన వస్తువులన్నీ ప్రభుత్వం ఈయడానికి సిద్ధంఅయితే ఇంక నేను పనిచేస్తానా ?''

"మీచేత బలవంతంగా పని చేయిస్తారు. పనిచేసేవరకు మీకేమీ

ఇవ్వరు. ఆకలికి మాడిచావవలసిందే. "

"బలవంతంగా పనిచేయిస్తే మనస్సుంచి, శక్తికొలది, పనిచేయడం జరుగుతుందా ? పని పాడై ఊరుకుంటుంది."

"ఏమండోయ్! ఇది మీపెట్టుబడిదారుల మానసికప్రవృత్తుల ఫలితం. మేము చెప్తూన్నది ఒకక్రొత్తరకం పాఠం. మాకు పనిచేయడం ఒకసరదా. పనిచేయకుండా వుండే బద్ధకస్తుడు మాదృష్టిలో దేశద్రోహి, సమాజశత్రువు. సమాజంయొక్క అభివృద్ధికోసం పనిచేయడమే ధర్మమని మాపాఠం."

మాటమధ్య మా "మార్గదర్శిక" భుజంపట్టి,

"మిస్టర్. బెనరజీ! (రష్యనులు బెనర్జీ అనే శబ్దాన్ని ఈవిధంగానే ఉచ్చరిస్తారు.) మీరు భోజనగృహంలోనికి నడవండి. తిండితిని వెంటనే సిద్ధం కాండి. సాధ్యమైనంత తొందరలో నేను తిరిగివచ్చి ఊరుచూపిరావడానికి తీసుకుపోతాను."

అంది. కార్యదర్శి నాచేతికి భోజనానికి కొన్ని చీట్లనిచ్చేడు.

"వీటిని జాగ్రత్తపెట్టుకొనండి. ఒక్క టిక్కట్టు పారవేసుకున్నారంటే ఒకపూట భోజనానికి నీళ్లు వదులుకోవలసిందే."

నేను "మార్గదర్శికతో" కలసి ఒకసావడిలోకి వెళ్ళేను. అక్కడ నాలాగే యాత్రకి వచ్చినజనం చాలామంది యున్నారు. వారంతా ఆరోజుననే "లెనిన్‌గ్రాడ్" నుంచి "మాస్కో" వెళ్లుతున్నారు. అందులో ముగ్గురు— వారిలోనొక సన్నని పడుచుకూడా వుంది— అమెరికానుంచి వచ్చేరు. ఒకడు ఆస్ట్రేలియానుండి వచ్చేడు,

"ఈదేశం మీకేలాగ వుంది?" అని వారిని అడిగేను.

అందరూ ఒక్కమాటు, ఒకేకంఠంతో, ఉద్రేకంతో,

"చాలా అద్భుతంగా వుంది."

అన్నారు. ఆస్ట్రేలియానుంచివచ్చిన ఆయన తనబట్టతలనిమురుకుంటూ, బలిష్టములైన తనపొడుగుచేతులు కుదుపుకుంటూ, "మీరు చూడడం లేదు? వీళ్ల దేశంలో నిరుద్యోగం లేనేలేదు. ఎంత ఆశ్చర్యకరమైన విషయమో చూడండి. వీళ్లు చాలా గొప్పవిషయాన్నిసాధించగలిగేరు." అన్నాడు.

"కాని, తమకు విరుద్ధంగా ఉన్న ప్రజల అభిప్రాయాలని వీరు ఏవిధంగా అణచేస్తున్నారో చూసేరా? ఇందువలన మనుష్యులకున్న వ్యక్తిస్వాతంత్ర్యం లుప్తమైపోవడం లేదు? మీరు వీళ్లని ఎందుకు పొగుడుతారు?"

అమెరికానుంచివచ్చిన ఆపడుచు అందుకుంది.

"ఇది అన్నిదేశాలలోను జరుగుతూనే వుంది. ఏదేశంలోనయినా సరే ఆదేశపు ప్రభుత్వాన్ని ఎదిరించనంతవరకే మనుష్యులు తమస్వాతంత్ర్యం కాపాడుకోగలుగుతున్నారు. ఆహద్దు దాటితే అవంతకూడా స్వేచ్ఛ ఉండదు. మాదేశంలో నిరుద్యోగులమీద తుపాకులు కాల్చేరు. వాటిని చూశారా? ఇంగ్లండులో నిరుద్యోగులైన కూలీల జట్లని (Hunger marchers) ఏమిచేశారో చూడండి. ఇటలీలోని ఫాసిస్టుల్ని చూడండి. జర్మనీలో నాజీలని ఏమి చేసేవారో జ్ఞాపకంలేదు? (ఒకప్పుడు నాజీల సంఘాలు అక్రమసంఘాలుగా ఉండేవి.) ఈప్రజాస్వామ్య దేశాలన్నీ ఏమిచేస్తున్నాయి? కేవలంపాక్షికప్రభుత్వం—పాక్షికశాసనాలు. ఈవిషయంలో రష్యా అన్నిదేశాలలోలాగే వుంది."

" అయితే రష్యా గర్వించతగినవిషయం ఏముంది? అది తన ప్రజలకి నేర్పుతూవున్న కొత్తసంగతి ఏముంది? ఇంత రక్తపాతం జరిగినతర్వాత వారు సాధించినదేమిటి?"

"ఏకొద్దిమందికో బదులు జనసామాన్యం దేశంలో అధికారం

కలిగిఉన్నారిక్కడ. ఇదేం చిన్నమాటా?"

"ఆకొద్దిమందినీ దండించి, దేశంలోనుంచితరిమి, పశువుల్ని కొట్టినట్లు కొట్టి చంపుతున్నారు."

"అదిస్వాభావికమే!" అని ఆస్ట్రేలియావాసి గర్జించేడు. పెట్టుబడిదారీవిధానానికి కేంద్రమువంటి అమెరికాలో నివసించే ప్రజలలోకూడా రష్యా కలిగించినమార్పుకి నాకు చాలా ఆశ్చర్యం కలిగింది. ఇంతలోకే వారి "మార్గదర్శిక" వచ్చి "మోటారు సిద్ధంగా వుంది" అంది. వారంతా నాతోచెప్పి బయలుదేరేరు. వెళ్ళేటప్పుడు ఆస్ట్రేలియావాసి "మాస్కోలో మళ్ళీకలుసుకొనగల మనుకుంటా" నన్నాడు.

నేను భోజనం చేశాను. నాజీవితమధ్యంలో అంత పాడుతిండి ఎన్నడూ తినలేదు. * ఉడికించిన అన్ని బంగాళాదుంపలూ, వెన్నలేని

---

* 1931-32లు రష్యాకు పరీక్షాదినాలు. ప్రపంచం అంతటిలో వలెనే రష్యాలోకూడా చాలా భాగాలలో పంటలు పూర్ణంగా చెడిపోయినాయి. నానా రాష్ట్రాలలో సోవియటుశత్రువుల ప్రోత్సాహం పొంది రైతులు, పైరుచేయడం మానివేశారు. పశువుల్ని చంపివేశారు. ఈవిధమైన గృహకలహఫలితాలు 1933లో కూడా తమ ప్రభావాన్ని సాగించేయి.

కాని, 1933 సెప్టెంబరులో, ఆయేటి పంటను పంచగా, ఒకమనిషి ఒకరోజున చేసినపనికి ప్రతిఫలంగా 78 కోపెక్కులు, 6.5 కిలోగ్రాములు ధాన్యము, 18 కిలోగ్రాముల గడ్డి లభించింది. ఇది గతసంవత్సరాదాయము కంటె 4-5 రెట్లు ఎక్కువ. (సోవియటు కమ్యూనిజం.)

వ్యవసాయికంగా దివాలా ఎత్తినకొత్తలో నిత్యనారాయణస్థితి రష్యాలో ఇంతకంటె ఎక్కువ కనపడుతుందనుకోవడం కూడా అసంభవం.

ఎర్రనిరొట్టెముక్కా (Brown bread) తిన్నాను. వాళ్ళ నల్లరొట్టె చాలా పాడువాసన వేస్తూంది. కుక్కలుకూడా దానిని మూచూస్తాయని నేననుకోను.

''గోమాంసంగాని పందిమాంసంగాని నేను తినను. అందుచేత కోడిమాంసంగాని, చేపలో—గొర్రెమాంసమో ఉంటే తెచ్చిపెట్టండి''

అని వడ్డించేవానిని అడిగేను. కోడిగాని, గొర్రెకాని, అక్కడ దొరకదు. డబ్బాలలో నిలువచేసిన ఉప్పుచేపముక్క ఒకటి తెచ్చి నాకిచ్చేడు. ఆముక్కయినా రుచిలేదు. ఉప్పుకంటేనూ ఉప్పగావుంది.

''పాలు దొరుకుతాయా?''

"దొరకవు."

అక్కడదొరికే "చాఈ'' (టీ) లో కూడా పాలుండవు.

భోజనశాల చాలా శుభ్రంగా వుంది. వంటవానిదుస్తులు చాలా పరిశుభ్రంగా వున్నాయి. అక్కడ వాద్యగాండ్రుకూడా కనపడ్డారు. భోజనగృహంలో మంచి విలువయిన దుస్తులు ధరించిన కొందరు మనుష్యులు కనిపించేరు. వాళ్లని చూస్తే విదేశీయులవలె కనపడలేదు. నాఆలోచన సరియైనదేయని తర్వాత తర్వాత నేను తెలుసుకోగలిగేను. ఇవన్నీ చూసిన మీద మంచిమంచి బట్టలుకట్టుకొని సంగీతాలు వింటూ, మంచిమంచి హొటళ్లలో ఆహారం తీసుకునేవారూ; చలిలో చిరిగిన గొర్రెచర్మాలు కట్టుకొని పనిచేస్తూండేవారూ, ఈనాడుకూడా రష్యాలో ఉన్నారని నేనూహించేను. బీదవారి కాలిజోళ్లు మంచుబిగికి బ్రద్దలై అడ్డంవచ్చిన దానినల్లా మ్రింగివేసేటట్లు ఉంటాయి. ఇవి ఈలాగే వున్నా, రష్యాదేశీయులు ''వర్గభేదం అంతరింపచేశా''మని గొప్పలుచెప్పుతారు.

నేనున్న అక్టోబరుహోటలు* "జార్''ల కాలంలో కూడా హోటలే.

* జార్‌ను గద్దె దింపిన తర్వాత 'లెనిన్' నడిపించిన సోషలిష్టు

ఇది "మాస్కో" స్టేషను కెదురుగా పోస్టాఫీసుకు సమీపంలో వుంది. ఇందులో ఆవిరిద్వారా గదులలో వేడి కలుగచేసే సౌకర్యాలున్నాయి. ప్రతి గదికి ఒక్కొక్క స్నానపుగదివుంది. ప్రతిగది ఆధునికమునైన అన్ని రకాల విశ్రమసాధనాలతోటి అలంకరించబడియుంది.

నేను మార్గదర్శిక కోసం నిరీక్షిస్తూ కూర్చున్నాను. ఇంత ఆలస్యంచేసి నాసమయాన్ని ధ్వంసం చేసివేస్తూందని నాకు చాలా ఆతురతగా వుంది. ఆఖరికి ఆమె మూడుగంటలవేళ, ఇందాకా అమెరికనుయాత్రికుల్ని తీసుకొనివెళ్ళిన పడుచును వెంటబెట్టుకొని వచ్చింది. వస్తూనే—

"ఇంక నేను సెలవు పుచ్చుకుంటా. నా "కామ్రేడ్" మీకు నగరం చూపిస్తుంది."

అని ఆమె వెళ్ళిపోయింది. రష్యావంటి దేశంలో అందమైన మార్గదర్శికనుంచి విడిపోవడం అంటే ఏదో పారవేసుకుంటూన్నట్లు తోచింది. కాని, చేసేది ఏముంది? తప్పదు. యాత్రికుల్ని స్టేషనునుంచి హోటలుకు తీసుకువచ్చి దిగబెట్టడం వరకే ఆమెపని. అంతతో ఆమెపని ఆఖరవుతుంది. ఈనానూతనమార్గదర్శిక కూడా ఇంగ్లీషు చాలా బాగా మాటలాడుతుంది. మొదటియామెవలె అంత అందంగా లేకపోయినా ఎప్పుడూ నవ్వుతూ వుంటుంది. మంచి చురుకైనది. ఆమెకూడా రెండుమూడు నిముషాలలో నాతో స్నేహం కలిపివేసింది.

మీరేమేవి చూడాలనుకుంటున్నారు?"

"అన్నీ—అందులోముఖ్యంగా—మీసమాజం, —మీకార్ఖానాలు, మీవ్యవసాయాలు, మీలలితకళలు."

"అయితే ఈపూటకి ఓపేరా (సంగీతనాటకం) చూద్దాం నడవండి.

---

విప్లవము అక్టోబరు నెలలో జరిగింది. అందుచేత నేటి రష్యాకి "అక్టోబరు' మరువరాని మాట.

మిగిలినవి చూడడానికి వేళచాలదు. చూడవలసినవన్నీ ఒకఅరగంట లోపు గానే మూసేస్తారు. అందుచేత ఎక్కడికీ వెళ్ళడం నిరుపయోగం.

''కాని, దానికోసం నేను బహుశా వేరే డబ్బు ఖర్చుపెట్టవలసి యుంటుంది. యాత్రలో నాటకాలు చూడడం కలియరేదు.''

ఆమె చిరునవ్వు నవ్వింది.

'' ఔను. నాటకానికి మీరు వేరే డబ్బు ఇచ్చుకోవాలి. సౌకర్యం కోసం ''టాక్సీ'' పదుర్చుకుంటే ఓపెరాకి వెళ్ళి రావచ్చును.''

''అయితే మీరు నాతో ఉండరా?''

''నేను ఆట్టేసేపు మీతోఉండలేను. ఈవేళ పగలంతా ఆఅమెరికన్ యాత్రికులతో కలిసితిరుగుతూండగానే గడచిపోయింది. అందుచేత నేను చాలా అలసిపోయేను.''

ఇంక ఆట్టేకాలం వ్యర్థం చేయడం నాకిష్టం కాలేదు. పైగా రష్యన్ నాటకం చూడడానికి చాలాఉత్సాహంగా కూడా ఉన్నానేమో వెంటనే బయలుదేరడానికి అంగీకరించేను.

"అయితే నేవెళ్ళివస్తా. లేకుంటే నాటకశాలలో ప్రదేశం దొరకడం కష్టం."

అంటూ మార్గదర్శిక వెళ్ళిపోయింది. నేను కిటికీలో కూర్చుండి "లెనినిజానికి'' పుట్టినిల్లయిన ఆ "లెనిన్‌గ్రాడ్" నగరాన్ని చూడసాగేను. ప్రపంచంకంతకీ ఈనగరంలోనే మార్క్సుసిద్ధాంతాలు వేళ్ళుపారి ఫలవంతాలు కాగలిగినాయి. ఈపట్టణంలోనే మొట్టమొదట విప్లవం ప్రకటించబడింది.

సాయంకాలం మార్గదర్శిక టాక్సీమీద ఓపెరాకి తీసుకువెళ్ళింది. ఆమె టిక్కట్టును ముందేతీసుకున్నా నన్ను లోనికి పోనీయడానికి ప్రతి గుమ్మం దగ్గరకీ పరుగెత్తక తప్పిందికాదు. నాకు టిక్కట్టు అమ్మబడితేనేం, ఓపెరాలో ఒక్కసీటు కూడా ఖాళీలేదు. నాకోసమని వేరేఒక

కుర్చీ తెచ్చివేశారు. నన్ను కూర్చుండపెట్టి మార్గదర్శిక వెళ్ళిపోయింది.

ఓపెరాయొక్క రంగం చాలా పెద్దది. కూర్చునేవారి స్థానాలు ఎనిమిది అంతరువులుగా ఉన్నాయి. అన్నిటికంటె పైనున్న అంతరువులో కూర్చున్న ప్రేక్షకుల్ని గుర్తించడంకూడా కష్టం. క్రిందను పైన ఉన్న అంతరువులన్నీ ఇసుకవేసినా రాలనంతగా నిండిపోయిఉన్నాయి. అన్నిటికంటె ఆఖరుఅంతరువులో ఒక్కసీటుకోసం, "కూలీటిక్కటులేని విదేశీయుణ్ణి కావడంచేత ఒకపౌనుకంటె ఎక్కువ ఇచ్చుకోవలసి వచ్చింది. నాటకశాలలలో, సినీమాలలో, రైళ్ళలో, చిల్లరదుకాణాలలో, యంత్రశాలలలో, పాఠశాలలలో, ఆసుపత్రులలో, హోటళ్లలో, వంటపూటిళ్లలో, ఒకటేమిటి అన్నిచోట్లా కూలీలకి ప్రత్యేకసౌకర్యాలు చేయబడినాయి. అన్నిచోట్లా విదేశీయులయిన మాకంటె ఏడెనిమిదిరెట్లు తక్కువగా వుంటాయి; వారీయవలసినవి. నేను యూరపుఖండంలో ఏదేశంలోను యింతపెద్ద నాటకరంగాన్నీ చూడలేదు. ఏనాటకరంగము ఇంతగా కిక్కిరిసియుండడమూ చూడలేదు. అదిచూడగానే రషియనులు కళలంటే అసహ్యించుకుంటారనీ, దేశంలోని లలితకళలన్నీ నేలపాలు చేయబడినాయనీ, చెప్పే మూర్ఖులు జ్ఞప్తికి వచ్చేరు. జనసాధారణములోకూడా కళలయందు ఇంతఆసక్తి కలిగించిన దేశం ఇంకేది ఉంది? ఇక్కడనున్న ప్రేక్షకులు బాటలమీద కనిపించిన వారి కంటె శుభ్రంగా ఉన్నారు. ఇక్కడ ఇంచుమించుగా అందరిబట్టలూ పరిశుభ్రంగా ఉన్నాయి. కొంతమంది పడుచుల మొగాలమీద వలబురఖాలు, బుగ్గలమీద పౌడరుపూత, చేతిలో ఆటచూడడానికి దుర్భిణులు, కూడా కనిపిస్తున్నాయి. కొందరు పడుచువాళ్లు సాయంకాలపు దుస్తులలో ఉన్నారు.

విప్లవం తర్వాత కొంతకాలంవరకు రష్యనులు అన్నివిధాలయిన ఆటపాటల్ని విడిచిపెట్టివేశారు. ఆరోజులలో నర్తనశాలలు బలవంతంగా

మూసివేయబడినాయని చెప్పేరు. ఫాక్సు-ట్రాట్ అనే ఒకవిధమయిన నాట్యం ఆడడం, చూడడం, ఒక మహాపరాధంగా లెక్క-పెట్టబడేవి. అందులోకి వెళ్లుతూవుండగా చూస్తే రష్యనుగూఢచారిదళం తమరిని ధని కులుగా ఎంచి పేర్లురాసుకుంటారేమోనని ప్రజలు హడలిపోతూ వుండే వారు. కాని నేడు రష్యా తనపరిస్థితులని స్వాధీనంలో ఉంచుకోగలిగింది. ప్రజలకి అపాయశంక తొలగింది. రక్తం ప్రవహింపచేసి సంపాదించిన దానిని అనుభవించడంలో ఇబ్బంది లేకపోవడంచేత, వారికి క్రమ క్రమంగా, ఆటపాటలు, వినోదాలు, ఎక్కువ అవుతున్నాయి. ఇప్పుడ యినా నాట్యశాలలు ఎక్కువగా లేవుకాని, ఉన్నవాటిలో ప్రజలు హద్దు లేనంతమంది ప్రోగుపడుతున్నారు. నాటకశాలలు నిండి ఉంటున్నాయి. సినీమాలలో ఇసుకవేస్తే రాలదు. విప్లవకారులదేశమైన రష్యాలో నేను రాత్రిలు సుఖంగా జీవితం గడపవచ్చు. ''స్టేలిన్'' తర్వాత అంతవాడూ అయినా ''కగానోవిచ్'' ఒకచోట ఉపన్యసిస్తూ ద్వితీయపంచవర్షప్రణాళి కలో నాట్యశాలలు, వినోదభవనాలు, అధికంగా నిర్మించబడుతాయని చెప్పేడు.

నాకు కథలో ఒకమాటకూడా బోధపడలేదు. కారణం ఇదికేవలం ఓపెరా. ఇందులో గానంకే ప్రాధాన్యత. కొందరుపాటకుల కంఠాలు చాలా మధురంగా ఉన్నాయి. వాద్యాలయొక్క సమ్మేళనాన్ని అటువంటి దానిని నేనెక్కడా చూడలేదు. ఒక ఏభైమందికిపైగా, అనేకతరహాల వాద్యాలన్ని ఒకమారుగా వాయించేరు. ఆధ్వనులన్నీకలిసి ఒకకరుణ-కోమల-మధుర-ధ్వనిని సృష్టించి నాటకశాలనంతనీ ప్రతిధ్వనింపచేసి నాయి. అంతా ఏదో కలలా తోచింది. దృశ్యాలు కన్నులు మిరుమిట్లు గొలపకపోయినా సుందరంగా ఉన్నాయి. రంగంమీద నీలాకాశాన్ని, పూర్ణచంద్రుణ్ణి, నిజమనిపించేటంత అద్భుతంగా ప్రదర్శించడం నేనెక్కడా

చూడలేము. దృశ్యం అంతా పూర్ణిమనాటి వెన్నెలలో జరుగుతూవున్నట్లే ఉంది. వీటన్నిటికంటె పరదేశీయుల దృష్టిని బాగా ఆకర్షించగలవిషయం రష్యనుల్ల క్రమశిక్షణము. ఇన్నివేలమంది చూపరులున్నా కథాంతరసమయాలలో(Interval) ఏవిధమైన గోల, అల్లరి లేదు. ఇతరయూరపియన్ దేశాలలో మాదిరిగా "టీ, సిగరెట్" అని కేకలుగాని, టీకప్పులు పోగుచేసేటప్పుడు కలిగే గలగలధ్వనులు కాని లేవు. ప్రతిఅవయవం కనపడీలా బిగువైన బట్టలు కట్టుకొన్న అర్ధనగ్నస్త్రీలు ఇక్కడ నాట్యం చేయరు. స్త్రీశరీరాన్ని సాధ్యమైనంత నగ్నంగా కనపడేటట్లు చేసేటందుకు ఏవిధమైన ప్రయత్నాలు లేవు. కామోద్దీపనం కలిగించే దృశ్యాలుకూడా నాటకంలో లేవు. ఇవన్నీ మిలిగినదేశాలలో సర్వసామాన్యంగా జరిగే విషయాలు. అటువంటప్పుడుకూడా రష్యనులు నీతిదూరులనిన్నీ, దురాచారులనీ, నిందిస్తున్నారు. వారు అనుసరిస్తూన్న ఆచారం, నీతిని, పట్టిపరిశీలిస్తే రష్యనులు యూరపియనుజాతులన్నిటి కంటెనూ నీతివంతులు యోగ్యులు, అనిచెప్పకతీరదు. పారిసు, బర్లిను, లండను, రోము, మొదలయిన యూరపుఖండనగరాలలోని దుకాణాలయొక్క అద్దపుతలుపుల మీద బట్టలులేని ఆడవాళ్ళబొమ్మలు విరివిగా కనబడుతాయి. రష్యనులకి అటువంటి ప్రదర్శనాలంటే అసహ్యం కాతాదారుల్ని ఆకర్షించడానికి దుకాణాలమీద మంచిఅందమైన పసుపుల్ని పెట్టడంకూడా వాళ్లు అంగీకరించరు. తమదినపత్రికలు- మాసపత్రికలు ఎక్కువ ఖర్చుకావడానికై వాటిమీద బూతుబొమ్మలు ముద్రించరు.

నాటకం అయిపోయినతర్వాత ద్వారందగ్గర అటుఇటూపచారు చేస్తూ విటులకోసం నిరీక్షిస్తూన్న పడుపులెవ్వరూ నాకంటపడలేదు. ఈదృశ్యం లండనులోను, పారిసులోను, సాధారణముగా కనిపిస్తుంది. U. S. S. R. వేశ్యావృత్తి ఇంతశీఘ్రంగా తగ్గిపోవడానికి కారణం వాళ్లు

నడుపుతూన్న "వేశ్యాసంస్కారగృహాలే"కాదు. రాజకీయార్థికవిషయాలలో పురుషులతో సమంగా స్త్రీలకికూడా స్వాతంత్ర్యం ఇవ్వడమే కారణం. బీదప్రజల్ని ఎప్పుడూ బాధించే ఆహారసమస్య పరిష్కరించబడిపోయింది. వివాహనిర్బంధం సళ్ళించబడింది. అందువలన ఇంతకుపూర్వం సమాజకాఠిన్యానికి బలిఅయి తిండికోసం తప్పనిసరిగా వ్యభిచారవృత్తినిఅవలంబించే స్త్రీలు తగ్గిపోయారు. ఇంకకేవలం విశేషమైన కామేచ్ఛతో వ్యభిచారవృత్తికి దిగినస్త్రీలు యిప్పుడూ ఈమార్గానికి వస్తున్నారు. కాని, వారిని వెంటనే "వేశ్యాసంస్కారగృహాలలో" ఉంచి మందు-మాకులిప్పించి దారిలోకితెస్తున్నారు.

ఈసంస్కారగృహాలలో ఈస్త్రీలకి స్వతంత్రంగా బ్రదుకడానికి ఉపయోగించే పనులు నేర్పబడతాయి. ఈస్త్రీలు ఒకఏడాదిపాటు ఆ యిల్లు విడిచి పోకూడదు. అల్లాగని వారందులో ఖైదు చేయబడినట్లుకాదు. ఉత్సవాలకి, సభలకి, పోవచ్చును. ఈఏడాదిలోను, వారియొక్క మానసిక ప్రవృత్తుల్నీ అలవాట్లనీ, మార్చివేయగలమని సోవియటుప్రభుత్వం కంకణం కట్టుకునిచెప్పుతూవుంది. ఈసంవత్సరం పూర్తిఅయినాక ప్రభుత్వమే వారికి పనిచూపిస్తుంది. సంస్కారగృహాలు విడిచినాకకూడా స్త్రీలు తమ ధోరణిని మళ్ళీ అవలంబించేరా, వారిని మళ్ళీ సంస్కారగృహాలలో ఉంచి బాగుచేయడానికి ప్రయత్నిస్తారు. వేశ్యలకి "లైసెన్సు"లిచ్చి వారిసంఖ్యను నిరోధించబోవడంకంటె వ్యభిచారానికిగల మూలకారణాలు నివారించడం వ్యభిచారం తగ్గించడానికి మంచి ఉపాయం కాదు?

బయట నా'టాక్సీ' సిద్ధంగా వుంది. నంబరును పట్టి దానిని గుర్తించి వెళ్ళిదానిలో కూర్చుండి హోటలుకి తిరిగివచ్చేను.

## ౨

ప్రొద్దున్నే తొమ్మిది కొట్టేక కళ్లు తెరిచేను. ఒకగదిలో ఆవిరి తయారుచేసి దానిద్వారా హోటలులోని అన్నిగదులలోను వేడి కలగచేయ బడుతూంది. యిందుచేతనే రాత్రి నాకు మంచి నిద్ర పట్టింది. వేడి కలుగ చేయడానికి యూరపులో అవలంబించే ఈశాస్త్రీయవిధానం చాలా సుఖకర మైనది. దీనినే "సెంట్రల్ స్టీమ్ హీటింగ్" అనికాని "సెంట్రల్ హీటింగ్" అనికాని అంటారు. కాని, ఈవిధానం అన్నిచోట్లా లేదు. హేంబర్గులో నేను విడిసిన హోటలులో ఈమాదిరి విధానం లేనట్లు జ్ఞాపకం. ఫలితం ఏమిటంటే, ఫ్లానలు "రొజాయీ" చుట్టపెట్టుకొని పండు కున్నా మెదడంతా గడ్డకట్టి మంచుముక్కలా అయిపోతూన్నట్లు తోచింది. గదియంతా మంచుతయారుచేసే యంత్రాలయంలాగా, నాశరీరం అంతా మంచులో పెట్టిన మాంసంముద్దలాగా, తోచింది. యింగ్లండు లోని హోటళ్ళలోను, విశ్రాంతిభవనాలలోను యిదే అనుభవం. యింగ్లం డులోని ప్రజలు ఎంతోధనవంతులయినా తమపురాతనపద్ధతుల్ని మార్చు కొనడానికి అంగీకరించరు. యింకోవిషయం ఏమిటంటే, వాళ్ల మంది రాలు చాలా కుశలంగా వుంటాయేమో "సెంట్రల్ హీటింగ్" పద్ధతి ద్వారా వేడి కలగచేయడం చాలాకష్టం. కాని, ఈహోటలులో వేడి

కలుగచేయడానికి అవలంబిస్తూన్న విధానం చాలా బాగుంది. స్నానగృహా లలో వేడినీళ్ళగొట్టాలు, చన్నీళ్ళగొట్టాలు కూడా ఉంటాయి.

చల్ది భోజనానికి వెళ్లేను. చాలా అరుచిగావుంది. నేనుకేవలం టీ, ఎర్రిరొట్టిని, మాత్రం, తినగలిగేను.

''గుడ్‌మార్నింగ్. రాత్రి సుఖంగా నిద్ర పట్టిందా?"

అంటూ నవ్వుమోముతో నా'మార్గదర్శిక' గదిలో ప్రవేశించింది.

"మీరింకా లేవరేదు? అబ్బ ఎంత ఆలస్యం చేస్తారండి."

టీని గుటకవేసి రేచేను.

"నేను, సిద్ధం అయ్యేను. మీకోసమే ఎదురు చూస్తున్నాను.

"అయితే నడవండి. ఈవేళ మనం అస్టేకాలం వ్యర్థంగా గడ పకూడదు."

"క్షమించండి. ఒక్కనిముషం. నాగదిలోనుంచి ఓవర్‌కోటు తెచ్చుకువస్తున్నా."

"లిఫ్టు" మీదనెక్కి పైనున్న నాగదిలోకి వెళ్ళేను. బయట వరాం డాలో కొంతమంది పిల్లలు ఆదుకుంటున్నారు. వారిముఖాలు చాలా సుంద రంగాను అమాయికంగాను ఉన్నాయేమో, వాళ్లని పలకరించాలని చాలా సరదా కలిగింది. వాళ్ళదగ్గరకి వెళ్లేను. వారిలో ఇంచుమించు ఏడేళ్ళ పిల్ల ఒకతె స్వచ్ఛమైన ఆంగ్లభాషలో పలకరించింది.

"మీరు ఇంగ్లీషు మాట్లాడుతారా?" నాకామాట వినగానే చాలా సంతోషం కలిగింది. ఈపిల్లలతో సంభాషించడానికి మంచిఅవకాశం చిక్కిందని నాకు సంతోషం అయింది.

"నీవు రష్యనువా? నువ్వింతస్వంచ్ఛంగా ఇంగ్లీషు ఏలాగ మాటాడగలుగుతున్నావు?"

"కాదు. నేను అమెరికనును. మానాన్నగారు ఇక్కడ ఇంజనీ

యరుగా ఉంటున్నారు."

"నువ్విక్కడ ఎన్నిరోజులనుంచి ఉంటున్నావు?"

"పదినెలలనుంచి, కాని ఇంక ఆట్టే రోజులు ఉండము. రష్యనులు చాలా పాడుమనుష్యులు."

ఈచిన్నపిల్లకి రష్యనులంటే ఇంత కోపం ఎందుకో తెలుసుకోవాలని నాకు సరదా కలిగింది.

"మానాన్నగారు రెండుసంవత్సరాల కంట్రాక్టుమీద ఇక్కడికి వచ్చేరు. కాని, ఇక్కడవీళ్ళు మాతో చాలా అసహ్యాకరంగా ప్రవర్తిస్తున్నారు. వీళ్ళకి మనతో పని యున్నంతవరకు, మనని పూజిస్తారు. పనిలోని రహస్యాలు తెలుసుకున్నాక మనని కాలితోతన్నేస్తారు. కాని, మానాన్నగారితో కంట్రాక్టుచేసుకొని యుండడంచేత బహిరంగంగా వెళ్ళిపొమ్మనలేక హింసపెట్టుతున్నారు."

అక్కడనున్న మిగిలిన ఇద్దరు పిల్లలకి ఈమాటలేవీ అర్థం కావడం లేదని స్పష్టంగా తెలుస్తూంది. వాళ్ళకేసి తిరిగి "మీరు ఇంగ్లీషు మాటాడలేరా?" అనిఅడిగేను. వాళ్ళు పక్కున నవ్వి ఏదోచెప్పేరు. ఆమాట నాకర్థం కాలేదు.

"వీళ్లు ఇంగ్లీషు మాటాడలేరు. వీళ్ళు రష్యనులు. నేనుమాత్రం రష్యను, జర్మను, ఫ్రెంచి, కూడా మాటాడగలను."

ఆపిల్లను పరీక్షించాలని, జర్మనీభాషలో "నువ్విన్ని భాషలు ఏలాగ నేర్చుకున్నావు?" అని అడిగేను.

ధారాప్రవాహంలా మరతుపాకీలా ఆపిల్ల జర్మనుభాషలో గబీమని సమాధానం చెప్పింది.

"నేను రెండేళ్లదాకా జర్మనీలో ఉన్నాను. మానాన్నగారు అక్కడ పనిచేస్తూండేవారు. ఒకపదాదిపాటు ఫ్రాన్సులో ఉన్నాను. అక్క

డకూడా మానాన్నగారు ఉద్యోగం చేశారు."

నామార్గదర్శిక క్రింద నాకోసం ఎదురుచూస్తూ వుంటుందన్న విషయం ఇప్పుడు జ్ఞాపకం వచ్చింది. పిల్లలు నమస్కారపద్ధతిలో మోకాళ్లు కొంచెం వంచి ఒల తిప్పేరు.

"సాయంకాలం పాపాటయి వినడానికి వస్తారా?" అని అమెరికను బాలిక అడిగింది. సమయం చిక్కితే వస్తానని వాగ్దానం చేశాను.

టాక్సీ అద్దెకి తీసుకుంటే నగరంలో చులకనగా తిరగవచ్చుననీ చూడవలసినవి చాలా చూడవచ్చుననీ, మార్గదర్శిక సలహా ఇచ్చింది. నేను అంగీకరించేను. ఇందుకోసం యాత్రికశాఖవారి కార్యాలయానికి టాక్సీ కుదుర్చుకొనడానికి వెళ్ళవలసి వచ్చింది. ఆఫీసు అట్టేదూరం లేదు. వెనుకటిరోజున యున్నట్లు చలికూడా ఎక్కువగా లేదు. అందుచేత కాలినడకనే బయలుదేరేము.

యూరపుఖండంలోని ఇతరదేశాలలోవలె సుందరంగా అలంక రించబడిన దుకాణం ఒక్కటీ ఇక్కడ కనపడదు. మోటార్లు చాలా తక్కువ. మోటార్లు తయారుచేసే కార్ఖానాలు తమదేశంలో ప్రారంభించ బడినాక వానికి లోటు ఉండదని రష్యనుల నమ్మకం. ప్రస్తుతం విదేశాల బజారులలో రష్యాకి పరపతి లేకపోవడంచేత, ఏవస్తువు కావలసినా బంగారమో, కలపో, ధాన్యమో, ఇచ్చికొనుక్కోవలసి వస్తూంది.

పదో—అయిదో గుర్రపుబళ్లు కనిపించేయి. కాని, అవి పెద్దబరు వులు లాగడానికే ఉపయోగిస్తున్నారు. కొన్నిటికి రబ్బరుటైరులు కూడా వేయబడియున్నాయి. ఇవి ఇప్పటివరకు వ్యక్తుల సొత్తే. ఒకరిని పీడించి దోచుకోవడానికి వీలులేని పద్ధతిలో వ్యక్తివ్యాపారాలకి నేడు రష్యాలో అనుమతి ఈయబడింది. కొన్ని ప్రత్యేకపరిస్థితులలో తప్ప ఎవ్వరూ ఎవ్వరినీ, కూలికి ఏర్పాటు చేసుకొనడానికి చట్టం అంగీకరించదు. ఏలో

గమో వచ్చి కదలలేకపోతే మినహాగా రైతులు కూడా కూలీలను పెట్టు కొనడానికి చట్టం సమ్మతించదు. ఇప్పటిప్పుడు వ్యక్తివ్యాపారం విష యమై సోషలిష్టులు చట్టాలు మార్చేరేగాని, వాళ్ళ అభిప్రాయాలేవీ మార్చ లేదు. ఇప్పుడు చట్టానుసారం వ్యక్తులు వ్యాపారం చేసుకోవచ్చును. కాని ప్రభుత్వం చూపించే ఉపేక్షాభావము, పెద్దపెద్దపన్నులు, అదనపు పన్నులు మొదలగుబాధలచేత విరివిగా వ్యాపారంచేయడం ఎవ్వడికీ సాధ్యపడదు. కుమ్మరి కుండలు చేసుకొని బజారులో అమ్ముకొనవచ్చు. ఈవిధంగానే సాలీలు, వడ్రంగులు, కమ్మరులు, మొదలయినవృత్తులవారు తమతమ ప్రత్యేకవృత్తులు నిర్వహించుకొని, తమసరుకుల్ని అందరికీ అమ్ముకో వచ్చును. కాని, ఒక్క షరతు. ఎవ్వరినీ ఆతడు కూలికి పెట్టుకొన కూడదు. వ్యక్తివ్యాపారులకి ఓటుహక్కు ఉండదు. వాళ్ళకి రేషన్ కార్డులు ఇవ్వబడవేమో ఏపదార్థం చవకగా దొరకదు. వారిమీద పెద్దపెద్ద పన్నులు వేస్తారు. అనుమానంతో వారిచర్యలు పరీక్షిస్తూంటారు. వ్యక్తి వ్యాపారుల మీద కేసునడిచిందా, వారి ఆస్తి స్వాధీనం చేసుకోవడం రష్యాలో మామూలు విషయం.

పాఠశాలలో వినోదశాలలలలో, ఆసుపత్రులలో, సైన్యాలలో, వ్యక్తివ్యాపారుల బిడ్డలకి ఆఖరున అవకాశం ఈయబడుతుంది. చదువుకి, తిండికి, బట్టకి, బసకి, సాధారణకూలీల పిల్లలకంటె వీరు ఎక్కువగా ఈయవలసియుంటుంది. ప్రభుత్వం ఈవ్యక్తివ్యాపారులనుండి సాధ్యమై నంత ఎక్కువధనం వసూలు చేస్తుంది. అది వ్యక్తివ్యాపారపద్ధతిని శత్రువుని చూసినట్లు చూస్తుంది. దానిని మాపివేయాలని ప్రభుత్వం ఉద్దేశం. లెనిన్‌గ్రాడ్‌లో స్వంతదుకాణం, స్వంతగృహం, స్వంతకారు, కలవాడెవ్వడు లేడు. కారణం, ఎవ్వడూ స్థిరాస్తి కలిగి ఉండకూడదనేదే. ప్రతివస్తువు ప్రభుత్వానిది. ఎవ్వడయినా ప్రభుత్వముయొక్క కోపానికి

గురిఅయినాడా తిండిలేక చావవలసివస్తుంది. ఏమంటే, ఎవ్వడూ వానిని నౌకరుగా పెట్టుకొనడు. ఎవ్వడూ పనిచెప్పడు. అతనివద్ద ఏమాత్రమైనా డబ్బుఉంటే కొద్దిరోజులలోనే అయిపోతుంది. ఏమంటే, పనిచేయని వాళ్ళకి, ఏవస్తువు చవకగా దొరకదు. ఈదేశంలో ఎవరయిన వర్తకం చేస్తూ, పల్లెటూరిప్రజల దగ్గరకొని లాభానికి పట్టణాలలో అమ్మురుంటే, వారిని ప్రభుత్వం పట్టుకొని కఠినంగా శిక్షిస్తుంది.

దారిలో కాలిబాటని భిక్షం అడుక్కుంటూన్న కుఱ్ఱవాడి నొకడిని చూశాను. వానినిచూచి వేళాకోళంగా

"మీదేశంలో నిరుద్యోగం, భిక్షాటనం, లేనిమాట నిజమేనా?" యని అడిగేను.

"ఆహా; ఈవిషయంలో మీకు సందేహం ఎందుకు కలిగింది?"

ఆ కుఱ్ఱవాడికేసి చూపించేను. "ఈపిల్లాడే నీమాటలను ప్రత్యాఖ్యానం చేస్తున్నాడు."

"ఆహా! వీళ్లు వట్టి తుంటరులు. పోలీసులు వీళ్ళని తరుచుగా పట్టుకొని శిశురక్షణాలయాలలో పారవేస్తూనే యుంటారు. కాని, వీళ్లు చిన్నప్పటినుంచీ, ముష్టికే అలవాటు పడ్డారు. అక్కడనుంచి పారిపోయి వచ్చి ముష్టి ఎత్తుకుంటూ వుంటారు. వీళ్లరక్తంలో సోమరిపోతుతనం బలిసింది. బహుశా వీళ్లు ఫాదిలరీపిల్లలో, భూస్వాముల పిల్లలో, అయివుంటారు. వీళ్లపనిచేసుకొనడం కంటె భిక్షం ఎత్తడం మంచిదని ఊహిస్తారు. కాని, వీళ్ల సంఖ్య చాలాతక్కువగానేవుంది. అందుకు సంతోషించాలి."

"బహుశా వీళ్ళని ప్రేమతోటి, అభిమానంతోటి, ఆదరించడం లేదేమో! లేకుంటే వాటిని విడిచిపెట్టి ఇల్లాగ చలిలో ముష్టికి ఎందుకు సిద్ధం అవుతాడు?"

"సోమరిపోతులని చెప్పేను కాదు? శిశుసంరక్షణాలయాల కట్టుబాట్లు, అక్కడిపని, వీళ్ళకి రుచించదు."

"సరే, కాని, మీదేశంలో జనసామాన్యం ఇంత పేదతనం అనుభవిస్తున్నారేమి? ఒక్కళ్ళ దగ్గరా కావలసిన బట్టలు లేవు. సరిపడేటంత తిండి కూడా లేదనే తోస్తుంది. అటువంటిస్థితిలో ఈవిప్లవం ఇంతరక్తపాతం వలన మీరు సాధించినది ఏమిటి?"

"మాదేశంలో ప్రజలందరికీ సరిపడేటన్ని బట్టలు లేవన్నమాట నిజం. ప్రజలందరికీ తగినంత తిండి కూడా లేదు. కాని, విప్లవానికి పూర్వం దేశంలోని ప్రజలు ఒక్కపూటమైనా తిండిలేక మాడిపోతూవుంటే ధనికులు బంగారుకంచాలలో తిన్నంతతిని పారవేసినంత పారవేస్తూ ఉండేవారు. ఈనాకుమాకు శుభ్రమైనతిండి దొరకకపోయినా మాలో ప్రతివాడికీ ఆకలిదాహలణచుకుందుకు ఏదోఇంత మంచిదో—చెడ్డదో తిండి దొరుకుతూ వుంది. మా ద్వితీయపంచవర్షప్రణాళికలో ధాన్యపుపంటయే ఎక్కువ చేయబడుతుంది. అందుచేత మాజీవితము యొక్క పరిస్థితులు కొంచెం బాగుపడవచ్చు."

మేము యాత్రికవిభాగముయొక్క కార్యాలయం చేరేము. అద్దాలతిరుగుడుతలుపులు నెట్టుకొని లోన ప్రవేశించి చూస్తునుగదా అంతా ఆడమళయాళం. ఎక్కడచూసినా ఆడవాళ్లు తప్ప మరొకరు కనపడరు. ఒక్కమగవాడుకూడా గుమాస్తా లేడు.

"మీరు మగవాళ్ళని ఆఫీసులలోనుంచి కొట్టితరిమివేశారాయేమిటి?"

"మగవాళ్ళు బరువుపనులు చేస్తారు. యంత్రశాలలలో మగవాళ్లంతా చేరిపోయేరు. మేము ఈతేలికపనులు చేస్తున్నాము."

"అయితే మీరు ఉన్నతవర్గానికి చెందిన "బూర్జువా"లు మీమగవాళ్ల తక్కువవర్గానికి చెందిన "ప్రొలిటేరియట్లు" అయినారన్నమాట."

ఈమాటలంటూ నేను నవ్వేను.

"మాకు బరువుపనులంటే భయంలేదు. మాదేశంలో ట్రాక్టర్లు రైలుఇంజన్లు కూడా ఆడవాళ్లనడుపుతున్నారు. సిపాయీలుగా ఉన్నారు. రాజమాతలుగా పనిచేస్తున్నారు. మాశారీరకదౌర్బల్యంవలన కొన్నిపనులకు మేము సిద్ధపడడంలేదు. కాని, మాకు పనులంటే భయంలేదు."

ఇది నిజమే కూడా. ట్రాములలో, డ్రైవర్లు, కండక్టర్లు, కూడా ఆడవాళ్లే. ఆవిషయం నేనుకళ్లారాచూశాను. యాత్రికశాఖవారికి టాక్సీ సంగతి చెప్పి మేమిద్దరం "క్రెచీ" చూడడానికి "ట్రామ్" ఎక్కేము. రష్యాలో ట్రాముమీద ప్రయాణం చాల బాధకరమైనది. ట్రాములో ప్రతి అంగుళం క్రిక్కిరిసిపోయి ఉంటుంది. నల్గురయిదుగురికి తక్కువకాకుండా పడిచెక్కమీద ప్రక్కఊసలు పట్టుకొని వ్రేలాడుతూ ఉంటారు. ఆగవలసినచోట్లలో దిగినవారిని—ఎక్కినవారిని కూడా చూడకుండా క్షణకాలం ఆగి ముందుకు పోతూంటుంది. ట్రాములో ఎక్కాలంటే జనం మధ్యనుంచి దారి చేసుకోవాలి. పడిచెక్కమీద కాలుపెట్టి ఊసపట్టుకొని వ్రేలాడుతూ నెమ్మదిగా లోనికి చేరుకోవాలి. లోపల మనుష్యులు కూర్చుండేటందుకు మాత్రమే వీలయినంత వెడల్పేయున్న బల్లలు రెండువరసలలోఉంటాయి. ఇక్కడి ట్రాములు మనుష్యులు నిలువబడేటందుకు మాత్రమే కట్టినట్లు తోస్తుంది. కిటికీల అద్దాలపైనమంచుపడి గడ్డకట్టి పోతూంటే లోపలనున్నవారు, తాముదిగవలసిన ప్రదేశాలు చూచుకుందుకు వేళ్ళతో పొడిచిపొడిచి చిల్లులు చేస్తూంటారు. వంగి క్రిందనున్నవస్తువు తీసుకుందుకు కూడా వీలులేనంతజనం క్రిక్కిరిసి యుంటారు. ఈ సమయంలో నాకొకనాడు కంటబడ్డ విషయం, జ్ఞాపకం వస్తూంది. ఒకబాటసారి బండీలోనుంచి దిగేముందు "నాజోడు ఒకటి పోయింది. ఇప్పటిదాకా అది నాకాలినే వుంది." అన్నాడు. ప్రతివాడు తలవంచి చూశాడు. కాని, బండి విపరీ

తంగా క్రిక్కిరిసి ఉండడంచేత ఎవ్వడూ వంగి వెతకలేకపోయాడు. చివరకి పాపం ఆబాటసారి ఒంటెజోడుతోపే దిగవలసివచ్చింది.

వీట్లలో ఒకవిషయాన్ని గురించి నేనిప్పటికే ఆశ్చర్యపడుతూ వుంటాను. ప్రజలు ఇంత బీదతనంతో వున్నారా, ఒక్కడూ కండక్టరు కన్నుతప్పించి డబ్బు ఎగపెట్టడానికి ప్రయత్నించడు. ఎన్నివీళ్ళు ఉన్నా సరే. ఆకొనసనుంచి ఈకొనసవరకు ప్రతివాడు తనడబ్బు కండక్టరు కందచేసి టిక్కట్టు తెప్పించుకుంటాడు. ట్రాములు కూడా తనవే అనీ, టిక్కట్టు కొనడం తనకర్తవ్యం అనీ, ప్రతివాడు ఎరుగును. నీతి, నీతి అని కోతలుకోసే వారంతా రష్యాలోని ఈ బీదప్రజలనుంచి పాఠాలు నేర్చుకుంటే బాగుండును. ఎవ్వడైనా తాను దిగవలసినచోటుకు రెండు—మూడు స్టేషనుల కీవలనే తనమార్గం వెతుకుకోవాలి. చలికాలంలో సమ్మర్దం, ఒత్తిడి ఇంత బాధకరంగా వున్నదే—వేసవికాలంలో వీళ్ళ లవస్థ ఏలాగ వుంటుందో బోధపడదు.

## 3

మేము క్రెచీకి సమీపంలో ట్రాము దిగేము. 'క్రెచీ' అన్నది కూలీల పిల్లలయొక్క సంరక్షణాలయమని మార్గదర్శిక చెప్పింది. ఓవర్‌కోటు, బూటు, విడిచి మేము పైకి వెళ్ళేము. ఆసంస్థయొక్క మేనేజరు వద్దకుపోయి నామార్గదర్శిక 'క్రెచీ' చూడడానికి అనుమతి కోరింది. ఆమె చిరునవ్వుతో అంగీకరిస్తూ పిల్లల దగ్గరకు వెళ్లేటప్పుడు తెల్లని ఆఘారం తొడుగుకొనండని చెప్పింది.

ఈ శిశుసంరక్షణాలయంలో మూడునెలలు మొదలు మూడేండ్ల వయసువరకు గల పిల్లలు పోషించబడుతారు. ఆదేశంలో కూలిపడుచులకి ప్రసవించే ముందు రెండునెలలు. తర్వాత రెండునెలలు పూర్తిజీతంమీద సెలవిస్తారు. మూడవనెలలోవారు తిరిగి పనిలో చేరాలి. ఆఫీసులలో గుమాస్తాలుగా ఉన్నవారికీ, శారీరకశ్రమ చేయ పనిలేని ఇతరస్త్రీలకూ, మొత్తం మూడునెలలు మాత్రమే సెలవు నిస్తారు. రష్యా, ప్రస్తుతకుటుంబ పద్ధతిని విచ్ఛిన్నం చేయడానికి ప్రయత్నిస్తూంది. కొంతవరకు ఆప్రయత్నాలు ఫలించేయికూడా. అందుచేతనే మూడేసినెలల పిల్లలసంరక్షణ కావలసివచ్చి ఈసంరక్షణాలయాలు నిర్మించబడినాయి. రష్యాలో యంత్రాలయాలు ఇరువదినాలుగుగంటలూ పనిచేస్తూనే ఉంటాయి; కూలీలు

వంతులువారీగా పనిచేస్తూంటారు. ప్రతితల్లీ యంత్రాలయంలోనికి వెళ్లే ముందు తనబిడ్డని ఈసంరక్షణాలయంలో విడిచి పెట్టి తిరిగియింటికి వెళ్లేటప్పుడు కూడా తీసుకుపోతుంది. ఈలోపుగా వారికి అవసరమయిన వన్నీ సంరక్షణాలయంవాళ్ళే చూస్తారు. ఇవన్నీచూసి కొంతమంది రష్యాలో గృహజీవితం లోపించిపోతూందని అనుకుంటున్నారు. పిల్లలను ప్రభుత్వం పోషిస్తూంది కనక, తల్లులకి పిల్లలమీద ప్రేమఉండదనీ, వివాహనియమాలు కఠినంగా లేకపోవడంచేత తండ్రులు పిల్లలవిషయం జాగ్రత్త తీసుకోరని వారియూహ. కుటుంబంలో యజమాని పనిచేసి ఇంటిల్లిపాదినీ పోషించడం అనేపద్ధతి రష్యనులు తొలగించేరు. కాని, గార్హస్థ్యజీవితాన్ని నిషేధించలేదు. ఆదాయ్యటిలు తొలగించలేదు. ఈశిశు సంరక్షణాలయాలు పిల్లల్ని కనిపెట్టుకుని కూర్చుండే బాధ్యత తొలగించి దేశసంపద వృద్ధిచేయడంలో తనశక్తిని పూర్తిగా వినియోగించడానికి తల్లులకు అవకాశం ఇస్తూన్నాయి. ఈవిధంగానే సమిష్టిభోజనాలయాలు, బట్టలుదికే కార్ఖానాలు, గృహాలు, కట్టించి, దేశంలోని సగంశక్తిని వ్యర్థం కాకుండా రక్షించేరు. పూర్వం పిల్లల్ని పోషించడం, వంట వండడం ఇళ్లు తుడవడం, బట్టలు ఉతకడం, తొంటే సరిపోయీది ఆడవాళ్లపని. ఇప్పుడు చిన్నచిన్న కుటుంబాల్ని అనేకాలను ఏకంచేసి నగరాలలో ఒకే పెద్దకుటుంబంగా చేసివేస్తున్నారు. ఈపెద్దకుటుంబం సర్కారుఇళ్లలో ఒకేచోట ఉంటారు. ఒకే భోజనాలయంలో తిండి తింటారు. ఒకేచాకలి దుకాణంలో బట్టలు బాగుచేయించుకుంటారు. ఒకేక్లబ్బులో ప్రోగుపడు తారు. ఒకే పుస్తకాలయంలో కూర్చుండి చదువుకుంటారు. ఇంక మాతృప్రేమనుగురించా? దానిని ఒక్కరష్యావిప్లవం ఏమిటి? అల్లాంటి వేయివిప్లవాలు వచ్చినా ఆప్రేమను భగ్నం చేయలేవు. మాతృప్రేమ అన్నది ఒక్క మనుష్యులలోనేకాదు, పశుపక్షులలోకూడా ఉండే స్వాభా

వికసోపల ప్రవృత్తి. అందుచేత గృహజీవనం ఎప్పుడూ భగ్నంకాదు. కాని, ఇతరదేశాలలోని కుటుంబజీవితానికీ, ఇక్కడిదానికీ, అసలు సంబంధమే లేనంత మార్పుకలిగింది. దీనికి ప్రభుత్వం అవలంబించిన ''నవీనఆర్థిక నీతి''యే కారణం.

పగలంతా పిల్లలు సంరక్షణాలయాలలో ఉంటారు. మధ్యమధ్య పిల్లలకు పాలిచ్చేటందుకు తల్లికి అరగంట అరగంట వ్యవధి ఈయబడు తుంది. తనపని పూర్తియైనాక పిల్లని గుండెలకదుముకొని ముద్దులు కురిపిస్తూ, దూదిమెత్తలో చుట్టపెట్టి ఇంటికి తీసుకుపోయి తనభర్తతో పుత్రలాలనలో మునిగిపోతుంది. అనేకమంది పడుచులు, ప్రౌఢలు, తమసంతానాన్ని గుండెలకద్దుకొని, ముద్దుపెట్టుకుంటూ అనిర్వచనీయమైన ఆనందాన్ని అనుభవించడం నాకళ్లతో నేను చూశాను. అంతప్రేమమయ లైన తల్లులున్నచోట గృహజీవితం భగ్నం ఏలాగ అవుతుంది? ఇంకోవిశేషం. యూరపు అమెరికాలలోకంటె రష్యాలో మాతృత్వం చాలా మహత్తరమైనదిగా ఎంచబడుతూంది. యూరపులోను అమెరికా లోను వివాహం కేవలం భోగతృప్తికోసమే. అక్కడ పిల్లలను కనడం తప్పుగా ఎంచబడుతూంది. రష్యాలో పిల్లల్ని కనకూడదనుకుంటూ వివాహం చేసుకొనడం వ్యభిచారంగా పరిగణిస్తారు. పిల్లలు దేశము యొక్క సంపత్తి. ప్రతిస్త్రీకీ ఆరోగ్యవంతమైన యోగ్యసంతానాన్ని దేశానికర్పించడం కర్తవ్యం. ప్రభుత్వం, గర్భపాతమును చట్టసమ్మత ముగాచేసినా, డాక్టర్ల ద్వారా సంతాననిరోధోపాయాలు నేర్పిస్తున్నా, అవి కేవలం తల్లుల ఆరోగ్యరక్షణకోసము, ఎక్కువ సంతానం కలగకుండా ఉండేటందుకు, మాత్రమే ఉద్దేశించబడినాయి. ప్రతిపంచివస్తువు దుర్వి నియోగం చేయబడుతూనే వుంటుందని అందరూ ఎరుగుదురు. కాని, ఆవిషయాల్ని గురించి ఆలోచించడం చాలా పొరపాటు. ప్రభుత్వపు

ఆసుపత్రులలోకాక ఇతరచోట్ల గర్భపాతం చేసుకుంటే అది చట్టవిరుద్ధం. ఈతప్పుకి శిక్ష మూడుఏళ్లు కఠినవరకం. ప్రథమగర్భం, విశేషకారణా లుంటే మినహాగా విచ్ఛిత్తి చేసుకొనుటకు అనుజ్ఞ ఈయబడదు. మూడు నెలలు దాటితే గర్భపాతాని కంగీకారం ఈయరు. ఇళ్లు చాలా తక్కువ గాను కుశలంగాను ఉండడమే ప్రస్తుతం రష్యాలో గర్భపాతము లెక్కువగా జరుగడానికి కారణం. ప్రభుత్వం గర్భపాతముకంటె సంతాననిరోధము ఉత్తమమని ప్రచారంచేస్తూంది. గర్భపాతానికి కట్టబడిన ఆసుపత్రులు, సినీమాలు, రేడియోలు, పత్రికలుద్వారా సంతాననిరోధోపా యాలు ప్రజాసామాన్యానికంతకీ తెలిసీలా ప్రచారం చేయబడుతున్నాయి. గర్భపాతమునకు ఆపరేషన్ జరిగించుకొందుకు స్త్రీలకుపదిరోజులు సెలవు ఈయబడుతుంది. ప్రభుత్వం ఈ విషయంలో శ్రద్ధ తీసుకొనడంచేత తల్లులమరణసంఖ్య తగ్గింది. యూరపులోని ఇతరదేశాలలో గర్భపాతము కారణంగా నూటికి ఒక స్త్రీ చనిపోతూవుంటే మాస్కోలోని గర్భవిచ్ఛేద వైద్యశాలలో (Abortion Clinics) 25000మందిలో ఒక్కరె చనిపో తూవుంది. యుక్తవయసు వచ్చేలోపల రష్యనుపిల్లలచేత పెద్దపనులు ఏవీ చేయించరు. వారితలితండ్రులే వారిజీవితవ్యయములకైన ఖర్చులు భరించ వలసియుంటుంది. ఇంకపారివారికజీవనం లేకుండడం ఏలాగ తటస్థం అవుతుంది? కాని హిందువులలోను, క్రిష్టియనులలోను కనపడేమాదిరి పితృభక్తి చూడాలంటే రష్యాలో కనపడదు. రష్యనులు కేవలం భౌతిక వాదులు. తండ్రులు భూస్వాములుగా ఉండడంవలన పౌరసత్వపుహక్కులకై వారితో సంబంధంవిడగొట్టుకున్న పిల్లలు చాలమంది యున్నారు.

శిశుసంరక్షణాలయాలలో ప్రతివస్తువు క్రమపద్ధతిలో ఉంచబడి యుంది. ప్రతీవస్తువు సఫేదులా తెల్లగావుంది. అన్నిమూలల క్రమ శిక్షణం తొణికిసలాడుతూవుంటుంది. మమ్మల్ని ముందర ఒక గది

లోకి తీసుకువెళ్ళేరు. గదిలోనున్న అలమారులన్నిటికి నంబర్లు వేయ బడియున్నాయి. వీటిలో పిల్లలకి ఇంటివద్ద లొడుగుతూవుంచే మురికి గుడ్డలు పడియున్నాయి. ప్రతిబట్టమీదాకూడా నెంబర్లు వేయబడివుడున్నాయి. ఇక్కడనుంచి మూత్ర-పురీషాదులు విడిచేటందుకు వేరొకగదిలోనికి పిల్లన్ని తీసుకుపోతారు. అటుతరువాత వారిని స్నానం చేయించి శుభ్రమైన బట్టలుకట్టి తమతమ నెంబర్లుగల పక్కలమీద పడుకోపెట్టు తారు. వారంతా ఒకేమాటు తింటారు. ఒకేమారు ఆడుకుంటారు, ఒకేమారు నిద్రపోతారు.

"పిల్లలంతా ఒక్కమారే ఏలాగ నిద్రపోతారు? ఎప్పుడైనా ఏడ్చి మిగిలిన వాళ్ళని లేపడా?"

మార్గదర్శిక నాకు నర్సుకి మధ్య దుబాసీపనిచేసె ఆమెమాటలు నాకు తెలిపింది.

"అచ్చే! పిల్లలకి చిన్నప్పటినుంచీ నలుగురితోకలసి ఒకేమారు పనిచేయడం నేర్పుతే వాళ్ళు బ్రతికిఉండగా ఆనియమం తప్పరు."

నేను చూడడానికి వెళ్ళిన శిశుసంరక్షణాలయంలో ఆటలాడుకొనే గదిలో ఒక పియానో వుంది. కొంచెం వయస్సువచ్చిన పిల్లలు పియానోపాటకి లయవేస్తూ నాట్యం చేస్తున్నారు. ఈనాట్యమే వాళ్ళకి వ్యాయామము. శిశుశాలలో అనేకరకములయిన ఆటవస్తువు లున్నాయి. విమానాలు, ఓడలు, టార్పెడోపడవలు, పంపులు, ఇంజనులు, సిపాయీ బొమ్మలు, ఇల్లాంటివి ఎన్నో వున్నాయి. కాల్పనికములయినదేవతలవి-రాక్షసులవి, బొమ్మలేవీ లేవు. భారతీయుల పిల్లలవలె రష్యనుల పిల్లలు బొమ్మలపెళ్ళిళ్లు, దేవునిపూజలతోటి ఆడుకోరు. ప్రతిపిల్లవాడిని తనకిష్టం వచ్చిన బొమ్మతో ఆడుకోనిస్తారు. వాళ్ళవాళ్ళ అభిరుచులన్నీ జాగ్రత్తగా పరిశీలించి చూస్తూంటారు. ఆపిల్లల చిన్ననాటి అభిరుచుల్నిపట్టి పెరిగిన

తర్వాత వానికి సంబంధించిన విద్యలే నేర్పుతారు. వానినిపట్టే ఇంజనీరింగ్, సైనికశిక్షణము, వ్యవసాయము, కళలు, నేర్చేటందుకు అవకాశాలు ఈయబడతాయి. చిన్ననాటినుంచీ వారిఅభిరుచుల్ని కనిపెట్టి రికార్డు చేసిఉంచుతారు. వారందరికీ ఒకేరకపు శిక్షణ ఈయబడదు. రష్యనుప్రభుత్వం మనుష్యులయొక్క బుద్ధిప్రవృత్తులన్నీ ఒకేమాదిరిగా ఉండవని బాగా ఎరుగును.

వయసునుపట్టి పిల్లల్ని వేరువేరుగా తరగతులుచేసి వారిని జాగ్రత్తగా చూస్తారు. ఒక గదిలో ఇంచుమించు ముప్పైమంది పిల్లలు నిద్రపోతున్నారు. వారి సంరక్షణచూసే నర్సు వారి దినకృత్యాలు వ్రాస్తుంది. ప్రతిదినము, ప్రతిపిల్లవానియొక్క శరీరముయొక్కవేడి మల—మూత్రవిసర్జనములనుగూర్చి ఎన్నిమార్లు లేచాడో, ఎన్నిమార్లు ఏడ్చాడో ఇవన్నీ వ్రాయవలసి యుంటుంది. ప్రతిపిల్లవానిని గురించీ ప్రత్యేకంగా శ్రద్ధతీసుకుంటారు. శాస్త్రీయపద్ధతిప్రకారం ప్రతిపిల్లవాడూ చేతులు పైకిఎత్తుకొని పడుకొనియున్నాడు. ఏపిల్లవానికైనా కొస్త బాధ గాని, రోగంకాని వస్తే వానిని పిల్లలలోనుంచి తప్పించి క్రెచీడాక్టరు వద్దకు పంపిచేస్తారు. ఆపిల్లని ఇంటికి తీసుకొనిపోనీయరు. అవసరం అయితే తల్లి పిల్లవానివద్దనే ఉండిపోవచ్చును. రష్యాలో కూలీల పిల్లల్ని ఎంత శుభ్రంగానూ, శాస్త్రీయపద్ధతులమీదా, పోషిస్తున్నారో చూస్తే మనదేశంలోని గొప్పధనవంతులు కూడా ఈర్ష్యపడతారు. శిశుసంరక్షణాలయాన్ని చూడడం అయిపోయినతరువాత విజిటర్ల రిజిష్టరులో నాఅభిప్రాయం వ్రాయమన్నారు. సంతోషపూర్వకంగా నేను నాఅభిప్రాయం వ్రాసేను. ఈ 'క్రెచీ' లలో బీదకూలీలనుండి సొమ్ము పుచ్చుకొనబడదు. కాని, జీతం ఎక్కువగా తెచ్చుకునేవారివద్ద వారి జీతాన్నిపట్టి ఫీజు వసూలు చేస్తారు. ప్రసవచికిత్సాలయంలో డాక్టరు

సలహామీదగాక కేవలం స్వంతకారణాలచేత గర్భవిచ్ఛేదమునకు వచ్చిన స్త్రీలనుంచి 8 మొదలు 13 రూబుల్సువరకు ఫీజు పుచ్చుకుంటారు.

ఇంతలోకీ యాత్రికశాఖవారు టాక్సీ నొకదానిని పంపించేరు. మేము దానిమీద పట్టణం చూడడానికి బయలుదేరేము.

మాబండి త్వరలోనే 'నీవా' నదీతీరానికి వచ్చింది. నీవానదీ తరంగాలు కదులుతూన్నవి. కదులుతూండగానే చలికి గట్టిపడి బిగిసి పోవడంచేత రెండుగట్లకి మధ్యనున్న విశాలమైన రేవు ముడతలుపడ్డ తెల్లని దుప్పటీ పరచినట్లుంది.

దారిలో చాలా ముఖ్యమైన సౌధాలు కనపడినాయి. నౌకాసైన్య కళాశాల, ఆఫీసు, కార్మికశాఖాకార్యాలయము, 'నీవా' నదీతీరమందే ఉన్నాయి. వాటిని చూసేను. ఇందులో పూర్వం రాజకీయఖైదీలను పెట్టి నానాహింసలు పెట్టేవారు. కమ్యూనిష్టుపార్టీయొక్క కేంద్రకార్య నిర్వాహకవర్గము పూర్వముండే నివాసభవనం కూడా చూసేను. ఈభవనముయొక్క కిటికీదగ్గరనే నిలవబడి విదేశాలనుంచి వచ్చినపుడు 'లెనిను' తన కామ్రేడులకి ప్రథమోపన్యాసం యిచ్చేడట. రెవ్‌షర్దుల భవనము చాలాపెద్దది. దీనిని భవననిర్మాణకళలో చాలా ప్రసిద్ధిపొందిన 'రోసీ' 1919—25 ల మధ్య నిర్మించేడు. ఈభవనం రక్తకవచసైన్యా లకి కేంద్రకార్యాలయంగా ఉపయోగించబడుతూంది. పూర్వం "జార్" యొక్క శరత్ప్రాసాదము(Winter Palace)గా ఉపయోగించబడుతూ నేడు విప్లవవస్తుప్రదర్శనశాలగా ఉపయోగించబడుతూన్న భవనానికి ఇది ఎదురుగా వుంది.

ఈ విశాలసుందరభవనానికి ప్రక్కనే ప్రపంచప్రసిద్ధమైన 'హెర్మిటేజ్' ఉంది. ఈ 'ఋషికుటీరం' (Hermitage) జారుల కాలంనుంచీ మిక్కిలి ప్రసిద్ధిపొందిన చిత్రశాల. ఇది జనరల్ "టర్నోర్చి"

1617–18 లలో నిర్మించేరు. ఆనాటుమొదలు నేటివరకు గల సుప్రసిద్ధులైన ఫ్రెంచి–ఇటాలియన్ కళాకారులచే చిత్రించబడిన సుందర చిత్రాలు దీనిలో పోగుచేయబడియున్నాయి. 'జార్' యొక్క పుత్రుల-పుత్రికలయొక్క బంధు-మిత్రులయొక్క భవనాలుకూడా చూడవలసినవే. ఇటువంటిదే "పాంతీపేలెస్" దీనికి ఎదురుగుండా ఒకసుందరమైన తోటవుంది. ఈపార్కులోని పచ్చికపై కమ్యూనిస్టుల చిహ్నమైన సుత్తి-కొడవలి చిత్రించబడియున్నాయి. ఇది జారుల రాజప్రాసాదానికి దగ్గరలో వుంది. ఈపార్కులో వేలకొలది కమ్యూనిస్టులు చంపవేయ బడడంచేత దీనిని విప్లవవీరుల ఉద్యానవనం అని పిలుస్తారు.

నగరంలోని ముఖ్యసౌధాలు, ఉద్యానవనాలను, చూసి పట్టణం వెలుపలనున్న జారుల గ్రీష్మప్రాసాద(Summer Palace) ప్రాంతాల పూర్కమారు చుట్టివచ్చేను. జారుచక్రవర్తుల ఈమూడంతస్థులమేడ పూర్వంలాగే జాగ్రత్త పెట్టబడియుంది. ఇందులోని అలంకారాలు, వస్తుసామగ్రి, బీదవాళ్ళని పీల్చిపిప్పిచేసి లాగిన ధనాన్ని ఎటువంటి విలాసాలకోసం వెచ్చపెట్టేవారో చూపరులు తెలుసుకొనేటందుకు, ఏలాగనున్నవి ఆలాగే ఉంచివేయబడినాయి.

మధ్యాహ్నభోజనసమయం అతిక్రమించిపోవడం వలన నేను మార్గదర్శికతో హోటలుకు తిరిగివచ్చేను.

## ౮

తరువాత 'జైగ్' వివాహములను రిజిష్టరు చేసే ఆఫీసు చూడ డానికి వెళ్లేము. ఒక పెద్దమేడలో రెండో అంతస్థులో ఒకచిన్నగదిలో ఈఆఫీసు ఉంది. ఆఫీసులో ఇద్దరు ఆడగుమాస్తాలున్నారు. పెళ్ళిచేసు కుందుకు వచ్చే వధూవరులు కూర్చుండేటందుకు నాల్గయిదు బల్లలు అక్కడ వేయబడియున్నాయి. మమ్మల్ని రిజిస్ట్రారుకు దగ్గరగానున్న బెంచీమీద కూర్చోబెట్టేరు. నా మార్గదర్శిక రిజిస్ట్రారు దంపతులను వేస్తూన్న ప్రశ్నలన్నిటిని తర్జుమాచేసి నాకు చెప్పింది.

పెళ్ళి చేసుకోదలచిన స్త్రీపురుషులు ప్రొద్దుటేవచ్చి రెండు రూబుళ్లు చెల్లిస్తే వాళ్ళకి నంబరువేసిన చీట్ల నిస్తారు. వివాహాలను రిజిష్టరుచేసే ఆడుది వరుసగా నంబర్లను పిలుస్తుంది. పెళ్ళిచేసుకో దలచుకొన్న జోడా రిజిస్ట్రారుదగ్గరకు వచ్చి తమ ప్యాస్‌పోర్టులను చూపిస్తారు. రష్యాలోని కొత్తశాసనం ప్రకారం ప్రతివాడూ స్థానిక పోలీసులనుండి ప్యాస్‌పోర్టు తీసుకుతీరాలి. రిజిస్ట్రారు తనపుస్తకంలో వధూవరుల పేరులు వ్రాసుకుంటుంది. వారిచేత సంతకాలు చేయించు కుంటుంది. సరి. పనంతా పూర్తి అయినట్లే. స్త్రీపురుషులు భార్యా భర్తలుగా పరిగణించబడతారు. వాళ్ళనడిగే ప్రశ్నలు రెండ్లే.

"నీవయస్సెంత ?"— "ఇదివరకు నీకు పెళ్ళయిందా ?" నేనక్కడ ఉండగానే ఎంతోమంది జంటలుగా వచ్చి వివాహితులై వెళ్ళిపోయారు. ఈవివాహాలకి ఫాదిరీలవసరంలేదు. కాజీలు, పురోహితులు పనిలేదు. ఊరేగింపులు లేవు. ఆర్భాటాలు లేవు. రష్యాలో పెళ్ళి చేసుకోవాలంటే అయిదు నిమిషాలు చాలు. విడాకులకి ఇంకా తక్కువకాలం చాలును. భార్యాభర్తలలో ఏఒక్కరోవచ్చి "నేను విడాకులు పుచ్చుకొన కోరు తున్నాను." అని చెప్పేస్తే చాలు. వివాహబంధనం విడగొట్టివేస్తారు. విడాకులికి భార్యాభర్త లిద్దరూవస్తే మరీ మంచిది. కాని, ఇద్దరూ రావాలని నియమం లేదు. ఏఒక్కరో మాత్రం వస్తే రెండవవారికి వివాహవిచ్ఛేదనము జరిగినట్లు ఒకకార్డుమీద వ్రాసి తెలియపరుస్తారు. ఎందుకంటే ఈవిషయం వారు తమ ప్యాసుపోర్టులో ఎక్కించుకోవాలి. ఈవిడాకు లెందుకని రిజిస్ట్రారు అడగదు. రెండవవారిమీద నేరారోపణ చేసి ఋజువుచేసుకోవలసిన పనికూడాలేదు. కాని, భార్యాభర్తలమధ్య కలిగిన జగడాలు వారిలో వారే సర్దుకుంటే బాగుంటుందని కేవలం సలహామాత్రం రిజిస్ట్రారు ఇస్తుంది. అంగీకరిస్తే మంచిది. లేకుంటే అంతకన్నా మంచిది. చట్టం ప్రకారం ఆమాత్రపు సలహాకూడా అవసరం లేదు. వివాహాలని, విడాకుల్ని, నమోదుచేసే పుస్తకం నాకు చూపించేరు. కాని, నాకేమి తెలియలేదు. కాని రెండు పుస్తకాలలోను పుటలు రంగువే.

"నగటున నూటికెన్ని వివాహాలకి విడాకులు పుచ్చుకుంటున్నారు?" అని రిజిస్ట్రారునడిగేను.

"నూటికి ఏభై."

"అబ్బ ! ఇంత ఎక్కువా ?"

"అమెరికాలో దానిని పట్టిచూస్తే మాదేశంలో తక్కువే" అని

మార్గదర్శిక సమాధానం యిచ్చింది.

ఇంతలోకి ఉత్సాహంతో ఒకజోడావచ్చి నన్ను ఏదో అడిగేరు. నామార్గదర్శిక ఏదోసమాధానం చెప్పేసి— "మీ ఇద్దరిదీ నంబరెంత యని అడుగుతున్నారు"—అంది.

"జవాబేమి చెప్పేరు మరి ?"

"మీారు నంబరు లేదని."

ఒక చిన్నవయస్సుగల జంట రిజిస్ట్రారు దగ్గరకు వచ్చేరు. ఇద్దరికీ పదునెనిమిదేళ్ళుంటాయి. వాళ్ళ వెనుకనే వయస్సులోనున్న మరొక జంట వచ్చింది. ఈ జంటలో యిరువురూకూడా రెండోమారు పెళ్ళి చేసుకుంటూన్నవారే. అందువలన రిజిస్ట్రారు "మీ ప్రథమవివాహానికి సంతానం ఉన్నదా ?" అని ప్రశ్నించింది. వాళ్ళు లేదని చెప్పేరు. ఒకవేళ ప్రథమవివాహానికి సంతానం కలిగియుంటే వారిపోషణకి తల్లి తండ్రులిరువురు పూచీపడవలసిందే. కాని, ఇతర క్రైస్తవదేశాలలో మాదిరిగా ఆ బాధ్యత తండ్రినెత్తినే రుద్దబడదు. తండ్రి సంపాదకుడు కాకపోతే తల్లికే ఆబాధ్యత ఒప్పచెప్పబడదు. ఇచ్చట, బిడ్డలపోషణ కీయవలసిన ఖర్చు భార్యాభర్తల సంపాదనమీద ఆధారపడి ఉంటుంది. ఒకవేళ వారిరువురిలో ఒకరు జీవితవ్యయానికే కటాకటీగా సంపాదించు కొనే వాళ్ళయినపుడు రెండవవారి సంపాదనలో మూడవవంతు బిడ్డల పోషణ కిప్పిస్తారు. విడాకులు పుచ్చుకున్నతరువాత సామాన్యంగా బిడ్డలు తల్లివద్దనే యుంటారు. కాని, తల్లి పిల్లల్ని సరిగ్గా చూడక పోయినా, లేక త్రాగుబోతయినా, పతితఅయినా, తండ్రియే పిల్లల్ని తనవద్ద ఉంచుకొందుకు కోరవచ్చును. సామాన్యంగా పిల్లలవిషయమూ, వారి పోషణవ్యయమును విడాకులు తీసుకొనబోయేముందు తల్లి తండ్రులే తమలో తాము నిష్కర్షయించుకుంటారు. సంధి కుదరనప్పుడే

కోర్టులకెక్కుతారు.

రష్యాలో వివాహాలు రిజిష్టరు అయి తీరాలని శాసనం లేదు. స్త్రీపురుషులు యిష్టపడితే భార్యాభర్తలుగా వ్యవహరించవచ్చును. ఇందుకు ప్రభుత్వమూ అడ్డుపెట్టదు. సమాజంలోను ముక్కువిరుపులు, మూతివిరుపులు ఉండవు. కాని, భరణపోషణాల విషయం రచ్చకెక్కినపుడు ఈమాదిరి వివాహాలలో చాలా చిక్కులు సంభవిస్తాయి. ఆస్థితిలో స్నేహితుల్ని, బంధువుల్ని, సాక్ష్యం వేసుకొని పిల్లల తండ్రిని నిర్ణయించవలసియుంటుంది. సాక్షులు వారిద్దరు దంపతులవలె వ్యవహరిస్తున్నారనీ, పిల్లలు ఆతనికి పుట్టినవారే అయిఉంటారనీ, చెప్పినట్లయితే వానికికూడా భరణంలో భాగం వహించవలసియుంటుంది. రష్యాలో స్త్రీ—పురుషసంబంధాలింత వదులుగానున్నా అక్కడ దురాచారాలు ప్రబలలేదు. రష్యాస్త్రీలు పురుషులతో స్వేచ్ఛగా తిరుగుతారు— అనగానే ప్రతివాళ్లూ రష్యనుస్త్రీలు వేశ్యలవలె సంచరిస్తున్నారనీ, పురుషులు దురాచారులు, పతితులు అయిపోయినారనీ, ఊహించివేస్తారు. కాని, నిజం దీనికి కేవలం వ్యతిరేకం. నేను చూసినదానిని పట్టి యూరపులోవి ఇతరదేశాలలోని వారికంటె రష్యనులే చాలా పవిత్రులని చెప్పగలను. యూరపులోని సభ్యదేశాలన్నిటిలోను, స్త్రీలు పురుషుల్ని చులకనగా ఆకర్షించగల దుస్తులు ధరిస్తారు. ఉన్నతవర్గాలవారు చేసే విందులలోను, నాట్యాలలోను స్త్రీలు పురుషుల్ని మెప్పించాలనే ధోరణిలోనే యుంటారు. మగవాళ్ళు "కాంగైన తగిలితే కోటి లాభా''లనే ధోరణిలో వుంటారు. రష్యాలో ఈవిధంగా స్త్రీపురుషులొకరినొకరు వలలో పడవేసుకోవాలనే దుష్ప్రయత్నాలు చేయరు. స్త్రీపురుషులు రాత్రులు—పగళ్లు ఒకటే పెట్టెలో ప్రయాణం చేస్తారు. వేసవికాలంలో నదుల ఒడ్డున, సముద్రతీరాలను, కొద్దిబట్టలతో

కూడాకూడా కలసిమెలసి తిరుగుతూంటారు. ఒకప్పుడు దిగంబరులుగానే స్నానంచేస్తూంటారు. ఉత్సవాలలో కలసి తిరుగుతూంటారు. కాని, వారిలో మోహచేష్టితాలు కనపడనే కనపడవు. ఆదేశంలో ఒకరినొకరు మోసపుచ్చుట గొప్పనేరం. ప్రేమవిషయంలో, నిజాయతీగా, న్యాయంగా వ్యవహరించాలని రష్యనుల ఊహ. స్త్రీపురుషులు ఇష్టం వచ్చినపుడు విడాకులు ఇచ్చుకొనవచ్చును. కాని, నిత్యమూ పాతవాళ్ళని విడచి కొత్తవారిని పెళ్ళిచేసుకొనడం స్వభావంగా అయినట్లు ఋజువయిందంటే వారికి ప్రభుత్వం కైదుశిక్ష విధిస్తుంది. యూనివర్సిటీలలో స్త్రీపురుషులు కలసి ఒకే హాస్టలులో వుంటారు. ఒకరిగదులలోకి ఒకరు వెళ్ళవచ్చు. ఒకరినొకరు ప్రేమించుకోవచ్చు. భార్యాభర్తలవలె నివసించవచ్చును. ఇందుకు అధికారులుగాని, సహపాఠులుకాని, అభ్యంతరం చెప్పరు. విద్యార్థిని—విద్యార్థి—రిజిస్టరీ చేయించుకొనిగాని, రిజిస్టరీ లేకుండాగాని, కాపురం చేయదలచుకుంటే చేయవచ్చును. ఒకవేళ వారికి సంతానం కలిగితే కాలేజీకి సంబంధించిన సంరక్షణాలయంలో బిడ్డను విడచి చదువుకుందుకు పోవచ్చు. కాని ఏవిధమైన ప్రేమవాసనలేకుండానే స్త్రీపురుషులు కేవలం కామసంతృప్తికోసం కలసి విడిపోతున్నారని తెలుస్తే ప్రభుత్వం శిక్షవిధిస్తుంది. స్త్రీపురుషులెవ్వరయినా—పెళ్ళిచేసుకున్నా, చేసుకొనకపోయినా, సరే— రెండవవారికి సుఖవ్యాధులు తగిలిస్తే ఒక సంవత్సరం కఠినశిక్ష విధిస్తారు.

రిజిస్ట్రారుపని చేస్తూన్నది ఒకస్త్రీయని ఇందాకా చెప్పేను. గుక్క—తిప్పుకుందుకు వీలులేనంత పనియుండడంచేత ఇంకొక ముదుసలి ఆమెకి సాయంచేయడానికి వచ్చింది. నేను, మార్గదర్శిక, రిజస్ట్రారువద్ద కూర్చుండి యున్నాము. మేముకూడా పెళ్ళిచేసుకుందుకువచ్చిన జోడాలాగే యున్నాము. అందుచేత ఆముదుసలి మాకేసితిరిగి గంభీరంగా—

"తమ సంఖ్య ఎంత?"

అని అడిగింది. ఆమాటవిని నామార్గదర్శిక పకపక నవ్వింది. ముదుసలి అడిగిన ప్రశ్న తిరిగి నాకుచెప్పింది. రిజిస్ట్రారు కూడా నవ్వడం మొదలుపెట్టింది. మేము ఊరికే చూడడానికే వచ్చేమనీ, పెళ్లికి రాలేదనీ, వారామెకు చెప్పేరు. అప్పుడా ముసలిది

"ఎప్పుడో ఒకప్పుడు నువ్వు ఎవ్వడో విదేశీయుడైన భాగ్యశాలికి స్థిరమైన మార్గదర్శినివు అవుతావులే. నాకు తెలుసు." నని వేళాకోళం ఆడింది.

"ఎప్పుడో ఎందుకు? ఈవేళనే కానీయండి."

"కాని. మావద్ద నెంబరున్న టిక్కట్టు లేదుగా." అని నేను అడ్డుచెప్పేను.

"మరేమి ఫరవాలేదు. నేనే ఇస్తాను. మీనంబరు. చెప్పండి. ఇష్టమేనా?" అంది ముసిలిది.

"నేను హిందూస్థానీవాడిని. మీకామ్రేడ్ నాతో వివాహానికి అంగీకరించక పోవచ్చును"

నామార్గదర్శిక నవ్వుతూ, "నాకిష్టం అయితే మీరు సిద్ధమేనా?" అంది.

ఇప్పుడు నేను పలపోచిక్కేను.

"నిరుడే నేను ఒక భారతీయయువకుడికి రష్యను యువతికి పెళ్లిచేసాను." అని రిజిస్ట్రారు ఒక ఉదాహరణ చూపింది. 'నేను నీళ్లు నములుతూ "నాకు మాదేశంలో పెళ్ళి అయింది." అన్నాను. నామార్గదర్శిక ఆశ్చర్యపడింది.

"ఏమిటి? నిజంగా? మీకు పెళ్ళి అయిందా?"

మేము లేచి బాట మీదికి వచ్చేము. కాని నామార్గదర్శిక నాపెళ్ళివిష

యాన్నిగురించి ఒకపట్టాన విడిచిపెట్టే మనిషి కాదు. యక్షప్రశ్నలు ఒకలక్ష వేసింది.

"మీకు పెళ్ళి అయి ఎన్ని ఏళ్లు అయింది? మీభార్య వయస్సు ఎంత? ఆమె అందంగా ఉంటుందా? మీరిద్దరికీ "కోర్టుషిప్" ఎన్నాళ్లు నడిచింది?"

ఇల్లాంటివే గుక్క-తిప్పుకుండా అడిగింది. మాదేశంలో పెళ్లిళ్లకి ముందు "కోర్టు-షిప్" జరుగదని చెప్పినప్పుడు ఆమె ఆశ్చర్యానికి హద్దూపద్దూ లేదు.

"అయితే మీరు పెళ్లిళ్లు ఏలాగ చేసుకుంటారు?"

"మాతల్లిదండ్రులు మాకోసం పిల్లల్ని వెదికితెస్తారు—"

"—మీరు పెళ్లి చేసుకుంటారా?" ఆశ్చర్యంతో ఆమె కళ్ళు మిటకరించింది. కొంచెంసేపు ఊరకొని

"ఇల్లాగ జరుగుతుందని ఊహించడానికికూడా కష్టం తోస్తూవుందే, మీరు ఏలాగ చెసుకుంటారండీ?"

అంది.

"మాదేశాచారం అది."

"కాని, ఇది చాలా దురాచారం. దీనిని మార్చుకోనక తప్పదు. ఏమంటారు?"

మేము టీ పుచ్చుకుందుకు హోటలుకు తిరిగివచ్చేశాము. సాయంకాలం మళ్ళీ ఆర్టు-గేలరీ చూడడానికి వెళ్లేము. వెళ్లేముందు మాస్కో వెళ్లడానికి రైలుటిక్కట్టు, ప్యాస్‌పోర్టు, యాత్రికశాఖవాళ్ల దగ్గరుండగా తెచ్చుకుందుకు వెళ్ళేను. సోవియట్టుప్రభుత్వం ఈ వల చాలా తెలివితేటలుగా పన్నేరు. ఎవ్వడయినా కొత్తమనిషి రష్యాసరిహద్దులలో అడుగుపెట్టగానే సూటుకేసులు పెట్టెలుకూడా మూలయిస్తూ వెలికిపేస్తారు.

ప్రతివస్తువునీ—ఆఖరుకి కవర్లుసహా—వెతికివేసి అతనివద్దనున్న ప్రతిసరుకుని లెక్క వ్రాసేస్తారు. రష్యావిడిచి స్వదేశానికి పోయేముందు లెక్కలలో వ్రాసియున్న సరుకుమినహాగా ఇంకేమీ పట్టుకువెళ్ళనీయరు. యాత్రికులు రష్యాలో ఏవయినా సరుకులు కొంటే వాటికి 'కేష్‌మెమో'లు చూపించ వలసియుంటుంది. అతడు రష్యాలో ఉన్నన్నిరోజులూ ప్యాస్పోర్టు ప్రభుత్వం చేతిలో వుంటుంది. బహుశా ఈపని విదేశీయులపై ఒకకన్ను వేసియుంచడానికి కావచ్చును. యాత్రికులు ఒకనగరంనుంచి మరొక చోటికి పోయేటప్పుడు అతనికి ప్యాస్పోర్టు ఇచ్చివేస్తారు. ఎవ్వరివిష యంలో ఏలాజరిగినా నాకు కలిగిన అనుభవం అది. యాత్రికశాఖాకార్యా లయంలోని ఉద్యోగులు అంతచురుకుగా పనిచేయలేరు. చిన్నపనికి ఎంతోసమయం పాడుచేస్తారు. నేను యాత్రికశాఖవారి ఆఫీసునుంచి వెలువడుతూంటే చామనిచాయరంగుగల పొడుగాటి మనిషియొకడు నన్ను ఆపేడు. ఇంత దూరదేశంలో స్పష్టంగా భారతీయుడులా కనిపి స్తూన్న పెద్దమనిషిని చూడడానికి చాలా ఉత్సాహం కలిగింది. ఇంతలోకి ఆయనముందుకు వచ్చి, "మీరు భారతీయులా?" అని అడిగేడు.

"ఔనండి, తమరుకూడానా?"

"ఆహా! మీరు ఈమాత్రంగుర్తించలేరు? తమ నామధేయం."

"బెనర్జీ."

"నేను ఛటర్జీని."

ఇంతదూరంలో ఒకసాటి బంగాళీపెద్దమనిషిని కలుసుకున్నందుకు నాకు చాలా ఆనందమయింది. కొంచెం వివరంగా అడిగినమీదట ఆయన కీర్తిశేషులయిన అఘోరనాథ ఛటర్జీపుత్రులనీ, శ్రీమతి సరోజినీనాయుడు సోదరులనీ పేరు హరీంద్రులనీ, ఈమధ్య లెనిన్‌గ్రేడ్ యూనివర్సిటీలో ఆచార్యులుగా ఉన్నారనీ, తెలిసింది. ఆరోజుననే రాత్రి నేను మాస్కోకి

ప్రయాణం కావలసియుండడంచేత ఆయనను మరల కలుసుకోలేక పోయాను. లేకుంటే రష్యాలోని వాస్తవికవిషయాలు కొన్ని తెలిసియుండేవి.

శ్రీ వేమన గ్రంథాలయమువారు,
తేలప్రోలు.

౫

అక్కడనుంచి మేము ఆర్టుమ్యూజియము చూడడానికి వెళ్లేము. అది చూడడానికి నామమాత్రంగా ఫీజు కట్టాలి. అప్పుడు ఒక మార్గ దర్శిక యాత్రికునికి అన్ని చిత్రాలని, బొమ్మల్ని చూపించి అవిఎప్పుడు తయారుచేయబడినాయో, వాని పద్ధతి, అందులోనున్న గొప్పతనం బోధిస్తుంది.

హెర్మిటేజ్‌లో పురాతనచిత్రాలు పోగుచేయబడినట్లే ఇందులో విప్లవానంతరం గీయబడినచిత్రాలు మూర్తులు, పోగుచేయబడినాయి. ఎవ్వరయినా క్రమంగా కాలాలు తెలుసుకుంటూ ఈబొమ్మల్ని పరిశీలించి చూస్తే విప్లవం మొదలు నేటివరకు రష్యనుల మానసికప్రవృత్తుల వికాసం గోచరిస్తుంది. వేరువేరు కాలాలనాటి వస్తువులు వేరువేరు గదులలో ఉంచబడినాయి. ఒకేసమయంనాటి చిత్రాలు, మూర్తులు, పాత్రలు, బట్టలు, మొదలయిన సమస్తవస్తువులు, చూచేవాళ్ళకి ఒక గదిలోనే కనిపిస్తాయి. అంతేకాని, ఒకేరకం వస్తువులు ఒకేగదిలో ఉంచబడలేదు. ఈపద్ధతివలన ఒకకాలంనాటి వస్తువులన్నీ ఒక్క చోటనే కనబడతాయి.

విప్లవానంతరం ప్రజల మనస్సులు కాటకం, గృహయుద్ధం,

(Civil War) మొదలయిన బాధలలో మునిగియుండేవి. అందుచేత ఆకాలంలో వ్రాయబడిన చిత్రాలలో మనుష్యుల మానసికచింతలు స్పష్టంగా కనిపిస్తున్నాయి. ఒక్కబొమ్మలలోనేకాదు, నాటకాలలో, నవలలో, కథలలో, గీతాలలో, కళకి సంబంధించిన ప్రతివస్తువులోను, అదే దుఃఖపూరితమైన భావం స్పష్టంగా కనిపిస్తూంటుంది. ఈకాలం గడిచినతరువాత విప్లవవిరోధులంతా నాశనం చేసివేయబడినాక విజయోల్లాసంలో బోల్షివిక్యువకులు త్రాగుడులోను, వ్యభిచారంలోను, మునిగిపోయారు. వారు దేశంలోని వస్తువులన్నిటితోపాటు స్త్రీలను కూడా సార్వజనిక సంపద చేసివేశారు. ఒకడుకాని, కొంతమంది కలిసికాని, బహిరంగంగా ఏవిధమైన అడ్డులేకుండా ఆడవాళ్ళను బలవంతపెట్టి మానభంగంచేసిన ఘటనలు ఆకాలంలో పరిపాటి అయిపోయినాయి. రష్యనుయువకులు మతవిశ్వాసాలను ధిక్కరించి త్రోసివేశారు. సమాజంలోని కట్టుబాటులను స్వేచ్ఛగా కాలతన్నివేశారు. ఆరోజులు చాలా గడ్డురోజులు. ఆయుగంలో ప్రజలంతా నూతనత్వమనే మత్తులో ఒళ్ళుతెలియకుండా అయిపోయారు. దేశంలోని పండితవర్గం (Intellectuals) ఈభయంకరవిప్లవపరిణామాన్ని చూసి చకితులైపోయేరు. శాంతిని స్థాపించి, సమాజాన్ని సుస్థిరం చేయడానికి వాళ్లు విశేషంగా ప్రయత్నాలు చేయసాగేరు. ఆనాటి ప్రజల మానసికప్రవృత్తులు Three pairs of silk stockings - Embezzlers - Squaring the circle- మొదలయిన సుప్రసిద్ధ రష్యన్ నవలలను చూస్తే బోధపడతాయి.

దీనితర్వాత పంచవర్షప్రణాళికయొక్క కాలం. ప్రతిచోట ప్రతిపనిలోను ఒకవిధమైన క్రమము. నిర్ణీతమైన కార్యక్రమము ఏర్పడింది. ఉత్పాదనలో ఒక నిశ్చితమైన కార్యప్రణాళిక. శాసనాలలో ఒకపద్ధతి

ఏర్పడింది. ఆర్టు—గేలరీలో ఈయుగానికి సంబంధించిన బొమ్మలు చాలా ఉన్నాయి. కూలీలు గనులలో పనులు చేస్తూన్నట్లు—ఫేక్టరీలు నడుపుతూన్నట్లు—నూతనవిశ్రాంతిభవనాలు కట్టుతూ వున్నట్లు—కార్ఖానాలలో పనిచేస్తూన్నట్లు—నల్లనిపొగ చిమ్ముతూవున్న ఎర్రని కణకణలాడే నిప్పులతో మండుతూవున్న పొయ్యిలవద్ద కూలీలు నిల్చున్నట్లు—ఇల్లాంటివే ఎన్నోబొమ్మలు. సమిష్టివ్యవసాయక్షేత్రాలు, సామూహిక భోజనాలయాలు, ప్రభుత్వం నిర్వహిస్తూన్న ఇతర పనులయొక్క, ఆదర్శాలయొక్క చిత్రాలెన్నో. ఇవికాకుండా పువ్వులు, పళ్లు, పొదలు, ప్రకృతిదృశ్యాలయొక్క బొమ్మలుకూడా ఈకాలంలో తయారయినాయి. కాని, అప్సరసలవికాని, దేవతలవికాని, స్వర్గ—నరకవిచిత్రాలుకాని చిత్రించబడలేదు. ఆఖరుకి క్రీస్తుబొమ్మ కూడా లేదు. నేటిరష్యనులు నూటికినూరుపాళ్లు ప్రత్యక్షవాదులు. వాళ్ళు పిల్లల పాఠ్యపుస్తకాలలో నుంచికూడా దేవతలపాఠాలు, కథలు, తొలగించివేశారు. ఈమధ్య సీమధ్యనే పాఠ్యగ్రంథాలలో కల్పనాకథలకి అనుమతినిచ్చేరు. ఈకల్పనాకథలలోనయినా భూతప్రేతపిశాచాలను గూర్చికాక, నవీన సమాజము, నూతనాదర్శాలను, గూర్చినవిషయాలు మాత్రమే వ్రాయబడుతున్నాయి.

విప్లవానంతరం కొద్దికాలంలోనే రష్యను కళాకారులు, రేఖాచిత్రాలలోను — రంగులబొమ్మలలోను కొత్తమార్గాలు—టెక్నికు అవలంబించేరు. దీనినిచూస్తే రష్యనులు పూర్వపుపద్ధతులంటే ఎంత అసహ్యపడేవారో తెలుస్తుంది. ఈకాలములోని కళాపరిణామము పూర్వముకంటె కేవలం కొత్తగానేయున్నా, ఉన్నతిని మాత్రం పొందలేదని ఒప్పుకొనకతప్పదు. బొమ్మలు—నవలలు—నాటకాలు అన్నీ ఒకప్రత్యేకోద్దేశ్య సాధనకే ఉద్దేశించబడినాయి.

కళాస్వాతంత్ర్యాన్ని నిరోధించేటందుకు 'Rapp' అనే ప్రొలిటే రియటుసభ ఒకటి నిర్మించబడింది. ఆసభ కళయొక్క అన్నిశాఖలను బలవంతంగా ఉద్దేశ్యసాధనోపకరణాలనుగా తయారుచేసింది. ఏది తయారుచేసినా కమ్యూనిస్టు ఆదర్శాలప్రచారంకోసమే తయారుకావలసి యుండడంచేత ఆకాలంనాటిరచనలన్నీ ఒకేఅచ్చులోపోసి తయారు చేసినట్లు ఉన్నాయి. గీతికావ్యాలు నిషేధించబడినాయి. 'జిప్సీ' సంగీతం నిషేధించబడింది. 'హెరాల్డు లాయిడు' ఫిల్ములుకూడా దేవిడీమన్నా చేయబడినాయి. "కళ కళకోసమే" అన్నమాట విడిచిపెట్టబడి రైప్ కమిటీ ద్వారా దానికొక ప్రత్యేకమార్గం నిర్ణయించబడింది. ఈ పని వలన ఈకాలంలోతయారైయిన వస్తువులలో కళాస్వరూపమే మాసి పోయింది. కాని, రష్యనులు ఈపరిణామాన్ని త్వరలోనే గ్రహించ గలిగేరు. 1932 ఏప్రియలు 23 వ తేదీన కళలను, సాహిత్యాన్ని, నియమించడానికి ఏర్పడిన "వోప్" "రైప్" "రైంప్" మొదలైన సంస్థల్ని రద్దుచేస్తూ ప్రకటనచేశారు.

అదివరకు, పత్రికలలోను, రేడియోలలో, సమావేశాలలో, వాగ్వ ర్ధినీ సమాజాలలో, ప్రతీచోట, రాజనైతికోపన్యాసాలు ఇవ్వడమో, విన డమో, వలన విసిగియున్న రష్యనులు, కలాకారుని కూడా సమాజము యొక్క సజీవమయిన అంగమునుగాచేసి వినోదించాలనే అభిప్రాయానికి వచ్చేరు.

కలానిరోధకసమితులు రద్దుచేయబడినంతనే రష్యనుకళాప్రవా హము వేరువేరుమార్గాలలో నిర్నిరోధంగా ప్రవహించి ఉచితమార్గాలకి చేరుకుంది. నేడు రష్యనుప్రభుత్వం, తనను పడత్రోయడానికి ప్రయ త్నించే సాహిత్యాన్నిమాత్రమే నిషేధంలో ఉంచింది. మాస్కోలోని "స్టేటు ప్లానింగ్ కమీషన్" వారి కార్యక్రమాన్నికూడా విమర్శించి

నూతనమార్గాలు చూపడానికి అవకాశాలు ఈయబడినాయి. 'వోక్సు' అనే ఆంగ్లపత్రికలో సోవియటుప్రభుత్వముయొక్క ప్రశంస, విమర్శనము గూడ నేను చూశాను.

ఇప్పుడు తిరిగి రష్యాలో నూతనచిత్రాలు విరివిగా వ్రాయబడు తున్నాయి. ఇవి ఫ్రెంచి-ఇటాలియనుచిత్రాలతో పోటీ చేస్తూన్నాయా అన్నట్లు చాలా తీవ్రంగా పరిణతి పొందుతున్నాయి. ప్రేమకథలు-నవ లలు తిరిగి వ్రాయబడుతున్నాయి. డిక్టేటరుషిప్ వ్యవసాయం విరివిగా చేయించి యంత్రాలు నడపగలదు, కాని, కళలను అభివృద్ధిలోకి తీసుకు రాలేదని వారు అనుభవంమీద గ్రహించగలిగేరు.అయినా రష్యనుసాహి త్యంలో విప్లవోద్రేకం ఇంకా తగ్గలేదు. తగ్గడంమాత్రం ఏలాగ? రష్యను సాహిత్యనిర్మాతలంతా విప్లవకారులేనాయె.

పూర్వం రష్యాలో కళాకారులంటే చాల నీచంగా చూసేవారు. వారు బూర్జువాయుగంలోని పండితవర్గం (Intellectual) యొక్క అవశేషాలని ప్రజలకొక అభిప్రాయం ఉండేది. కళాకారుల కానాడు ప్రభుత్వంలో స్థానం ఉండేదికాదు. కాని, నేడు వారి స్థితి వేరు. ఇంజ నీర్లు, శాస్త్రకారులకువలెనే వారికి విశేషమైన ప్రతిఫలం ఇస్తున్నారు. ఇప్పుడు వారు ప్రకాశకులను, కొనేవారిని, వెదుకనక్కర్లేదు. పుస్తకం వ్రాయడం. ప్రభుత్వానికి పంపడం. మిగిలినదంతా ప్రభుత్వమే చూచుకుం టుంది. నేను మాస్కోనుంచి బర్లిన్ వచ్చేటప్పుడు బండిలో ఒకగ్రంథ కర్తను కలుసుకున్నాను. నలభైవేలమాటలను ఒకయూనిటుగా ఎంచి ప్రభుత్వం ప్రతిఫలం ఇస్తూందని ఆయననుంచి తెలుసుకున్నాను. నాటక కారులకి, శిల్పులకి గౌరవభృతు లీయబడుతున్నాయి. నేడు రష్యను కళా కారులు అన్నిదేశాలవారికంటె సుఖంగా జీవితం గడుపుతున్నారు. ప్రభు త్వం, ప్రజలు, కూడ వారిని సమ్మానిస్తున్నారు.

## ౬

అక్టోబరు హోటలకు ఎదురుగానే మాస్కో స్టేషను ఉంది. ఇక్కడనుంచి బోల్షివిక్కుల రాజధానీనగరమైన మాస్కోకి రైలు పోతుంది. నేను మార్గదర్శికతో కూడి స్టేషనుకు కాలినడకనే బయలుదేరేను. మార్గదర్శిక బండిలో నాకోసం రిజర్వుచేయబడిన శయ్యను వెదికి కనిపెట్టింది. రష్యనురైళ్ళలో మూడవతరగతిలోకూడా టిక్కెటుఖరీదుకంటె కొంచెం ఎక్కువ ఇస్తే 'బర్తు' దొరుకుతుంది. రిజర్వు చేయించుకుందుకు ఇచ్చే ఫీజుకంటె ఇంకకొలది ధనం ఇస్తే రైలుఅధికారులు శుభ్రమైన దుప్పట్లు, తలగడాలు, గద్దెలు, సప్లయి చేస్తారు. ఒక్కస్వీడనులో మినహాగా మరెక్కడా బాటసారులకి ఇటువంటి సౌకర్యాలు దొరకవు. ప్రతిచిన్న కంపార్టుమెంటులోను నాలుగుప్రక్కలుంటాయి. కాని, అవన్నీ రిజర్వు చేయబడి యుండలేదు. ఒకటిరెండింటిమీద చాలమంది బాటసారులు కూర్చున్నారు.

మార్గదర్శిక నన్ను సుఖంగా కూర్చోపెట్టి వెళ్లిపోయింది. వెడుతూ వెడుతూ "మీదేశంలో తల్లిదండ్రులు పిల్లలకి వరుల్నీ, వధువుల్నీ, కూరుస్తారనేమాట నేనెన్నటికీ మరిచిపోలేను." అంది.

"కాని, అందువలన మేము అణుమాత్రమైనా విచారం పొందడం

లేదు. మీవివాహపద్ధతివలన మీరంతా సుఖపడుతున్నారా ? మీజీవితసహచరుల్ని మీరే ఎన్నుకుంటూవున్నా ఇంత ఎక్కువగా విడాకులు ఎందుకు ఇవ్వవలసివస్తూంది?''

''ఇది జీవితమాయె. జీవితము నిత్యపరివర్తనశీలము—పరివర్తనమే జీవనచిహ్నము.''

''కాని—''అంటూండగానే గార్డు ఈలవేశాడు. నేను చేతులు ఊపుతూ "నామాటలేవయినా మీకు కష్టం కలిగించివుంటే క్షమించండి. వాటన్నిటిని మరచిపొండి.'' అన్నాను.

''నేను మిమ్మల్ని ఎన్నడూ మరిచిపోలేను.''

బండి బయలుదేరింది. రష్యనుబండ్ల కిటికీలకి రెండేసి అద్దాలుంటాయి. పెట్టెలలో ఆవిరిద్వారా వేడికలుగచేస్తారు. ఈబండి కూలీలతోటీ రైతులతోటీ, నిండివుంది. అబ్బ! పొగచుట్టలెంత మురికిగా వున్నాయి. పెట్టెలలో క్రింద తుబుక్కున ఉమ్మివేసి, ఆ పెద్దపెద్ద బూట్లతో, రాసేస్తున్నారు. వాళ్ళ బట్టలుచూస్తే ఎన్నడూ చాకలిమొగం చూసినట్లు తోచదు. ఆడవాళ్ళూ—మొగవాళ్లు కలిసే కూర్చున్నారు. వాళ్ళలో ఏమీఅంత ప్రత్యేకం పట్టింపులున్నట్లు తోచదు. వారు కామ్రేడ్లు. ప్రభుత్వదృష్టిలో వారిద్దరిలో తేడా ఏమీలేదు. స్త్రీపురుషులిరువురు ఈవిధంగా కలసియుంటే వారిలో జాతిభావం (Sex mentality) పోతుందని వారిఅభిప్రాయం. ఈమిశ్రణం వలన ఆకర్షణతగ్గవచ్చునుగాని, సహజమైన కామేచ్ఛ ఏలా తగ్గుతుందో నాకు బోధపడలేదు.

ఇక్కడి రైతులు—కూలీలు తమ నీచదినాలనాటి యలవాట్లను మరచిపోలేదు. కనక కొంచెం జాగ్రత్తగా సామాను చూసుకుంటూ వుండమని మార్గదర్శిక హెచ్చరించి వెళ్ళింది. అందుచేత శుభ్రమైన శయ్య అమరినా నిద్రపోలేకపోయాను.

నేనెక్కినబండి రష్యాలోని రైలుబండ్లన్నిటికంటె చాలా వేగంగా పోతుంది. "లెనిన్‌గ్రాడ్"నుంచి "మాస్కో" వరకునున్న ౪౦౫ మైళ్ళ ప్రయాణాన్ని ౧౨గంటలలో ఈబండి ముగించివేసింది.

౭

మాస్కోలో నాకు మంచి ప్రత్యుత్థానమే జరిగింది. రైలునుంచి, దిగగానే మంచి అందమైన పడుచుఒకర్తె నావద్దకు వచ్చింది.

"మీరేనా బెనరరః"

"హా"

నేను తలఊపేను. ఆమె నన్ను మోటారులో కూర్చుండబెట్టుకొని హోటలుకు తీసుకుపోయింది.

"మాస్కో" లేక "మాస్కావా" నదీతీరాన "రెడ్‌స్క్వేర్"కీ "క్రెమ్లిన్" కీ సమీపంలో వుంది ఈహోటలు. ఇదిచాలా ఆధునికంగా వుంది. 'లెనిన్‌గ్రాడ్' లోని హోటలుకంటె పెద్దది కూడానేమో.

నాకు తిండికి చీట్లనిచ్చి, ఒకగది బసకి చూపించేరు. నాగదిలోనుంచిచూస్తే 'మాస్కావా' నది 'రెడ్‌స్క్వేర్' కూడా కనిపిస్తాయి. "ఈవేళనే మీరు ఏవయినా చూడదలచుకుంటే వెంటనే తిండితిని బయలుదేరండి" అని మార్గదర్శిక సలహాఇచ్చింది. నేను చేతులు—మొగం కడుక్కొని భోజనాలశాలలోకి వెళ్లేను.

నిన్నను లెనిన్‌గ్రాడులో కనపడిన ఆస్ట్రేలియాదేశీయుడు ఇక్కడ కనపడగానే నాకు చాలా సంతోషం కలిగింది. ఆయన చాలా విచారం

గాను, నిరాశతోను, ఉన్నట్లు తోచింది.

"మీస్నేహితులంతా ఏరి ?"

"స్నేహితులెవరు ?"

"నిన్నను మీతో లెనిన్‌గ్రాడ్‌లో కనిపించినవారు."

"వారికీ, నాకూ, రష్యాలోనే పరిచయం కలిగింది, ఇక్కడికి వచ్చినతర్వాత విడిపోయేము. మేము స్నేహితులము కాము."

"ఏమిటి ? రెండు రోజుల్లోనే చిక్కిపోయినట్లు కనిపిస్తున్నారు."

"ఔను నేను చాలా అసహాయ స్థితిలో వున్నాను. ముష్టివాని కంటెనూ అధమంగా ఉన్నాను. నామనోవిచారం బహుశా శరీరాన్ని అల యింప చేసియుండవచ్చు."

ఆయనమాటలు నాకు చాలా ఆశ్చర్యం కలిగించేయి.

"ఏమి జరిగిందో దయచేసి చెప్పుతారా? మీసామానుల నెవరేనా ఎత్తుకుపోయారా? లేకపోతే మీరూపాయలెక్కడనైనా పడిపోయినాయా?"

"లేదన్నా! అదేం కాదు. నేనిక్కడ ఏదయినా పని వెతుకుకుందా మని వచ్చేను. నేను ఇంజనీయరుని. రష్యాలో ఇప్పుడు చాలమంది విదేశీ ఇంజనీర్లున్నారు. ఇంకా అవసరం వున్నారు. కనక ఇక్కడ ఏదయినా పని దొరుకుతుందని ఆశించేను."

ఒకగ్రుక్కెడు, టీ త్రాగి మళ్లీ ఆరంభించేడు.

"ఎవడయినా ఇక్కడ పని సంపాదించుకొనే ఉద్దేశ్యంతో వస్తూ న్నట్లుయితే ప్యాస్పోర్టుదరఖాస్తులో ఆవిషయం ఉదాహరించాలనీ, లేకుంటే నౌకరీ ఈయబడదనీ. ఈమధ్యనొక కొత్తశాసనం చేశారు. కాని, నాకెవ్వరో రష్యనులు విదేశీయుల కెవ్వళకీ పనులివ్వడం లేదనీ నౌకరీ కోరుతూ పెట్టుకొనే దరఖాస్తులమీద "విసా" (రాజదూత సంతకం) దొరకేటప్పటికి చాలాకాలం పడుతుందనీ, చెప్పడంచేత నేను

దరఖాస్తులో ఆవిషయం ఉదాహరించలేదు. అంతకాలం నిరీక్షిస్తూ కూర్చుండడానికి తగినంత ధనం నావద్దలేదు. అందుచేత నేను సాధారణ యాత్రికుని 'విసా' మాత్రమే సంపాదించి, వచ్చేశాను. ఇక్కడికి వచ్చిన తర్వాత నేను చేసినది చాలా పొరపాటని గ్రహించేను."

"ఇక్కడ మీరు పనికోసం ప్రయత్నం చేశారా ?"

"ఆ 'లెనిన్‌గ్రాడు'లో ప్రయత్నిస్తే మాస్కో వెళ్ళండి పని సులువుగా దొరుకుతుందని అన్నారు. ఇక్కడికి వచ్చేను. అధికారుల దగ్గరికి వెళ్ళేను. వాళ్లు నాకు ఆశ చూపించేరు కూడా. కాని. నావద్దనున్నది సామాన్యయాత్రికుల 'విసా' యని తెలియగానే నీకేమి అవకాశం లేదు పొమ్మన్నారు. ఇప్పుడు యింటికి తిరిగి పోవడానికేనా తగినంత డబ్బు లేదు. నేను ఇంగ్లండులో కొందరు స్నేహితులకి తంతినిచ్చేను. కాని, వాళ్లు ఇరుగో ఇల్లాంటి మిత్రులు—"

ఆయన కంఠం రుద్ధమైంది. మాటలాడక ఊరుకున్నాడు.

"మీకుటుంబం ఎక్కడ?"

"ఆస్ట్రియాలో. పాపం. దురదృష్టవంతులు, నానలుగురు పిల్లలు తల్లితో కూడా మాడి చచ్చిపోతున్నారు కాబోలు.''

హఠాత్తుగా కొరుకుతూవున్న రొట్టెముక్కను పళ్ళెంలో పారేసి "మీకు ఈశ్వరుడంటే విశ్వాసం ఉందా?" అనిప్రశ్నించేడు.

ఈయన ఉద్దేశ్యం ఏమిటని ఆలోచిస్తూ ఉండగానే నాసమాధానం తెలుసుకొనకుండానే గట్టిగా కేకవేశాడు.

"అబద్ధం. ఈశ్వరుడు లేడు. అసలు ఈశ్వరుడు కానే కాలేడు ఎవ్వడూ కూడా. నేచెప్పగలను. ఈశ్వరుడు 'సర్వపిత' అంటారు ప్రజలు. ఆతడందర్నీ ప్రేమిస్తాడంటారు. కాని, నిజం దీనికి కేవలం విరుద్ధం. అందుచేతనే ఈశ్వరుడు లేడు అంటున్నా. ఒకవేళ ఉన్నా, ఆతడు

పక్షపాతి. ఆతడు పెట్టుబడిదారులకీ, ఇతరుల పీర్చిపిప్పిచేసి తినేవారికీ, మాత్రమే సహాయం చేస్తాడు."

"మామతధర్మాలు పూర్వజన్మలో చేసిన కర్మలనుపట్టి ఈజన్మలో మానవుడు సుఖదుఃఖాలనుభవిస్తాడని చెప్పుతున్నాయి."

ఈమాటలెంతో రటపటాయిస్తూ అన్నాను. వెంటనే ఆయన అందు కున్నాడు.

"పూర్వజన్మా? వట్టి తెలివితక్కువ. ఎప్పుడూ కనపడని ఈశ్వరుడు, పూర్వజన్మ, అదృష్టం, మొదలయిన పుట్టగింతలతో పెట్టు బడిదారుల దుశ్చర్యలనీ, పీడలనీ, దాచిపెట్టితే లాభం ఏమిటి? తనకి తాను తోడ్పడితే ఈశ్వరుడుకూడా సాయపడతాడని చెప్పుతారు. నన్నే చూడండి. నేను పడుచుదనంలో ఉన్నాను. ఆరోగ్యంగా ఉన్నాను. పనిచేయడానికి సిద్ధంగా ఉన్నాను. బాగా చదుపుకొన్నాను. తెలివితేటలు లేకపోలేదు. ఎన్ని ఉంటేనేం? పెట్టుబడిదారుల కుట్రలవలన తిండిలేక మాడి చావవలసినవస్తూంది. నాకు పని దొరకదు."

ఉద్రేకంలో రొట్టెనుంచి ఒకముక్కను కొరికివేశాడు. ఆయన పెదవులు దుఃఖంచేత వేదనచేత కంపించిపోతున్నాయి.

"కాని, రష్యా 'ప్రొలిటేరియట్ల' దేశం కదా? ఇక్కడివాళ్లు మీకు పని ఎందుకుఈయరు?"

"వాళ్ళకీ ఏవో నియమాలున్నాయి. నేను వానిని అతిక్ర మించేను."

"అయితే మీజన్మభూమి ఆస్ట్రేలియాలో ఏమి పనిదొరకదు?"

"వెధవ జన్మభూమి. ఇదంతా ఒకపెద్దవల. అన్నిదేశాలలలోను— స్వతంత్రదేశాలయినా పరాధీనదేశాలయినా అంతే— కాస్త మంచివస్తు వులన్నీ ధనికులు, బూర్జువాలు, ఎగరేసుకుపోతున్నారు. ఇంక ప్రొలిటేరి

యటులకి మిగిలేది బుగ్గి—బూడిద."

నేను మాటలాడక గిన్నెలోని టీ చప్పరించడం ఆరంభించేను. హఠాత్తుగా ఆయన తన బలిష్ఠమైన వ్రేళ్ళతో వంటవానిని చూపిస్తూ మళ్ళీ ఆరంభించేడు.

"వీళ్ళ ముఖాలలో ఉన్న సంతోషకళని చూడండి. వీళ్లు పెద్దఅంత భోగాలేవీ అనుభవించడం లేదు. కాని, తిండిలేక చావవలసిన గతిమాత్రం పట్టదు. వీళ్ళకుటుంబాలు ఆకలికి నకనకలాడుతూ వెర్రిమొగాలేసుకొని వీళ్ళసంపాదనకోసం ఎదురుచూస్తూ కనపడరు. తిండిలేక చావవలసిన గతి పట్టదని రష్యనులు బాగా ఎరుగుదురు. విప్లవం సాధించిన మహాత్కార్యం ఇదే. మాదేశంలోను, ఇతరపెట్టుబడిదారీ దేశాలన్నింటిలోనూ వలెనే ఎంతెంత జీతం తెచ్చుకుంటూన్నవాడయినా యజమానికి ఎక్కడ కోపంవస్తుందో, ఉద్యోగం కాస్తా ఊడపీకితే తిండిలేక ఎక్కడ చావ వలసివస్తుందో, అని ప్రాణాలు గుప్పిటపట్టుకొనియుంటాడు."

"ఇక్కడకూడా ఉద్యోగం ఊడపీకడం, అవీ జరుగుతూనే ఉన్నాయి. ఇక్కడకూడా ఉన్నతాధికారుల్ని సంతృప్తిపరచక తప్పదు కాదా?"

"మిస్టర్ వెనరతః!"

వెనకతిరిగి చూసేను. ఒకపడుచుతో నామార్గదర్శిక అక్కడ నిలు వబడియుంది.

"మీరు సిద్ధంగా ఉన్నారా?"

"అయితే మీరు ఇప్పుడే ఎక్కడికయినా బయలుదేరుతారా?"

"ఆ. మీకిష్టం అయితే. ఇదిగో ఈమె మీ కొత్త మార్గదర్శిక. చూడవలసినవన్నీ ఈమె చూపిస్తుంది. ఇంక నాకు సెలవు."

ఇదిచాలా బాధకరమైనవిషయం, నిజానికి. ప్రతిచోట నాలదృష్టం

ఏమిటోకాని, నన్ను స్టేషనునుంచి తీసుకొనివెళ్ళడానికి మంచి అందమైన తెలివితేటలు, చురుకుదనం, గల పడుచులు లభిస్తున్నారు. కాని, నాదుర దృష్టం వారిని మార్చివేస్తూంది. వాళ్ళస్థానే వచ్చినవాళ్ళు అసహ్యంగా లేకపోయినా అంత అందంగా మాత్రంలేరు. ఈనూతనమార్గదర్శిక 21 ఏళ్ళ సన్నని పడుచుపిల్ల. ఇంగ్లీషు బాగా మాట్లాడుతుంది. పైపెదవి మీద గోధుమరంగు మీసాలు రేఖామాత్రంగా కనిపిస్తున్నాయి. యూరపు స్త్రీలలో ఈమీసాల విషయం సర్వసామాన్యం.

మేము క్రెమ్లిన్‌కి సమీపంలోనున్న 'లెనిన్' సమాధి చూడడానికి వెళ్ళేము.

మాస్కోవా నదిమీది వంతెనదాటి 'రెడ్‌స్క్వేర్' చేరుకున్నాము. 1917 నాటి మహావిప్లవంలో ఈప్రదేశం రక్తప్లావితం కావడంచేత దీనికీ పేరు వచ్చింది. దీనికొకవైపున 'క్రెమ్లిన్'యొక్క ప్రహరీగోడ హద్దుగా ఏర్పడింది. ఇంకొకమూల "సెంట్ బేసిల్ కేథడ్రిల్" ఉంది. ఇందులో ఇప్పుడు ధర్మవిరుద్ధవస్తుప్రదర్శనశాల, ఐతిహాసికవస్తుప్రదర్శనశాల, ఇంకాఏవేవోకాని ఉన్నాయి. 'క్రెమ్లిన్'లోనే సుప్రసిద్ధమైన మాస్కో గంట వుంది. 'క్రెమ్లిన్' చూడడానికి పెద్దఎత్తైన ప్రహరీగోడలూ అదీ గంభీరంగా పెద్దకోటలా ఉంటుంది. ఈమహాభవనమే బోల్షివిక్ ప్రభుత్వము యొక్క ప్రధానకార్యాలయము. ఈ'క్రెమ్లిన్' గోడలమధ్య కూర్చుండియే నియంతలు ప్రపంచం అంతటిలో ప్రప్రథమమయిన సోషలిస్టుప్రభుత్వముయొక్క రాజ్యాంగసూత్రాలు చేపట్టి, దానిని చూడడానికి రానిచ్చేవారు. కాని, ఈమధ్య ఎవ్వరినీ, లోనికి రానీయడంలేదు.

'క్రెమ్లిన్' యొక్క ప్రహరీగోడ నానుకొనే 'లెనిన్' యొక్క సమాధి ఉంది. ఈసమాధి చాలాఖరీదయిన శిలలతో కట్టబడింది. కాని, పెద్దఆర్భాటంగాని, నగిషీపనులుగాని, లేక చాలా నిరాడంబరంగా

కనిపిస్తుంది. పెద్దఆర్చీలు, అంతస్తులు, కాని లేవు. శిల్పిచాతుర్యం చూపించే విశేషాలేమి లేవు. ఊరికే పెద్దపెద్ద దళసరిరాళ్లు పిరమిడ్ల పోలికగా ఒకదానిమీద ఒకటి పేర్చేరు. దానిలోనికి వెళ్లేటందుకు ఏర్పరచబడిన చిన్నద్వారంవద్ద ఇద్దరుసిపాయీలు కాపలా కాస్తున్నారు. ఈసమాధిని దర్శించడానికి నియమితమైన వేళలకు ముందేవచ్చి, వేల కొలదిజనం ఆమంచులో తడుస్తూ అల్లాగే నిలవబడియుంటారు. ద్వారాలు తెరువగానే తమముక్తిదాత సామ్యవాదసిద్ధాంతప్రవక్త యైన 'లెనిన్' మృతకళేబరాన్ని చూడడానికి ఉరకలు వేస్తూ ముందుకువస్తారు. చేతిసంచులు, చేతిబెత్తాలు, గొడుగులు, అన్నీ బయటఉంచివేయాలి. కట్టబట్టలుతప్ప లోనికి ఏమీ పట్టుకొనిపోకూడదు.

నేనుకూడా ఈజనంలో కలిసి లోపలికి మారేను. గుమ్మందాటి కుడివైపునకుతిరిగి మెట్లుదిగేము. అక్కడ కొంచెం చీకటిగా వుంది. ఇంకో రెండు మలుపులుతిరిగి మేము క్రింది అంతస్తులోకి వెళ్లేము. అక్కడనే అద్దాలపెట్టెలో సురక్షితంచేయబడిన 'లెనిన్'శవం ఉంచబడి యుంది. పెట్టెకు దగ్గరలోయున్న ఒకసైనికుడు ప్రజలెవ్వరూ పెట్టె మీదకి తోసుకురాకుండా కాపలా కాస్తున్నాడు. మేము ఈమహాప్రతిభా వంతుని శవాన్ని చాలఆదుర్దాతో పరిశీలిస్తూపెట్టెకు మూడువైపుల తిరిగేము. తరువాత జనం ఒత్తిడి ఎక్కువ అవడంవలన విధిలేక రెండవగుమ్మాన బయటకు వెళ్లేము. ఇంత జనం వచ్చినా, ఎక్కడా అల్లరి, గోల, గుసగుసలు, ఏమీ లేవు. ప్రతివాడు సమాధిస్థలములోని గంభీరతని అను రించేడు. నేను లెనిన్ యొక్క ప్రతిబింబాలు చూసేను. కాని, ఎన్నడూ ఆయన శరీరాన్ని—అస్థిమాంసపూరితమైన శరీరాన్ని—చూడగలుగుతానని అనుకోలేదు. కాని, 'లెనిన్' చనిపోయిన ఇన్నిసంవత్సరాలకి ఆయన శరీరాన్ని ఏలాఉన్నదానినాలాగే చూసేను. వైజ్ఞానికశాస్త్రాలు అసంభవా

లను సంభవం చేసివేశాయి. ఫ్రెంచిదేశీయులవలె కత్తిరింపించుకున్న గడ్డం నేడుకూడా ఆయనముఖాన శోభిస్తూంది. బట్టతల, విశాలమైన నుదురు. బహుశా చాలా ఎక్కువగా ఆలోచించడంచేతకాబోలు నుదురున ముడుతలు ఏర్పడియున్నాయి. కళ్లుమూసుకొని ఉన్నాయి. లెనిన్‌యొక్క ఈమృతశరీరాన్ని చూసే జార్జి బెర్నార్డుషా యొక్క స్నేహితుడొకడు "చూడండి. మహారాజుల చేతుల్లాఉన్నాయి." అన్నాడుట. దానికి బెర్నార్డుషా "ఆయన ఆఖ్టేరోజులు పని చేసినదేదీ?'' అన్నాడట. ఏదో గొప్ప సింహం నిద్రిస్తూన్నట్లు, త్వరలోనేలేచి, రెడ్‌స్క్వేర్‌లోని సమావేశంలో పంట్లంజేబులలో చేతులుపెట్టుకొని, గంభీరస్వరంతో, నిప్పులు కక్కుతాడనిపిస్తూంటుంది. కాని, కేవలం నిర్జీవశరీరమే అక్కడుంది. ఎక్కడికి పోయినాయోగాని ప్రాణాలు ఎగిరిపోయినాయి. ఆప్రాణాలెక్కడున్నాయో తెలిసినా, అవిదొరికినా, సమస్తరష్యాదేశము దేశసంపదగా ఎంచి జాగ్రత్త పెట్టిన ఆఅస్థి- మాంససహితమైన పంజరమున వానిని పునఃప్రతిష్ఠచేయడంలో ప్రయత్నలోపం ఏమీచేయదు.

నా మార్గదర్శిక ద్వారం వద్దకువచ్చి తనచేతిసంచి ప్రహరీనుంచి తీసుకుంది. తర్వాత మేమిద్దరము కొన్ని వ్యాజ్యాలసంగతి చూడడానికి కోర్టుకేసి బయలుదేరేము. సమయం చాలా తక్కువగా ఉండడంచేత మేము వేగంగా నడవసాగేము. కాని ఇందువలన మరీ ఆలస్యం అయింది. నేలమీద గడ్డకట్టిన గట్టి, జారుడు, మంచుమీద నడవడం నాకుఅలవాటులేదు. అందుచేత వేగంగా నడవడంలో కాలుజారి తల్లక్రిందులుగా మంచుమీద బోరగిలపడ్డాను. నేను లేవడానికి ప్రయత్నం చేసినకొద్దీ జారి నేలకంటుకుపోతున్నాను. దారిపోయే. వాళ్ళంతా నవ్వుతూన్నారు. అప్పుడు నామార్గదర్శికవచ్చి చేయిపుచ్చుకు లేవదీసి, దారిపోయేవాళ్ళ వినోదానికి భంగం కలిగించింది.

## ౮

మేము తిన్నగా కోర్టుదగ్గరకు వచ్చేము. న్యాయాలయభవనం ఏమంత పెద్దదికాదు. మంచి యూనిఫారాలు ధరించిన బంట్రోతులు ఎక్కడా కనపడలేదు. పెద్దపెద్దజేబులున్న గౌనులువేసుకున్న వకీళ్లుగాని ఎట్టార్నీలు గాని కనపడలేదు. ఆకోర్టుచూస్తే ఏదోపాఠశాలయో, సభాభవనమో, అనుకుంటాము. ప్రధానజడ్జి—అతని సహకారులిద్దరు—వారిలో ఒకస్త్రీకూడా వుంది— ఎత్తైనప్రదేశంలో కూర్చుండియున్నారు. వారికెదురుగా గుడ్డపరవని వట్టిమేజా ఒకటివుంది. ఫిర్యాదీలు, ముద్దాయీలు, చూడడానికి వచ్చినవారు, సాక్షులు, అంతా అక్కడపడియున్న బెంచీలమీద కూర్చుండియున్నారు. వారికీ వీరికీ మధ్య కర్రలకటకటాలు అడ్డుగావున్నాయి. జడ్జీలు సాధారణవేషాలలోనే ఉన్నారు. వారు కట్టుకున్న సాధారణవస్త్రాలు, చిన్నచిన్న జుట్లు, ఎండలో కమిలినముఖాలు, దృఢములైన చేతులుచూస్తే వారికీ సామాన్యపు కూలీలకి తేడా కనిపెట్టలేము. ఆడుజడ్జి నెత్తికి రుమాలుచుట్టుకొన్నట్లు జ్ఞాపకం.

ఒక ఆడుది కటకటాలమీద వంగి ఏదో ఉద్రేకంతో చెప్పుతూంది. ఒకమాటు చేతులు అటూ ఇటూ తిప్పుతూంది. ఒక్కొక్కప్పుడు కన్నీరు కారుస్తూంది. కొంతసేపయినతరువాత వెక్కివెక్కి ఏడవడం ఆరం

భించింది.

"అసలు సంగతేమి"టని నామార్గదర్శికను ప్రశ్నించేను. ఆవిడ కొంచెంసేపు వింది.

"ఈవిడ కుమారుని పోషణకోసం మ గ ని మీ ద దావాచేసింది. బహుశా తండ్రి ఆపిల్లడు తనకు పుట్టలేదంటున్నాడేమో."

నాకు ఉత్సాహం కలిగించే వ్యాజ్యం మాత్రం అవును. ఈమాదిరి వ్యవహారాలు బోల్షివిక్ ప్రభుత్వంయొక్క నూతనసిద్ధాంతాలకి పరిణామాలు. వైవాహికవిధిని ఒక్కమాటుగా ఎత్తేసి స్త్రీపురుషులకు గార్హస్థ్యజీవన సంబంధమైన స్వాతంత్ర్యం సంపూర్ణంగా ఇచ్చినందుకు ఫలితంగా ఈలాగంటి చిత్రమైన క్లిష్టవ్యవహారాలు ఉత్పన్నమైనాయి.* పిల్లవాని పోషణకి ఏల అంగీకరించడం లేదని భర్తని ప్రశ్నించేరు. ఈమెకు మరొక యువకునితో సంబంధం వుందనీ, ఆపిల్లవాడు తనకు పుట్టలేదనీ, ఆతడు చెప్పేడు. సాక్ష్యం తీసుకున్నారు. ఆమెతో సంబంధం కలిగియున్నాడన్న యువకుని వాఙ్మూలం తీసుకోబడింది. తర్వాత రెండవ కేసు పిలిచేరు. తీర్పు ఆఖరున చెప్పుతారని నాకుచెప్పేరు.

రెండవకేసులో కూడా ఫిర్యాది స్త్రీయే. తనపతితో విడాకులు తీసుకున్నప్పుడు ఆతని ఆదాయంలో మూడవవంతు ఆమెకీయవలెనని డిక్రీ ఇచ్చేరు. ఇప్పుడు ఆతని జీతం చాలా ఎక్కువయింది. కాని, ఆతడు డిక్రీనాటికి వస్తూండే జీతంలో మూడవభాగమే ఆమెకుఇస్తున్నాడు. ఆతని ప్రస్తుతసంపాదనలో మూడవపాలు ఇప్పించమని ఆమెవాదన. ఈకేసువిచారించడానికి మొత్తం పదిహేనునిముషాలు పట్టింది. ఈకేసు

*ఈబాధలు ఎక్కడా తప్పవు. వివాహవిషయంలో కట్టుబాట్లు బాగా వున్న మనదేశంలోనే ఈలాగంటివి తప్పడం లేదు. Mrs. గంగూలీ-కేసు జ్ఞాపకం చేసుకుంటే ఈవిషయం తెలుస్తుంది.

వినినతర్వాత న్యాయాధిపతులు ఆలోచించుకొనడానికి లేచేరు.

ఒకజడ్జీ నామార్గదర్శికను పిలిచి కోర్టుహాలుకి ప్రక్కనున్న ఆలోచనామందిరంలోనికి నన్ను తీసుకురమ్మని చెప్పేడు. నేను వెళ్లేను. ఈగది చిన్నదిగా వుంది. అందులోనున్న మేజాపై పుస్తకాలు, రికార్డులు ఉంచబడి యున్నాయి. ఒకస్త్రీ అక్కడ కార్యదర్శిపని చేస్తూంది. "కోర్టు విషయంలో నా అభిప్రాయాలేమిటో ఏవయినా ప్రశ్నలడిగేవి ఉన్నాయో;" అని జడ్జీ మార్గదర్శికచేత అడిగించేడు.

"మీరు కోర్టుఫీజు ఏలెక్కని తీసుకుంటారు?"

"మాదేశంలో కోర్టుఫీజు తీసుకోరు. న్యాయవిచారణకోసం ఈకోర్టును ప్రభుత్వం నిర్వహిస్తూంది. బీదలలోబీదకూడా ఈకోర్టులో న్యాయాన్ని పొందడమాయూహ. అలాగంటప్పుడు కోర్టుఫీజు అంటూ పెట్టి, బీదవారిని కోర్టుకిదూరం చేస్తామా?" ఈమాట విశ్వాసజనకముగాను ఉచితంగాను, తోచింది.

"క్రిమినలు కేసులకి వేరే కోర్టువుందా?"

"లేదు. అన్నింటికీ ఒకటేకోర్టు."

"మీరిచ్చిన తీర్పులమీద ప్రజలు అప్పీలు చేసుకుందుకు వీలుందా?"

"ఆ. వారు పైకోర్టుకు పోవచ్చు?"

"మీన్యాయవిధానాన్ని గూర్చి కొంచెం చెప్పుతారా?"

నామార్గదర్శిక కొంతసేపటిదాకా జడ్జీలతో మాటలాడింది.

"అన్నిటికంటే క్రిందికోర్టు ప్రజలకోర్టు. (People's court.) దానికి అన్ని అధికారాలు ఉన్నాయి. కాని, అవి పరిమితాలు. ఈకోర్టుల లోని తీర్పులమీద ప్రాంతీయన్యాయస్థానాలలో అప్పీలు చేసుకోవచ్చును. ప్రాంతీయన్యాయస్థానాలకి అప్పీళ్లు వినడమేకాకుండా, ఈక్రిందికోర్టులని తనిఖీచేయడం కూడా పనిలోనిదే. ప్రజాన్యాయస్థానాలు వీరివద్దకి తీర్పు

కోసం పంపిన క్లిష్టములైన కేసుల్ని ఈకోర్టు సాధారణసమావేశంలో విచారించుతారు."

ఇది చాలా ఆశ్చర్యకరమైన విషయం.

"పూర్వపుకేసుల ఫైల్సు ఏమీ మీవద్ద ఉండవు? ప్రజాన్యాయస్థానాలు పేచీవ్యవహారాలు ఇక్కడి కెందుకు పంపిస్తారు?"

"లేవు. ఫైల్సు ఉండాలని నియమంలేదు. అవి జడ్జీల సహజాలోచనకి అభ్యంతరం కలుగచేస్తాయని ఆపద్ధతి తీసివేశాము."

"సరే, ఇంక ముందు విషయం చెప్పండి."

"ప్రాంతీయన్యాయస్థానాలపైన ఆర్. ఎస్. ఎఫ్. ఎస్. ఆర్ (రషియన్ సోషలిస్టు ఫెడరేటెడ్ సోవియట్ రిపబ్లిక్.) యొక్క—రష్యాలోనున్న ఏడు ప్రజాతంత్రసామ్యవాదప్రభుత్వాలలోను దేనియొక్క ఆధీనంలో ప్రాంతీయన్యాయస్థానా లున్నాయో ఆప్రభుత్వంయొక్క—ఉన్నతన్యాయస్థానం (సుప్రీం కోర్టు) ఉంటుంది."

"ఈదేశంలోని ప్రజాతంత్రప్రభుత్వాలన్నీ సర్వస్వతంత్రాలా?"

"ఆ. ఏడు ప్రజాతంత్రాలు న్యాయ, శాసన, సంబంధాలలో దేనికదే సంపూర్ణస్వాతంత్ర్యం అనుభవిస్తున్నాయి. కేవలం కొన్నివిషయాలలోమాత్రం, ఇవన్నీ కేంద్రశాసనాధికారంలో అంటే యూ. ఎస్. ఎస్. ఆర్. యొక్క సుప్రీంకోర్టులు, క్రిమినల్‌కోర్టులు, జి. పి. యూ. ల అధికారంలో ఉంటాయి."

"ఓ! జి. పి. యూ? ఎన్నోవిధాల తరుచుగా వింటూ వచ్చిన ఆ, భయంకరమైన జి. పి. యూ. (గూఢచారిదళం) యేనా?"

"జి. పి. యూ. భయంకరమైనదని మీకేలా తెలుసును?" అని ఆమె చిరునవ్వుతో ప్రశ్నించింది.

"భయంకరమైనదే. దానిని గురించి అనేకపుస్తకాలలో చదివేను.

మీరు అల్లాగ తలపరా?"

"నిజమే. కాని, ప్రభుత్వానికి విరుద్ధంగా ఉన్నవారి విషయంలోనే అవి భయంకరంగా ఉంటాయి. లేకుంటే లేదు."

"అయితే ఏదోఒక ఉపాయంచేత ప్రజాభిప్రాయాన్ని అణచి వేయడం నిజమేకదా?"

"అదేలాగ? మేము కేవలం సోషలిస్టుప్రభుత్వానికి విరుద్ధంగా కుట్రలు చేయడానికి అవకాశం ఇయ్యము. ఈయూనియనుకు బయట లోపల, కూడ ఈప్రొలిటేరియటుఅధికారాన్ని ధ్వంసం చేయాలని ప్రయత్నించేవారు ఉన్నారని మీరెరుగుదురా?"

"అయితే విప్లవకారుల్ని బాధించేడని జారుని నిందించడం ఎందుకు మరి? ఆజారుప్రభుత్వానికీ ఈసోవియటుప్రభుత్వానికీ తేడా ఏముంది? రెండుప్రభుత్వాలు ఆలోచనగలవారిని అణచి వేస్తూనే ఉన్నాయి. ఇంక మీరువ్యక్తిస్వాతంత్ర్యాన్నిగురించి చెప్పుకొనడం దేనికి?"

నా యీప్రశ్నలకి ఆమెచాలాఉద్రేకం పొందింది. ఆమె అందమయిన గులాబిరంగుబుగ్గలు ఎర్రబడ్డాయి. కళ్లు పెద్దవయి ప్రజ్వరిలించేయి.

"కాని, నేడు ప్రొలిటేరియటుకు తనఅభిప్రాయం చెప్పుకొనడానికి అవకాశంవుంది. ప్రొలిటేరియటుకు శత్రువులైన బూర్జువాల గొంతుకలు అదమబడియున్నాయి. దాంట్లో నష్టం ఏమీలేదు. ఈధనికులు చెప్పవలసినవన్నీ ఇదివరకే చెప్పేరు. ఇంక వాళ్లు నోరుమూసుకోవలసిందే."

"బహుశా మనము జడ్జీల అమూల్యసమయాన్ని పాడుచేస్తున్నామేమో. రండి. ముందుమనపని పూర్తిచేసుకుందాం. అయితే ప్రజాతంత్ర

ప్రభుత్వాలయొక్క, యూనియన్ యొక్క సివిలు—మిలిటరీ—కోర్టులకి పనేమిటి?''

''ప్రజాతంత్రప్రభుత్వాల సుప్రీంకోర్టులకి మూడుపనులున్నాయి. (1) అప్పీళ్ళు వినడం. (2) కొన్ని ముఖ్యమైన కొత్తకేసులు వినడం. (3) న్యాయచట్టాలకి అర్థాలు వివరించడం. ప్రాంతీయన్యాయస్థానాల తీర్పులమీద సుప్రీంకోర్టు పునర్విచారణచేసి తీర్పులిస్తుంది. ఈసుప్రీం కోర్టుయొక్క తీర్పుకి అప్పీలు లేదు. సుప్రీంకోర్టులోని సభాపతులలో కొందరు వ్యతిరేకాభిప్రాయం కలిగిఉన్నప్పుడు మాత్రంపునర్విచారణ జరిగిస్తారు. అల్లాంటప్పుడు కోర్టుయొక్క సాధారణ సమావేశంలో (Plenum) దీనిని విచారణకి తెచ్చి తీర్పులిస్తారు. ప్రతివాడు ఎప్పుడూ ఈకోర్టుకి అప్పీలు చేయలేడు. సుప్రీంకోర్టు స్వయంగా కావాలనుకున్నప్పుడు, ప్రజాతంత్రాధ్యక్షుడు ఏవయినా ప్రత్యేకవ్యాజ్యాలను పంపించినప్పుడు, మాత్రమే ఈకోర్టు సమావేశమై ప్రాంతీయన్యాయస్థానాల తీర్పుల్ని పునర్విమర్శన చేస్తుంది. ప్రజాతంత్రప్రధానులకి, సుప్రీంకోర్టు జడ్జీలు మొదలయినవారికి విరుద్ధంగా తేబడే కేసుల్ని మాత్రమే ఈకోర్టు ప్రాథమికవిచారణకి తీసుకుంటుంది. ఇంక దీని మూడవపని శాసనాల విషయంలోను చట్టాలవిషయంలోను పేచీలు వచ్చినపుడు వానిఅర్థాల్ని వివరించడం. ఇవి ప్రజాతంత్రప్రభుత్వాల సుప్రీంకోర్టులపని. యూ. ఎస్. ఎస్. ఆర్ యొక్క సుప్రీంకోర్టుకి కూడా, ఇవేఅధికారాలు. ఇది * ఏడు ప్రజాతంత్రాల సుప్రీంకోర్టుల తీర్పుల్ని కూడా మార్చగలదు. ఏవయినా రెండుప్రజాతంత్రాలకి ఏవిషయంలోనయినా పేచీలువస్తే వానిని ఈకోర్టు విచారిస్తుంది. చాలా పెద్దఉద్యోగులపై వచ్చే కేసుల్ని ఇది విచారిస్తుంది. ప్రజాతంత్రాల కేంద్రకార్యనిర్వాహకసభల (Central Executive

* నేడు పదకొండు. (అనువాదకుడు)

Committees) ఆజ్ఞల్ని నిర్ణయాలను కూడా మార్చడానికి ఈకోర్టు యొక్క సామాన్యసమావేశానికి అధికారం వుంది. మిలిటరీకోర్టులలో రక్తకవచదళాలను సంబంధించిన కేసులు విచారించబడుతాయి."

ఈదీర్ఘోపన్యాసానంతరం ఆమె కాస్తసేపు ఊరుకుంది. ఆమె ఆయాసం తీర్చుకుందుకు కొద్దికాలం ఊరుకొని మరల ప్రశ్నించేను.

"కేంద్రకార్యనిర్వాహకసభలంటే?"

"ఓ. ప్రభుత్వముయొక్క నియమాలను, శాసనాలను చేయడానికి చట్టాలు నిర్మించడానికి పూర్ణాధికారం వీటికే ఉంది."

"జడ్జీలకి జీతాలు ఏలాగ ఉంటాయి. మామూలు కూలీకంటె ఆయనకు జీతం ఎక్కువ ఇస్తారా?"

ఆమె ప్రధానన్యాయాధిపతిని చూపిస్తూ "ఆయన స్వయంగా ప్రొలిటేరియటే. ఒక కార్ఖానాలో పనిచేస్తూ ఉండేవాడు. అక్కడ ఉండగా స్వతంత్రాలోచన వ్యక్తంచేసిన కారణంచేత న్యాయశాస్త్రం చెప్పించేరు. వీరిద్దరూ (సహాయన్యాయాధిపతుల్ని చూపిస్తూ) ఇప్పటివరకూ ఒక పట్టు యంత్రాలయంలో పనిచేశారు. ఆరురోజులకోసం మాత్రమే వీరిని జడ్జీలుగా ఎన్నుకున్నారు. ఆ ఆరురోజులు అయిపోయినాక వీరుతిరిగి మిల్లులోకి వెళ్లిపోతారు. వీరు తీర్పులలో స్వతంత్రాలోచనను ప్రకటించినట్లయితే వీరికి జడ్జీలకు కావలసిన చదువుచెప్పిస్తారు. కార్ఖానాలలో పనివానితనంగల కూలీలకు (Skilled Labourers) ఇచ్చే వేతనాన్నే ఇస్తారు. జడ్జీలయినంతమాత్రంచేత కోర్టుకి వెలుపల కూలీలకంటె ప్రత్యేకత ఏమీ చూపబడదు. వీరు ఎల్లప్పుడూ కూలీవర్గంతో కలిసిమెలసి ఉండవలసినదే. ఎవ్వడయినా ఆలాగ కలవక బూర్జువాడునన్తత్వం ప్రదర్శించేడంటే, పని పీకేసి మళ్లీ మిల్లులలోకో పొలాలమీదికో పంపేస్తారు."

"మీకేమయినా న్యాయశాస్త్రగ్రంథాలున్నాయా? లేక వీరి బుద్ధికి

తోచినట్లు ఇచ్ఛారాజ్యమేనా?''

మార్గదర్శిక కొంచెంసేపు జడ్జీతో మాటలాడింది.

''కాదు. వీరివద్ద శాసనగ్రంథాలున్నాయి.''

మేజామీద నున్న పుస్తకాలు చూపించింది.

"కాని, ప్రతివిషయాన్నీ స్వతంత్రబుద్ధితో ఆలోచించి తేల్చుకుంటారు. శిక్షమాత్రం చట్టాన్ని అనుసరించి విధిస్తారు.''

''మగవాండ్రవలె అంత సమర్థతతోటీ ఆస్త్రీన్యాయాధిపతి వ్యవహారనిర్వహణం చేయగలుగుతూ వున్నదా?''

మార్గదర్శిక ఈవిషయంలో జడ్జీలతో సంప్రదించకుండానే చటుక్కున సమాధానం ఇచ్చింది.

''ఎందుకు చేయలేదు? ఆమెకు బుర్ర లేదా? బుద్ధిలేదా? స్వతంత్రంగా ఆలోచించగల శక్తి లేదా?''

ఈమాటల నామె నవ్వుతూనే చెప్పింది. కాని, ఆనవ్వువెనక ఆత్మాభిమానం స్పష్టంగా కనిపించింది. నేను మాట మార్చేను.

"స్థాయిజడ్జీలను ఎంతకాలానికొకమారు ఎన్నుకుంటారు?"

"ప్రాంతీయకార్యనిర్వాహకసమితి వారిని ఏడాదికొకమారు నియమిస్తూంటుంది. కాని, వెనుకటివారే మరలమరల తరుచుగా నియమించబడుతూంటారు."

"వీరేదయినా ప్రత్యేకంగా చదువవలసి యుంటుందా?"

"ఆ. ఇక్కడ "సోవియటున్యాయపాఠశాల" ఒకటుంది. అక్కడ చట్టములేకాక, అర్థశాస్త్రం, మనస్తత్వశాస్త్రం, సమాజశాస్త్రం మొదలయినవికూడా చెప్పబడతాయి.''

"కార్ఖానాలలోనూ, అక్కడా, పనిచేయవలసియుండడంచేత సహాయన్యాయాధిపతులు చట్టము చదవనక్కర లేదనుకుంటా.''

"అక్కర్లేదు. వారివి చదవ నక్కరలేదు. స్థాయిజడ్జీయే వారికి చట్టాల్నిగూర్చి, శిక్షాక్రమాన్నిగూర్చి, బోధించాలి. ఇంతేకాకుండా తరుచుగా చట్టవిషయమై ఉపన్యాసాలు ఇప్పించడానికి ఏర్పాట్లుంటాయి.''

''ఆపరిస్థితులలో సహాయన్యాయాధిపతులకు తీర్పులు విషయంలో స్వాతంత్ర్యం ఏమీ ఉండదనుకుంటాను."

''ఎందుకుండదు? సహాయన్యాయాధిపతులమాట స్థాయీన్యాయాధిపతిఆలోచనతో సరిపడకపోతే వారిదే పైచేయి. వారి తీర్పేఆఖరుది. కారణం అధికసంఖ్యాకుల అభిప్రాయం అది గనకనే."

"కాని, వారు సాధారణవ్యక్తులు మాత్రమే కాదు?"

''అయితేనేం? వారికీ స్వతంత్రాలోచన వుంది. స్వతంత్రాలోచన శాసనంలోని శబ్దజాలంకంటె ఉత్తమం.''

''కోర్టులో ఎక్కడా వకీలుకాని, అడ్వొకేటుకాని, కనపడినట్లు తోచదు. ఇక్కడ వకీళ్ళు లేరా?''

ఆమె జడ్జీతో సంప్రదించింది.

''ఇక్కడ అడ్వొకేట్లు ఉన్నారు. కాని, సాధారణంగా ప్రతికేసుకి వారిని పిలవరు. వకీలుండితీరాలనే నియమం లేదు మాచట్టాలలో. మాయంతట మేము వాదించుకోవచ్చును. పూర్వపురికార్డులను చూసుకోవచ్చును. వానికి నకళ్ళు తీసుకోవచ్చును. వ్యాజ్యం విషయంలో తోచినప్పుడెల్ల జ్ఞాపకం వచ్చినవెల్ల చెప్పుకోవచ్చును. ఆలాగంటప్పుడు వకీళ్ళని పిలచి డబ్బు ఎందుకు పాడుచేసుకోవాలి?''

"ఏమిటి? డబ్బు పాడుచేసుకొనడమా?—ఇక్కడి వకీళ్ళకి ఫీజు ముట్టుతుందా?"

''ఎవరి తరఫానుపట్టి వారి ఫీజు ముట్టుతుంది.''

నేను చిరునవ్వు నవ్వేను. మార్గదర్శిక చాలాతెలివైనది. నానవ్వులో అర్థం కనిపెట్టివేసింది.

"ఈవకీళ్ళ ఫీజులలో చాలాతేడా ఉంటుందనుకొనకండి. ఫలానా వకీలు కింత ఫీజని నిర్ణయం చేసు. వ్యాజ్యాలలో నున్నవారు తమఆదాయాన్నిపట్టి ఫీజునిస్తారు. ఈఫీజునంతనూ వకీళ్ళసమితి (Collegium) తీసుకుని, ప్రతివకీలుకి ఆటని అర్హతలనుపట్టి మాసవేతనం ఇస్తుంది."

"అయితే బీదవారి పరీళ్ళ సహాయాన్ని పొందలేదన్నమాట."

"ఎందుచేత?"—

"ఒకడు తనసంపాదనతో కడుపు నింపుకొనడమే కష్టంగా వుందనుకోనండి. ఆతడు వకీలుకీయడానికి డబ్బు ఎక్కడ తెస్తాడు?"

"ఆతడు 'కన్సల్టేషన్‌బ్యూరోకి' ఒకఅర్జీ పెట్టుకుంటేచాలు. ఆతడు ఫీజునీయలేడని వారుతెలుసుకుంటే ఉచితంగానే చట్టసంబంధమైన సలహాలు ఇస్తారు."

"అయితే మీదేశంలో న్యాయశాఖ, శాసనశాఖ, ఒకదానితో ఒకటి కలిసి ఉన్నాయన్నమాట."

"ఔను. అందులో బాధ ఏముంది?"

"ఈపద్ధతిలో చిక్కులేవయినా ఉన్నాయేమో జడ్జీని కాస్త అడగండి."

ఆమె ప్రశ్నించింది. జడ్జీలు నవ్వసాగేరు. తలతిప్పుతూ వారు చెప్పుతూంటే మార్గదర్శిక వాటిని అనువదించి నాకు చెప్పింది.

"న్యాయశాఖని—శాసనశాఖని వేరువేరుగా ఉంచేమని చెప్పేదేశాలు కూడా క్రియవచ్చేటప్పటికి బోల్తాకొట్టుతూన్నాయి. సిద్ధాంతం బోధించేటప్పుడు ఈరెండూ వేరు వేరుగా ఉండడం బాగానేతోస్తుంది. కాని కార్యరూపంలో అది సాధ్యం కావడంలేదు. ఇతరదేశీయులు దొంగలు.

అందుచేత తమపరాజయాన్ని అంగీకరించరు. మీరు ఏదేశంలోనైనాసరే రాజకీయవ్యాజ్యాలను పరిశీలించండి. ఈవిషయం మీకే అర్థం అవుతుంది. మేము మోసగాండ్రము కాదు."

న్యాయాధిపతుల అమూల్యసమయాన్ని నేను చాలవరకు ఉపయోగించుకున్నాను. ఆలోచనామందిరానికి వెలుపల పాపం ప్రజలు తీర్పుల కోసం ఎదురుచూస్తూ కూర్చుండియున్నారు. కేవలం నా ఉత్సాహంకోసం వారిసమయం పాడుచేయడం ఉచితంగా తోచలేదు. నేను వారికి హృదయపూర్వకంగా ధన్యవాదాలర్పించి చేతులుకలిపి కోర్టువెలుపలకు వచ్చేను.

కొద్దినిముషాలకి జడ్జీలు గదిలోనుంచివచ్చేరు. స్థాయీన్యాయాధిపతి తీర్పు వినిపించేడు. మొదటికేసులో పిల్లవానితండ్రిఎవ్వరో తెలుసుకొనగలగడం సాధ్యమైన విషయం కాదుకనక, ఆస్త్రీతో సంబంధం కలిగియున్న ఇరువురు పురుషులు బిడ్డని పోషణభారం వహించవలసినదిగా తీర్పుచెప్పేరు. రెండవదానిలో ఆస్త్రీకి భర్తయొక్క ప్రస్తుతాదాయంలో మూడవభాగం ఇయ్యవలెనని తీర్పుచెప్పేరు.

రష్యనుకోర్టుల నిరాడంబరతకి నాకు చాలా ఆశ్చర్యం కలిగించి. దోషులుకూడ ఎంత స్వంతత్రం అనుభవిస్తున్నారు? జామీనులు చాలసులకనగా లభిస్తాయి. అప్పీలుకు ఖర్చేమీ ఉండదుకనక ప్రతితీర్పు న్యాయోచితంగానే ఉంటుంది. అదీగాక జడ్జీలు సాధారణప్రజలనుంచి ఎన్నుకోబడినవారేనాయె. అందుచేత వారికి ముద్దాయిల స్థితిగతులు, మానసిక ప్రవృత్తులు, ఆచారవ్యవహారాలు, ఆలోచనలు, కష్టసుఖాలు, అన్నీతెలిసే ఉంటాయి. అందుచేత ఇతరములైన పెట్టుబడిదారీదేశాలలోవలెగాక రష్యాలో ముద్దాయిలకు సానుభూతితోకూడిన న్యాయము లభిస్తుంది. పెట్టుబడిదారీదేశాలలోని జడ్జీలు, న్యాయాధికారులు, సమాజంలోని ప్రత్యేక

సౌకర్యాలుగల కక్షకు (Privileged class) చెందిన వారై యుంటారు. వారికి జనసామాన్యముయొక్క భావలతోటి జీవితంతోటి సంబంధం ఏమాత్రం వుండదు. అందుచేత తరుచుగా గ్రుడ్డిగా వారిజీవితంమీద సంపద మీద దాడిసలుపుతూంటారు. అదీగాక ఇతరదేశాల న్యాయాధీశులు ప్రజాసామాన్యంతో కలియనే కలియరు. వాళ్ల ఆడంబరం, గాంభీర్యం, చూడగానే ముద్దాయీలు స్తంభించిపోయి, అసలువిషయాలు చెప్పనేరేరు. రష్యనుకోర్టులలోగల నిరాడంబరత్వము ప్రజలకు చాలా సౌకర్యాన్ని కలిగిస్తూంది.

టీకి వేళకావడంచేత హోటలుకు బయలుదేరేము. మూడు ఝాములవేళ చలి ఎక్కువై పోయింది. నాలుగుమూలలా ఎడతెగకుండా మంచుకురుస్తూంది. మేము మంచుమీదనే పోతున్నాము. మమ్మల్ని పైనుంచి, క్రిందనుంచి, ఈప్రక్కనుంచి, ఆప్రక్కనుంచి మంచు ఆక్రమిస్తూంది. బూట్లు, మేజాల లోపలికంటా చలి ప్రవేశిస్తూంది. చలిగాలి శ్వాసద్వారా లోనప్రవేశించి బుద్ధిని కొయ్యబారచేస్తూన్నట్లు ఉంది. ఇక్కడపుట్టి ఇక్కడనే పెరిగినా ఈవిషయంలో రష్యనులు మనకంటె బలమైనవారని నేను తలపను. వారు ధరించే మైనపు గుడ్డకోట్లు వారిచ్చట నిలవబడడానికి ఆధారం. 'లెనిన్‌గ్రాడ్' 'క్రెచీ' లో పిల్లల్ని ఎంతజాగ్రత్తగా దూదిమెత్తలలోను మైనపుగుడ్డలలోను చుట్ట పెట్టిఉంచేరో చూసేనుకాదు? వాళ్ళకి కప్పిన ఒక్కగుడ్డ మనదేశంలోని పిల్లలికికప్పితే ,ఉక్కిరిబిక్కిరి అయిపోతారు. వయస్సులోనున్నవాళ్లు ధరించినవి ఎంత మురికిగాను, అసహ్యంగాను ఉన్నా చలినిమాత్రం బాగా ఆపుతాయి. బీదలు గొఱ్ఱెచర్మాలతో కుట్టినవి తొడుగుతారు. ప్రస్తుతం కొన్ని సౌకర్యాలు పొందగలిగిన జాతిగా ఎన్నదగ్గ పనివాండ్రు మైనపుగుడ్డకోట్లు, ఉన్నిజాకెట్లు తొడుగుతున్నారు. రష్యనులు కట్టే

బట్టలు, టోపీలతోటి, ఏభారతీయుడైనాసరే అచ్చటిచలిని ఓర్వగలడని నానమ్మకం.

నామార్గదర్శిక సాయంకాలంవచ్చి రైతుభవనం చూపించుతానని చెప్పిపోయింది. ఇక్కడ రైతులకి "క్లబ్బులు" సంస్కారగృహాలు, ఉద్యానవనాలు, మొదలయిన వెన్నో ఉన్నాయనీ, వానిలోచేరి, రైతులు చదువుకుంటూనో, ఉపన్యాసాలువింటూనో, నాటకాలు ఆడుతూనో, సినీమాలు చూస్తూనో కాలం గడుపుతారని ఆమెయే చెప్పింది. ఇప్పుడు మంచుకురిసే రోజులవడంచేత ఉద్యానవనాలు మొదలయినవి మూయ బడినాయట. అందుచేత మేము రైతుభవనాన్నే చూడడానికి నిశ్చయించు కున్నాము.

ఇక్కడ టీ, భోజనము, కూడ 'లెనిన్‌గ్రాడ్' లో లాగే పాడుగా ఉన్నాయి. వస్తువుల ఖరీదులు విపరీతంగా ఉండడంచేత ఏవిదేశీయుడు భోజనంకాక పైగా ఏదయినా తీసుకొనడం సాధ్యంకాదు. ఒకరోజున ఒక్కసీమరేగుపండుకోసం పదిషిల్లింగులు యిచ్చినట్లు జ్ఞాపకం. ఇంకో మారు వేల్చిన కోడిమాంసం ఒక్కప్లేటుకి సంపూర్ణంగా పౌనుకిపౌను చెల్లించేను. అటుతరువాత ఈపాడుపొట్టకోసం ఇంత ఖరీదు ఇచ్చి సీమరేగు, కోడిమాంసం, కొవేబదులు ఉపవాసం ఉండడం మంచిదని ఊహించేను. ఒకమారు నామార్గదర్శికతో ఈవిషయాన్ని గూర్చి మాట్లాడేను.

"ప్రొలిటేరియటు కెవ్వనికీ మీదేశం రావడం చాలాకష్టం."

"మేము వారిని రమ్మనడం లేదుకా ! ఈనాడుమాకు పౌండ్లు— డాలర్ల అవసరం ఎక్కువగా ఉంది. అందుచేత సాధ్యమైనంతవరకు వానిని విదేశీయులదగ్గరనే వసూలు చేయాలి. విదేశయాత్రికులు బాగా డబ్బు యీయగలరనికూడా మేము ఎరుగుదుము."

ఈమాటలు పూర్తిగా నిజం. ఇవి నాకళ్లుతెరిచినాయి. రష్యాలోకి వచ్చినవాడెవడైనా తన దగ్గరనున్ననాణేలను రూబుల్సులోనికి మార్చుకుంటే, వాటిని ఖర్చుపెట్టుకోవలసిందే. కాని, తిరిగి ఆతనిదేశంలోని నాణాలు ఈయబడవని సోవియటు ప్రభుత్వం చేసిన శాసనం జ్ఞాపకం వచ్చింది. మార్గదర్శిక చెప్పిన మాటలవలన రష్యనులు ఈశాసనం ఎందుకుచేశారో అర్థం అయింది. తరువాత తరువాత విదేశీయులకోసం 'టార్గసిన్' అనే దుకాణం మాస్కోలో వుందనీ, అక్కడ ఏవస్తువు అయినా చవకగానే ఉంటుందనీ, తెలిసింది. దానిని గురించి తరువాత ముందుముందు వ్రాస్తాను.

సాయంకాలం మార్గదర్శిక వచ్చేటప్పటికి చీకటిపడిపోయింది. మేమిద్దరం వెంటనే బయలుదేరి, మాస్కావానదినిదాటి, 'క్రెమ్లిన్' యొక్క ప్రహరీగోడదగ్గర ట్రాంబండికోసం నిలవబడ్డాము. ఎంతకీ ట్రాము రాదు. మోటార్లు, బస్సులు, మరి, అద్దెబండ్లుగాని లేనేలేవు కదా ? ఈమధ్యనే భూగర్భంలో విద్యుచ్ఛకటాలు నడిపించేటందుకు ప్రయత్నాలు చేయబడుతున్నాయి. చలి చంపేస్తూంది. అందుచేత కాస్త అటూఇటూ తిరిగితే ఒళ్లు వేడెక్కుతుందని తలచి పచారుచేయసాగేము. ఆఖరికి ట్రాంవచ్చింది. మేము గంతేసి బండిలో దూరేము. గుంపులో కొంతవేడి చిక్కింది. కాని, మనుష్యుల చెమట, మురికిగుడ్డలు, ముక్కులు బద్దలయ్యేలా దుర్వాసన కలిగిస్తున్నాయి.

౬

నామార్గదర్శిక అదృష్టవశాత్తు కిటికీదగ్గరకు చేరినవాళ్ళని "ఎక్కడదాకా వచ్చేమ"ని మాటిమాటికీ అడిగి తెలుసుకుంటూ వచ్చింది. ట్రాం బండి కిటికీలకి లోపల వెలుపల కూడా మంచు పేరుకుని వుంది. జనం ఎక్కువగా ఉండడం వలన వెనుకనుంచి ఏమీ కనపడడం లేదు. రష్యన్ట్రాములలో జనం వెనకనుంచి ఎక్కుతారు. ముసలివాళ్ళు పిల్లల్ని ఎత్తుకున్న ఆడవాళ్ళు, మాత్రం డ్రైవరు పక్కనున్న దారిని లోనికి వస్తారు. సామాన్యంగా ఈద్వారం దిగడానికే ఉపయోగించబడుతుంది.

మేము 'రైతు—భవనం' దగ్గరదిగేము. ఇల్లు చాలా పెద్దది. మార్గదర్శికకు కూడా ఈఇంటితో పరిచయం లేనట్లు తోచింది. ఆమె ముందుగా నన్ను రైతుల భోజనశాలలోకి తీసుకువెళ్ళింది. అప్పుడే గ్రామాలనుంచి వచ్చిన రైతులు చాలామంది మూటలు—ముల్లెలతోటి కనిపించేరు. వారు మాకు సూపరింటెండెంటు ఆఫీసుకు దారి చూపించేరు. మేము ఆఫీసుగదిని వెతికి పట్టుకున్నాము.

సూపరింటెండెంటు ఒక వకీలు. ఆయనకి ఇంగ్లీషు రాదు. అందుచేత నామార్గదర్శికయ్యే దుబాసీపని నిర్వహించి వ్యవహారం సాగించింది.

"నేనేవయినా అడగవచ్చునేమో ఆయనను అడగండి." అని మార్గదర్శికను కోరేను.

"నిస్సందేహంగా అడగండి. కాని, త్వరగా తెమల్చండి. లేకుంటే మనం వెళ్ళేటప్పటికి పొద్దుపోతుంది. అబ్బ! ఏమి గుచ్చిగుచ్చి ప్రశ్నలు వేస్తారండీ."

"చూడండి. ఇంతస్వల్పకాలంలో రష్యా అంతా చూడడం ఏవిదేశీయుడికీ సాధ్యం కాదు. ఒకనెలదినాలయినా చాలవు. అందుచేత రష్యానుగురించి తెలుసుకోవాలంటే ఇంతే మార్గం. వేరువేరు శాఖల అధికారుల్ని, అడిగి విషయాలు తెలుసుకొనడం, సాధ్యమైనంతవరకు చూచి వాటి నిజానిజాలు పరీక్షించడం ఇంతే చేయవలసిన పని."

"సరే. అయితే కానీయండి."

"కోల్హోజేజ్"—"సోవ్హోజేజ్"—అన్నవానికి అర్థం ఏమిటి? కొన్ని విదేశీయగ్రంథాలలో రెండూ ఒకే అర్థంలో వాడేరు."

"రెండూ ఒకటికాదు. రైతులంతా కలిసి ఏర్పరచుకొన్న సమిష్టి కృషిక్షేత్రాల్ని "కోల్హోజేజ్" అంటారు. ప్రభుత్వం అధీనంలో వున్న పెద్దపెద్ద భూఖండాల్ని 'సోవ్హోజేజ్' అంటారు."

"ఈభూములు ఏలాగ నడిపించబడుతున్నాయి."

"కోల్హోజేజ్"లో వ్యవసాయదారులు తమభూముల్ని, పనిముట్లని, పరిశ్రమని ఏకంచేసి వ్యవసాయం చేస్తారు. పంటని అందరూ సమంగా పంచుకుంటారు. ఎక్కువ భూమి ఈయడంగాని, ఎక్కువపని చేయడంగాని, వాటాలలో ఎక్కువకి అవకాశం ఈయరు.

"ఈవిధంగా రైతులకి లాభాలు కిట్టుతే వారు ధనం పోగుచేసుకోవచ్చునా?"

"మీరు చాలా పెంకెవారే. ప్రతిమాట తిప్పితిప్పి అందులోకే

లాగుకొనివస్తారు.''

"ఈవిషయంలోనే మీదేశం ప్రపంచం అంతకీ విరుద్ధంగా ఉందని మీరే చెప్పుతున్నారు. కనకనే ఈవిషయాన్నిగురించి స్పష్టంగా తెలుసుకొనగోరుతున్నాను. మీరు వ్యాపింపచేస్తూన్న ఈసోషలిస్టుసిద్ధాంతాలను చూసే ప్రపంచం అంతా ఏకేసి చూస్తూంది. ధనవిభజన (Distribution) విషయమై మీరేయే పద్ధతులవలంబిస్తున్నారో మేము తెలుసుకోవాలని అనుకుంటున్నాము."

"అసలు ప్రారంభంలో రైతుల జీవితభృతికి సరిపడేటంత పంటను మాత్రం వదలి మిగిలిన దానినంతటినీ సోవియటుప్రభుత్వం తీసుకొనేది. అందుమీద రైతులంతా తిరగపడ్డారు. ఎందుచేతనంటే రైతుల వ్యయపరిమాణాన్ని నిర్ణయించడానికి నియోగించబడ్డ అధికారులు అంచనాలు తక్కువ వేసి లెక్కలు తయారుచేశారు. అందువలన రైతులు మాడి చావవలసిన పరిస్థితులు ఏర్పడ్డాయి. వెంటనే రైతులు తిరగపడ్డారు. ప్రభుత్వానికి పాఠం నేర్పడానికి సాధ్యమైనంత తక్కువ భూమిమాత్రమే దున్నేరు. తమవద్దనున్న దూడనీ—దుడికినీ చంపిపారేశారు. దేశం నాలుగుమూలలా వ్యాపించిన ఈరహస్యవిద్రోహంవలన పెద్దకాటకం ఏర్పడింది. 'లెనిన్' దీనిని ఆపుచేయడానికి 'నవీన ఆర్థిక నీతిని' (N. E. P.) ప్రారంభించేదు. కాని, పంచవర్షప్రణాళిక ప్రారంభం కాగానే ఈఆర్థికనీతి మార్చివేయబడింది. ఇప్పుడు చిన్నచిన్న వ్యవసాయదారులంతా విశాలమైన సమిష్టిక్షేత్రాలలో కలిసి పనిచేసేటట్లు చేయడానికి ప్రభుత్వం ప్రయత్నిస్తూంది. 'ట్రాక్టర్లు,' 'కంబైన్'లు, మంచి విత్తనాలు, మంచి ఎరువులు, వ్యవసాయదారులకు ఎరువిచ్చి ప్రభుత్వం వారికన్నివిధాలా సాయం చేస్తూంది."

"విడి—విడి—వ్యవసాయాన్ని ఎత్తించి చేయడానికి ప్రభుత్వం

ఏమే పద్ధతు లవలంబించింది?"

"చాలా చమత్కారమైన మనుష్యులే. మాప్రభుత్వములో తప్పులు వెతకడానికే ప్రయత్నిస్తున్నారు."

ఆసమయంలో ఆమె ముఖకళలు చూచి నేను పక్కున నవ్వేను.

"అబ్బే. నాప్రశ్నల్ని అలక్ష్యంలో తీసుకోవద్దు. నేను మంచి ఉద్దేశ్యంతోటే ప్రశ్నిస్తున్నాను."

"ఔను. నేనెరుగుదును. ప్రభుత్వం చిల్లరవ్యవసాయాల్ని తగ్గింపించడానికి దండననీతిగాని, అత్యాచారాలుగాని, అవలంబించడం లేదు. సమిష్టివ్యవసాయాలలోగల సౌకర్యాలను, పంట ఎక్కువను, బోధించి ప్రచారం చేస్తున్నారు. ఇప్పుడు సమిష్టికృషిక్షేత్రాల వైశాల్యం ఎక్కువ అవుతూవుంది."

"సమిష్టివ్యవసాయాలలో కలుగచేయబడుతూన్న సౌకర్యాలేమిటి?"

"ప్రభుత్వం ట్రాక్టర్లని, ఇతరవ్యవసాయయంత్రాల్ని, తక్కువ అద్దెకి ఈసమిష్టిక్షేత్రాలకి సప్లై చేస్తారు. మంచి విత్తనాలు ముందుగా ఈక్షేత్రాల కిచ్చినమీద మిగిలినవానినే యితరులకి ఇస్తారు. పట్టణాలలో మిల్లుకూలీలకి చేయబడుతూన్న సౌకర్యాలన్నీ—సమ్మిలితభోజనాలయాలు క్లబ్బులు, రేడియోలు, స్కూళ్లు, పుస్తకాలయాలు, స్నానాగారాలు, ఆసుపత్రులు—ఈసమిష్టికృషిక్షేత్రాలలో చేరిన రైతులకు కూడా చేయబడుతున్నాయి. ఇంతేకాదు. భిన్నశక్తులసమీకరణం వలన రైతులకు లాభాలు కూడా ఎక్కువగానే ఉంటాయి."

"కాని, విశాలమైన క్షేత్రాలుగల పెద్దపెద్దరైతులు ఈసమిష్టిక్షేత్రాలలో కలియడానికి అంగీకరించరు కదా? ఎమంటే దీనివలన వారికి కలిగే లాభం ఏమీ లేకపోవడం సరికదా, భూమిమీద స్వత్వం

కూడా కోల్పోవలసివస్తుంది. జమీందారులు కూలీయి కావలసివస్తుంది."

"ఓ, మీరు కులకుల్ని గురించి చెప్పుతూన్నారా? మేము వాళ్ళ నేమి లెక్కచేయము. వాళ్ళు బూర్జువాలు. వాళ్ళని నలిపి పారవేస్తాము."

కొంచెంసేపు ఆగి,

"మనకి ఆలస్యం అయిపోతూంది. భవనం మూసివేసేవేళ అవుతూంది. లేవండి." అంది మార్గదర్శిక.

మేమిద్దరం లేచి భవనంలోనున్న వస్తుప్రదర్శనశాలలోకి వచ్చేము. సమిష్టికృషి యొక్క గొప్పదనాన్ని, వేరువేరు పైరులువేయబడిన భూముల్ని, పైరులఒత్తుదనాన్ని చిత్రించిన పెద్దపెద్ద ఒట్టలు. గోడల్ని వ్రేలాడుతూన్నాయి. వైజ్ఞానికపద్ధతులమీద కట్టబడిన పాడలశాలలు, ఎరువుగోతులు, రైతులఇండ్లు, విత్తనాలు చెడిపోకుండా నిలువచేసే పద్ధతులు, ఇంకా ఇల్లాంటి అనేక వస్తువులయొక్క నమూనాలతో సావడి అంతా నిండివుంది. అద్దాల పెట్టెలలో రకరకాల ధాన్యాలు, తేయాకు, పత్తి, గోధుమలు, సన్ ఫ్లవర్, ఉర్లగడ్డలు, దోసకాయలు, ఇంకా అనేక రకాలపైరులు, కాయకూరలు, జాగ్రత్త పెట్టబడియున్నాయి. అక్కడ నున్న డిమాన్స్ట్రేటరు ఆదొమ్మలు, వస్తువుల, సహాయంతో సమిష్టి వ్యవసాయం ఏలావృద్ధి పొందుతూందో, ఏయేప్రాంతాల సీకృషి వ్యాపిస్తూందో, రైతులు కలలోకూడా కనివిని ఎరగని సౌకర్యాలు సమిష్టికృషి క్షేత్రాలలోని రైతులకి ఏలాగ కలగచేయబడుతున్నాయో, అన్నీ వివరంగా బోధిస్తున్నాడు.

అయిదుసంవత్సరాలలోపల భూస్వాముల నందర్నీ అంతరింపచేసి వేయాలనీ, నూటికి ఇరవైమందికి తక్కువకాకుండా సమిష్టికృషి క్షేత్రాలలోనికి ఆకర్షించాలనీ, ప్రథమపంచవర్షప్రణాళికలో ఏర్పాటు చేసుకున్నారు. 1930 లో నూటికి 22. 4 మంది, 1931 లో నూటికి

62. 2 మంది, 1932 లో నూటికి 62. 5 మంది సమిష్టిక్షేత్రాలలో కలిసేరు. 1933 లో నూటికి 20 వంతుల భూమిమాత్రమే చిల్లరవ్యవసాయదారుల చేతిలోవుండెట. కార్యక్రమం ప్రకారం 1933 లో 14 కోట్ల 10 లక్షల హెక్టార్లభూమి దున్ని పైరుచేయాలని నిశ్చయించియుండగా 1931 లోనే అంతపని చేయగలిగేరు.

తరువాత మేము భాగస్వంలోనున్న ఒకసావడిలోనికి వెళ్లేము. అచ్చట, వ్యవసాయపరికరాలు ఎన్నోరకాలు—ట్రాక్టర్లు, మరనాగళ్ళు, విత్తులు చల్లే యంత్రాలు, పెద్దపెద్ద కంబైనులు, (కోసి, నూర్చే, యంత్రాలు)—అన్నీ పోగుచేయబడి ఉన్నాయి. ప్రతిభాగము వివరంగా చూపించబడుతున్నాయి. గోడలమీద పంచవర్షప్రణాళికకు సంబంధించిన ఆదర్శాలు వ్రాయబడిన అట్టలు తగిలించియున్నాయి. ఏప్రదేశాలలో ట్రాక్టరుస్టేషన్లు ఎక్కువగా నున్నాయో ఆప్రాంతాలలో సమిష్టికృషి క్షేత్రాలు విరివియైనట్లు తోచింది. రష్యాఅంతా వ్యవసాయంలోకి తేవాలంటే పదిలక్షల ట్రాక్టర్లు అవసరమని ప్రభుత్వం అంచనావేసి స్టేలిన్ గ్రాడ్—ఖార్కోవ్ నగరాలలో యంత్రశాలయి స్థాపించింది. ఈరెండు చోట్లగల యంత్రశాలలూ సాలుకి లక్షట్రాక్టర్లని తయారు చేస్తాయట. 1932 లో 'చేలాబింస్కు' నగరంలో కూడా సాలుకి 50,000 ట్రాక్టర్లని తయారుచేయగల పెద్దకర్మాగారం కట్టబడింది. లెనిన్‌గ్రాడ్‌లోని 'ప్యుటిలోవ్' యంత్రశాలకూడా ఈపని తలపెట్టింది. త్వరలోనే ఇంకా చాలాచోట్ల కర్మాగారాలు కట్టబడుతున్నాయట.

ఈరైతు—భవనం చాలాపనిచేస్తూంది. ఇక్కడి ప్రదర్శనాలు, ట్రాక్టర్లు చేస్తూన్న పనుల వివరాలు, సమిష్టికృషిక్షేత్రాల క్రమాభివృద్ధి విదేశీయులకు రష్యావ్యవసాయం పారిశ్రామికస్వరూపాన్ని గ్రహిస్తూందని స్పష్టపరుస్తూంది. జీవితవ్యయప్రమాణాన్ని, భోజనపదార్థాలు దొరక్క

పోవడాన్ని. చూస్తే రష్యా ఎంత వ్యవసాయప్రధానమైన దేశమయినా అవసరమైనంత ధాన్యం ఉత్పత్తి కావడం లేదని తెలుస్తూంది. అక్కడి వారు ఖాద్యపదార్థాలు అంతకష్టంగా ఉండడానికి ఒకకారణంకూడా చెప్పేరు. వ్యవసాయానికి ఉపయోగించే యంత్రాల్ని కొనుక్కుందుకు ఇతరయూరపియన్ దేశాలకి ధాన్యమే అమ్ముకోవలసి వస్తూందిట. అందు చేతనే ప్రభుత్వం ప్రజలకి పూర్తి ఆహారాన్ని ఈయలేకుండా వుందిట.

## ౧౦

నేను రాత్రి తొమ్మిదిగంటలకి హోటలకి చేరుకున్నాను. రష్యాలో శీతాకాలపురాత్రి లందు తొమ్మిదిగంటలు కావడం చాలా ప్రొద్దుపోయి నట్లే. తిన్నగా భోజనశాలలోకి వెళ్లేను. ఆఆస్ట్రేలియను పెద్దమనిషి అక్కడ కూర్చుండి భోజనం చేస్తూన్నాడు. నేను వెళ్ళి ఆయనప్రక్కనే యున్న కుర్చీలో కూర్చున్నాను.

"మీస్నేహితులు ఏదయినా జబాబుగాని, రూపాయలుగాని, పంపించేరా?"

"లేదు. "లెనిన్‌గ్రాడ్‌లో" ఏమయినా సాయందొరకవచ్చునని ఆశిస్తున్నా. ఇక్కడనుంచి రేపు ప్రొద్దుటే వెళ్ళిపోతున్నా. అందుచేత అక్కడిదే చిరునామా ఇచ్చేను."

"అక్కడ ఎక్కడ ఆగుతారు? డబ్బులేనిదే హోటలువాళ్లు తిండి పెట్టరుకాదా?"

"ఆమార్గదర్శిక సహాయం కోరుతాను. ఆమె ఎడ్రసు నావద్దఉంది. చాలా మంచి మనిషి, ఆవిడ.

"ఔను. చాలా వేళాకోళం మనిషికూడా." అని, 'జైగ్'లో జరిగిన సంభాషణ, వేళాకోళానికి నన్ను పెళ్ళి చేసుకుంటాననడం అన్నీ

చెప్పేను.

ఈమాటలు చెప్పగానే ఆపెద్దమనిషి ఎగిరి గంతులేశాడు.

"ఏమిటి? ఇల్లా జరిగిందా? అయితే తిన్నగా ఆమె దగ్గరకే పోతా. ఆవిడ నన్ను పెళ్ళి చేసుకుంటుందేమో అడుగుతా."

ఆమాటలు వినేటప్పటి నాఆశ్చర్యానికి హద్దులేదు. ఎక్కువ కష్టాలవలన ఈయనకు పిచ్చిఎత్తలేదు కదా అనుకున్నాను. లేకుంటే నిరాశ ఈఇంజనీయరు బుద్ధిని హరించి వుంటుంది.

"అయితే మీకు పెళ్లి అయిందికాదూ?"

"ఇంక నాధర్మశాస్త్రాలన్నీ తుంగలో తొక్కండి. కడుపు నింపలేని ధర్మసాధన నాకవసరంలేదు. ఇన్నాళ్ళవరకు ధర్మాన్ని అంటిపెట్టుకొని ఉండడంవలన నాకు కలిగినలాభం ఏమిటి? నాకుటుంబానికీ, నాకూ తిండికూడా కరువై పోయింది. ఇప్పుడు ఆమె నన్ను పెళ్ళాడడానికి అంగీకరిస్తే ఎక్కడనో ఒకచోట నౌఖరీ దొరుకుతుంది. అప్పుడు నాజీతంలోనుంచి కొంత నాపెండ్లాం పిల్లలకి పంపించుకోవచ్చును. వాళ్ళ నెంతగా ప్రేమించేను."

ఆయనకళ్లు నీలాలు క్రమ్ముకున్నాయి. బలవంతంగా వస్తూన్న కన్నీటిని ఆచుకున్నాడు.

వడ్డించేవాడు నన్ను భోజనానికి టిక్కటు అడగడానికి వచ్చేడు. అప్పుడా ఆస్ట్రేలియను తన ఎదుటనున్న పళ్ళెమును చూపిస్తూ—

"ఈ పేల్చిన మాంసానికి బదులు కొంచెం రొట్టెనిస్తారా?" అని అడిగేడు.

"ఏమిటండీ?"

పేల్చిన మాంసానికి రొట్టెముక్క నడుగుతాడేమిటాయని అతడు విస్తుపోయేడు.

ఆస్ట్రేలియను నాకేసి తిరిగేడు.

"రేపటికి నాకు తిండికావాలి కదా? ఇప్పుడు, ఈ అవస్థలో, పేల్చిన మాంసం తినడం, నాతాహతుకి తగనిపని. ఇప్పుడు ఇది తిన్నానా రేపు ఉపవాసం చేయవలసిందే. అందుకే రేపటికోసమని రొట్టె అడుగుతున్నాను."

ఆకలి మనుష్యుని ఆత్మాభిమానాన్ని ఏవిధంగా చంపేస్తుందో ఇప్పుడు నాకు అర్థం అయింది.

వడ్డించేవాడు పేల్చిన మాంసం తీసుకుపోయి రెండేరెండు నల్ల రొట్టెలు ఇచ్చేడు. ఆయన ఆరొట్టెలు జాగ్రత్తగా కాగితంలో చుట్టపెట్టి జేబులో పెట్టుకున్నాడు.

ఆయన దురవస్థచూస్తే నాకు నోటికి రొట్టె వెళ్లిందికాదు. ఆకలితో ఉన్నవానిఎదట తిండి తినడం పాపమని తోచింది.

"నాకిది రుచించడంలేదు. మీకీ రొట్టెను ఇవ్వనా?"

"మీరొట్టె? వద్దు. పగలంతా తిరగడంచేత మీకు చాలా ఆకలి వేస్తూండి ఉంటుంది."

"అబ్బే! నాకంత ఆకలిగా లేదు. అదీగాక నాకీరొట్టెలు హితవుగా ఉండడం లేదు."

మారుమాటచెప్పకుండా నారొట్టె ఆయనచేతిలో పెట్టేశాను.

"నమస్కారం!"

ఆయన కంఠం గద్గదికం అయింది.

ఆరాత్రి ఒకకప్పు తేనీరు వినా మరేమీ తీసుకోనకపోయినా సంతోషం. సంతుష్టితోటి నాకడుపు నిండిపోయింది.

శ్రీ శేషు గ్రంథాలయము,
తెలప్రోలు.

# ౧౧

మరునాడు ప్రొద్దుటే భోజనశాలలో ఉండగా వచ్చింది మార్గదర్శిక. నగరంలోకి వెళ్ళడానికి మోటారు దొరుకుతుందనీ, ఇంకో ఇద్దరు జర్మనుయాత్రికులుకూడా నాతోవస్తారని చెప్పింది. ఇంచుమించు ఎనిమిదిన్నరకి బయలుదేరేము. నిన్నరాత్రినుంచీ మంచు ఒకేవిధంగా కురుస్తూంది. పార్కులు, రోడ్లు, మస్కోవానది, మంచుతో గడ్డకట్టిపోయియున్నాయి. అల్లాంటి మంచులోకూడా ఎంతోమంది పార్కులలో కూర్చుండి ప్రభాతవాయువుల సౌఖ్యం అనుభవిస్తున్నారు. ఫిన్‌లాండులో ప్రయాణంచేస్తూండగా ఒకబుద్ధిమంతునితో పరిచయం కలిగింది. ఆయన మంచు Non-conductor అనీ, ఎవ్వరయినా దళసరి ఉన్ని కోటో, చర్మపుచొక్కాయో తొడుక్కొని, మంచుతోకప్పివేసుకుంటే చలిగాలికాని, మంచుకాని, ఏమీబాధించలేదని చెప్పినమాటలు జ్ఞాపకానికి వచ్చినాయి.

మేము మాస్కోనగరంలో, సుప్రసిద్ధములైన 'చీనాగోడ' 'ట్రేడ్. యూనియన్ భవనము' 'పారిశ్రామిక భవనము' 'విదేశాంగ శాఖా భవనము' మొదలైనవాని నెన్నిటినో చూసేము. 'చీనాగోడ' అన్నది నగరంలోనున్న [illegible] గోడ. [illegible]

పెద్దవిగాను, పరిశుభ్రంగాను, ఉన్నాయి.

మామోటారు తిరిగితిరిగి 'సోవియటు స్క్వేర్' లోకి వచ్చింది. 'లెనిన్ ఇన్స్టిట్యూట్' 'స్వాతంత్ర్యస్తంభము' ఈస్క్వేర్ లోనే ఉన్నాయి. అక్కడనుంచి 'విప్లవవస్తుప్రదర్శనశాల' 'ఇజ్వెస్టా' మొదలయిన పత్రికాకార్యాలయాలు, 'పవర్ హౌస్' 'ఎకడమికల్ ఆర్టుథియేటర్' 'గ్రేండ్ థియేటర్' మొదలయిన దర్శనీయస్థానాలెన్నో చూస్తూ ముందుకు సాగిపోయేము.

మాస్కో నగరవీధులు చాలా ఋత్రుపల్లాలు కలిగిఉంటాయి. పట్టణం పర్వతంమీద ఉన్నట్లు తోస్తుంది. ఇంచుమించుగా అన్నిరోడ్ల ప్రక్క పెద్దరాళ్ళు కనిపిస్తూంటాయి. బూడిదరంగు కోట్లుతొడుక్కొన్న పోలీసులు అక్కడక్కడ నిలువబడి రాకపోకలు నియమిస్తూంటారు. యూరపులోని ఇతరదేశాలపోలీసులవలె వీరు ఆడంబరంగా ఉండరు. పోలీసులలో స్త్రీలెక్కువ.

మామోటారు పోయిపోయి 'పుష్కిన్ స్క్వేర్' లో ఒకచర్చికి ముందు ఆగింది. మిగిలిన అన్ని చర్చీలువలెనే ఇదికూడా 'మతవిరుద్ధ వస్తుప్రదర్శనశాలగా' చేసివేయబడింది. ఈ 'మ్యూజియమ్' ద్వారంవద్ద మేము కొంచెంసేపు నిరీక్షిస్తూ నిల్చోవలసవచ్చింది. కారణం మరేమీ లేదు. మ్యూజియమ్ను చూస్తూండడానికి నియోగింపబడిన యామె యెక్కడికో వెళ్ళిందిట. ఆమెరాగానే తలుపుతీసింది. మేము లోపల ప్రవేశించేము. మ్యూజియాన్ని కాపాడేయామె ఇంత అసహ్యంగాఉంటుం దని నేనెప్పుడూ అనుకోలేదు. ఆమె బట్టలనుంచి చాలా పాడువాసన వస్తూంది. ఆజుట్టు. పళ్ళు, కళ్లూ, చూస్తే ఆమె పుట్టినతర్వాత ఎన్నడూ స్నానం చేయలేదని, మొగమేనా కడుక్కోలేదని తోస్తుంది. ఆస్వరూపం తలుచుకుంటే అసహ్యం వేస్తుంది. నేనావిడ దగ్గరికూడా

నిలవబడలేకపోయాను. కనక నాతో వచ్చినవారిని ఆవిడతో విడిచిపెట్టి నామార్గదర్శికతో వేరే బయలుదేరేను. మ్యూజియం అంతపెద్దది కాదు కాని, విలువైనవస్తువులు చాలా ఉన్నాయి.

నమూనాలు, ప్రతిబింబాలద్వారా డార్విన్‌యొక్క పరిణామవాద సిద్ధాంతాలు బోధించబడినాయి. తిరుగుతూ తిరుగుతూ 'ఒకప్పుడు చాలా పవిత్రాలని పూజింపబడినవస్తువులు''ఉన్న చోటికి వచ్చేము. అనేకమూర్తులు,— బంగారపు అట్టలలో భద్రంచేయబడ్డ బైబిలులు— ఈలాగంటివే ఎన్నో అక్కడఉన్నాయి. వాటిని ముట్టుకున్నా, పూజించక పోయినా, ప్రమాదంలేదనీ, సర్వశక్తివంతాలని చెప్పబడుతూఉండేవన్నీ నిజానికి నిర్జీవాలనీ, శక్తిహీనాలనీ, ప్రజలకు దిలాసా ఇస్తున్నారు. తమకి జరుగుతూన్న అవమానాన్ని అడ్డుపెట్టలేనివి ఇతరుల బాధలనెల్లా నిరోధిస్తాయి ? ఆరోజులు వెళ్ళిపోయినాయి. ఈరహస్యం కాస్తా గ్రహించేక రైతులు బైబిలులను, బొమ్మల్ని అంటించిపారవేశారట. ధర్మగ్రంథాలకాగితాలు చింపేసి సిగరెట్లుగాచుట్టి, కాల్చపారేశారట. ఆఖరుకి సమాధిస్థలాల్లో రాళ్ళుకూడా పీకుకొనివచ్చి గుమ్మాల కుపయోగించేరట.

బైబిలులో సూర్యుడు భూమి చుట్టూ తిరుగుతున్నాడన్న మాట నుదాహరిస్తూ అది వట్టిఅబద్ధమని నిరూపిస్తూ, ఆలాగే అసంబద్ధాలైన వాక్యాలనింకా ఉదాహరణగా చూపించి బైబిలు వట్టి అబద్ధాల ప్రోగు అని నిరూపించేరు. మనుష్యులలో వర్గాల్ని దేవుడు సృష్టించేడని బైబిలు చెపుతూంది. దానిని చూపించి కొన్ని వర్గాలని శాశ్వతంగా ఉన్నత వర్గాలక్రింద బానిసత్వంలో ఉంచేటందుకే ఈగ్రంథాలన్నీ ఉపయోగించు తున్నారనీ, వాటికి విలువయేమీలేదనీ, ప్రజలకు ఉపదేశించేరు. ఇచ్చట బైబిలులోని ధార్మికసిద్ధాంతాలు వ్రాయబడిన అట్టలు, వానిప్రక్కనే విజ్ఞాన శాస్త్రరీత్యా వాని అసంబద్ధత నిరూపిస్తూ వ్రాయబడినఅట్టయా, వ్రేలగట్టబ

డినాయి. ఈపాదిరీలు జనసామాన్యంయొక్క శుభం కోరలేదనీ,వీరంతా 'జార్'యొక్క ఏజంట్లనీ, నిరూపిస్తూ వారివారికి నడిచిన ఉత్తరప్రత్యుత్త రాలనకళ్ళు ప్రతిచోటను వ్రేలాడగట్టేరు. ఎక్కడనైనా రాజనైతికవిప్లవం వచ్చేస్తుందనే టప్పటికల్లా పాదిరీలచ్చట ప్రత్యక్షమై ప్రజలదృష్టిని మరల్చడానికై 'జార్' యొక్కసలహాతో ఏదోయొక ధార్మికపర్వాన్ని ప్రకటిస్తూ వచ్చేరని ప్రమాణసహితంగా నిరూపించేరు. ఏవో దొంగ కబుర్లుచెప్పి ఈసోమరిపోతుపాదిరీలు ప్రజల్ని బెల్లించుకొని దోచుకుతినేసే వారని స్పష్టంచేశారు. ఇవన్నీ Orthodox Church కి సంబంధించి నంతవరకు ప్రజలలో అసహ్యం కలిగించినాయి. కాని, ప్రొటెస్టాంటు శాఖ బాహ్యాడంబరాలకి పోక, ఎక్కువగా స్కూళ్ళు, హాస్పిటళ్లు, తెరచి ప్రజాసేవ చేస్తూండడంచేత ప్రజాభిమానాన్ని కోల్పోలేదు. సోష లిస్టులు ఏవి సామాజికకర్తవ్యాలని బోధిస్తూవచ్చేరో వానినే ఈప్రొటె స్టాంటులు చేస్తూవుండడంచేత విప్లవప్రారంభంలో ఈమతంకి ప్రాచు ర్యతయే కలగిందని చెప్పవచ్చును. అదీగాక చిరకాలాన్నుంచి అస్థి చర్మాలను పట్టిపోయిన మతవిశ్వాసాలను ఒక్కమారుగా నిర్మూలించడం కూడా కష్టమే. మొట్టమొదటిరోజులలో సోషలిస్టుల ప్రచారసహాయంతో ప్రొటెస్టాంటులు తమమతప్రచారం కూడా ప్రారంభించేటప్పటికి సోవి యటుప్రభుత్వం 1929 ఏప్రియిలో ధర్మోపన్యాసాలీయకూడదనీ, ధార్మిక సంస్థలకి విరాళాలీయకూడదనీ, శాసించి మతధర్మాలకి హద్దులేర్పాటు చేసేరు. పదునెనిమిది ఏళ్ళకు తక్కువ వయస్సువారెవ్వరూ ధార్మిక గ్రంథాలు చదువకూడదని శాసనం. అంతకు పైబడిన వయస్సుగలవారు ప్రత్యేకంగా మతగ్రంథాలు చదువుకోవచ్చును. ప్రభుత్వాని కేమి అభ్యం తరం లేదు.

ధార్మికపురుషుల్ని ప్రభుత్వం శత్రుసమంగా చూస్తుందనీ, చర్చి

లన్నీ నేలమట్టం చేయబడినాయనీ, 'జీ. పి. యూ' గూఢచారులు ధార్మి కాభిప్రాయాలుకలవారిని నీడలా వెంటాడిస్తారనీ, విదేశీయులు చాలా మంది వ్రాస్తూంటారు. ఆమాటలు నమ్మదగినవిగా తోచలేదు. అవన్నీ సోవియటుశత్రువుల పుట్టగింతలు. మాస్కోలో "రెడ్‌స్క్వేర్" లో 'క్రెమ్లిన్' కెదురుగా ప్రస్తుతం మ్యూజియం ఉన్న "సెంటు బేసిలు చర్చి"కి ప్రక్కనే ఒక చర్చిని చూశాను. ఈచర్చిలో ఎంతోమంది ముసిలి వాళ్లు మోకాళ్ళమీదపడి ప్రార్థిస్తూండడం నాకళ్ళతో చూసేను. కాని, ఒక్కటి మాత్రం వుంది. ఈచర్చీలకి ప్రభుత్వం, సౌకర్యాలు ఏమీ కలగ చేయడంలేదు. ఈచర్చీలకి కూడ అద్దెలు చెల్లించవలసిందే. వానికొక నిశ్చితమైన పన్నువుంది. ఇల్లావున్నా ఏచర్చినీకూడ దానిచుట్టుపక్కల గల ప్రజల అభిప్రాయం తెలుసుకోవిదే పడగొట్టడానికి వీలులేదు. దానిని ఏదయినా ప్రజాసంస్థగా మార్చాలన్నా ప్రజలనుంచి వోట్లు తీసుకొనవలసి నదే. మతం అంటే ప్రభుత్వానికి ఇష్టం లేకపోయినా, ఎవ్వరినీ మత ధర్మాలు విడిచిపెట్టమని నిర్బంధించదు. ప్రభుత్వం తనచేతులోనున్న ప్రచారసాధనా లన్నిటి ద్వారా—పత్రికలు, పుస్తకాలు, రేడియోలు, సినీ మాలు, మొదలైన వానిద్వారా— మతానికి విరుద్ధంగా ప్రచారం చేస్తూంది. మ్యూజియాలలో అనేకప్రకటనలు, ప్లేకార్డులు, అంటించబడి ఈఫాదిరీలు ప్రభుత్వవిరోధులని ప్రచారం చేస్తూంటాయి. ఒకపోష్టరులో సోవియటు ప్రభుత్వం ఓడవలెనూ, భూస్వాములు, పెట్టుబడిదారులు, ఫాదిరీలు, దానిని ముంచివేయడానికి ప్రయత్నిస్తూన్నట్లూ, చిత్రించబడింది.

నేను అవన్నీచూసి బయటకు రాగానే మ్యూజియం ఇన్‌ఛార్జి"మతం విషయంలో మీఅభిప్రాయం ఏమి"టని మార్గదర్శికచేత అడిగించింది.

"మీకు మతం అంటే విశ్వాసం ఉందా?"

"ఆ. ఉంది."

"ఉందా? కారణం?"

"మతం మీద విశ్వాసం ఎందుకు ఉంచకూడదో మీరు నచ్చచెప్ప లేకపోయారు కనక."

"ఇంతవరకు చూసినవి చాలవు. మతం పేరిట జరుగుతూన్న దురంతాల్ని, మోసపుపనుల్ని, చూసినాకూడా మీమతవిశ్వాసం చలించ లేదు?"

"మీరు మతానికి విరుద్ధంగా ఏమీ చెప్పడం లేదు. ఫాదిరీలమీదనే మీరెన్ని బాదులు బాదినా."

"ఫాదిరీల మీదనే అనండి. ఈచర్చీలు ఆచారాల పేరుచెప్పీ, పర్వాల పేరుచెప్పీ, రైతుల్నీ, బీదర్నీ, ఏలాగ దోచుకొనేవారో మీరెర గరు? పాపం ఈబీదప్రజలు ఎన్నిబాధలుపడి తీర్థయాత్రలకి పోయేవారో మీరెరగరు? బిషప్పుల శవాలు చీకటినేలమాళిగలలో ఉంచేవారు. ప్రజలు అక్కడికి వెళ్ళి వానిముందు ప్రార్థనలు చేసేవారు. వారున్న పెట్టెల్ని ముద్దుపెట్టుకొనేవారు. విప్లవం తర్వాత ఆనేలమాళిగలు తవ్వి తీసినపుడు ఆపెట్టెలలో చాలవానిలో శవాలే లేవు. పిండితోచేసిన బొమ్మలే ఉన్నాయి వాటిలో. మీరు మ్యూజియములో అటువంటి శరీరాన్ని చూడలేదు?"

"ఆహా! చూశాను. కాని, మీరు ఎన్ని నేరాలు చెప్పినా ఫాదిరీల మీదనే. మతాన్ని గురించి మీరేమీ చెప్పడం లేదు."

నాయీప్రశ్న విని వారు చాలా ఆశ్చర్యపడ్డారు.

"ఇతరులయెడ దయకలిగి ఉండమని ధర్మం బోధిస్తూంది. పాపం చేయవద్దని—"

మాటమధ్యనే ఆమె అడ్డుపడింది.

"పాపం అంటే ఏమిటి? ధర్మానుసారంగా చర్చిలో పెళ్ళిచేసుకొన [illegible]

తినడం చాలా పుణ్యమట. ఈశ్వరుని ఆదేశ మిదేనా?"

అద్భుత మైన ప్రశ్న. పాపం అంటే ఏమిటో చెప్పడం వీలయిన విషయంకాదు. హిందువుడు పాపం అనేది మహమ్మదీయునికి పుణ్యం. వీళ్ళిద్దరూ ఔనన్నది క్రిస్టియనులకి కాదు. యూదులకి సత్కార్యగాతోచేది కేథలికులకు పాపకర్మ.

"ప్రతిధర్మంలోను కొన్ని విశేషాచారాలు, పద్ధతులు, ఉంటాయి. ధర్మం కాస్త పాతపడేసరికి సామయికాచారాలు దానిలో ప్రవేశిస్తాయి. అందుచేతనే మతంలో సమయానుసారంగా మార్పులు చేసుకొనడం అవసరం. కాని, జరుగుతూన్న తప్పులన్నిటికి ధార్మికమూలసూత్రాలనే బాధ్యులు చేయకూడదు."

"అయితే ధర్మముయొక్క మూలసిద్ధాంతా లేవంటారు? ఇరుగు పొరుగువారిని ప్రేమించడం, వారికి సాయం చేయడం, ఇతరులయెడ దయకలిగియుండడం, ఇవేనా?"

నేను తల యూపేను, ఆమె ఉత్సాహంతో ఎగిరిపడింది.

"అయితే, ఈప్రపంచం అంతటిలో మాకంటె ధార్మికులెవ్వరూ లేరు. బీదవారికి సాయం చేయమనీ, మిత్రులకు సుఖదుఃఖాలలో సాయపడమనీ, అవధ్యులయెడ దయచూపమనీ, మీధర్మం ప్రజల హృదయాలకి అర్జీలుపెట్టాలి. దానిమీద స్కూళ్లుతెరచి, ఆసుపత్రులు పెట్టించి, చెరువులు–నూతులు తవ్వించి. అనాథశరణాలయాలు కట్టించి, మీరు పరలోకోపయోగంకోసం పుణ్యం వృద్ధిచేసుకుంటున్నారు. ఇంక మేము. మామతం మంచిపనులు చేయమని మాకు అర్జీలు చేయదు. అల్లాచేయమని విధిస్తుంది. మీరు బీదవారికి సాయం చేస్తారు. కాని, మాదేశంలో బీదవాడనేది లేకుండానే చేసేస్తున్నాము. మాఅందరిదీ ఒకటేతరగతి. మేము అందరం సమంగానే సుఖాలు అనుభవిస్తున్నాము. మాసమాజంలో

ఎవ్వడూ ఒకరి ఎదుట అభిమానం చంపుకొని చేయిచాప పనిలేదు. ఎవ్వడూ తానేదో మహత్కార్యం చేస్తూన్నట్లు ఎవ్వరినీ అవమానించవలసిన పనిలేదు. మేమందరమూ సమానులమే. నేడు బీదలుకూడా నగరాలలో నివసించవచ్చును. వారినెవ్వరూ అభ్యంతరపెట్టరు. వారు తమకుతోచినకన్యని పెళ్ళి చేసుకోవచ్చును. మతభేదా లాతనికి అడ్డం కావు. తెలిసినదాండి?"

వారి ఈపద్ధతే ఉత్తమధర్మమని అంగీకరించక తప్పిందికాదు. అయినా నామార్గదర్శికను ఉడికించాలనే ఉద్దేశ్యంతో

"అయితే మీకూ ఏదో మతం ఉండనే ఉంది. మతం లేదనుకుంటారేం మరి?"

అన్నాను. ఆమె ఉగ్రమూర్తి యైపోయింది.

"మేము ఏమతాన్నీ అంగీకరించం. మేముమతం అనే మాటనే మాశబ్దకోశాలనుంచి ఎత్తివేయగోరుతున్నాము. మేము కమ్యూనిస్టులము. అంతే."

"అయితే, మీమతం కమ్యూనిజ మన్నమాట అంతేకాదు?"

"మీకు తోచినట్లనుకోండి."

అప్పుడే కురిసిన మంచును చిదిపివేస్తూ మామోటారు బయలుదేరింది. అక్కడనుంచి మేము కూలీల "తాలింఖానాను" చూడడానికి బయలుదేరేము. నగరం వెలుపలికి వచ్చేము. పట్టణంలోపలె ఇక్కడ రోడ్లమీద పడిన మంచుని తొలగించరు. అందుచేత బాట యేదో, పొలా లేవో, తెలిసికొనడం కష్టంగావుంది. మోటారు పైకీ, క్రిందికీ, ఎగిరి పడుతూ నెమ్మదిగా పోతూంది. అడుగడుగుకి ఎక్కడ జారిపోతుందో నని భయంగానే వుంది. ఆభయం వట్టినే కాదు. ఒకకారు మంచుకోజారి, దారితప్పి, ఒకచెట్టును కొట్టుకుంది. కారంతా పూర్తిగా చెడిపోయింది.

కాని, జనం మాత్రం బ్రదికేరు. బాట వెంబడి జనం వస్తూ పోతూండడం చేత ఆమంచులో ఒకవిధమైన బూడిదరంగు చాలు ఏర్పడింది. రోడ్డుకీ, మైదానానికీ, భేదం చూపించడానికి మిగిలిన దీ రేఖ ఒక్కటే.

శ్రీ వేమన గ్రంథాలయము వారు,
వేలప్రోలు.

## ౧౨

మేము తాలింఖానా (స్టేడియం) ప్రవేశించేము. ఇంతలో ఆకాశం మేఘాలతో మూసురుపోయి తెల్లని చినుకులు పడసాగేయి. చూస్తూ చూస్తూండగానే మాటపర్ కోట్లు తెల్లపడిపోయేయి. మాలో ఎవ్వరో ఒకరు తరుచుగా జారిక్రిందపడుతూనే లోపలికివెళ్లేము.

తాలింఖానా కొత్తది. పెద్దదిగానూ ఉంది. కూలీలు ఇక్కడికి ఆడుకొనడానికి, ఆటలుచూడడానికి, వస్తూంటారు. ప్రభుత్వం పారిశ్రామికుల మానసికాభివృద్ధికోసం, క్లబ్బులు, పాఠశాలలు, గ్రంథాలయాలు, రేడియోలు, ఎట్లుతెరిచేరో ఆలాగే వారి శారీరకాభివృద్ధికోసంకూడా తగిన బందోబస్తు చేశారు. ప్రతిక్లబ్బులోను, ప్రతికార్ఖానాలోనుకూడా తరచుగా వ్యాయామశాలలు ఉంటూనే ఉంటాయి. వసంతకాలంలోను, వేసవి కాలంలోను, ప్రతిపార్కులోను ఆటపాటలు, కుస్తీవినోదాలు ఉంటాయని అక్కడివాళ్ళు చెప్పేరు. పారిశ్రామికులు, శారీరకంగాను—మానసికంగానుకూడ ఆరోగ్యవంతులై దృఢంగా ఉండాలనే సోవియట్ప్రభుత్వంయొక్క ఆలోచన. ఇందువలన దేశీయులు నాగరికులు కాగలుగుతారు. యుద్ధం వచ్చిందంటే అంతా సిద్ధం కాగలుగుతారు. రష్యాలోని యంత్రాలయాలన్నీ రైఫిళ్ళని తయారు చేస్తున్నాయని, అక్కడ ప్రతి

వారికీ వానిని కాల్చడం నేర్పుతున్నారనీ, రూటరు వార్తలవలన తెలు స్తూంది. పెట్టుబడిదారీదేశాలయిన జపాను, జర్మనీ, ఆస్ట్రియా, ఇగ్లండు వగైరాలు తనచుట్టువారా కాచుకొని కూర్చున్నాయని రష్యా ఎరుగును. ఆదేశాలప్రభుత్వాలన్నీ తనకి పరమశత్రువులనీ ఎరుగును. ఈమధ్య నీమధ్య పెట్టుబడిదారీదేశాలు రష్యాతో సంధి చేసుకుంటున్నాయి. కాని, రష్యా తనజాగ్రత్తమీద తాను ఉంటూంది. "మేమెవ్వరిదేశాలు ఆక్ర మించుకోము." అని వారెన్ని మారులు ఘోషించినా రష్యాకు వీరివలని భయం తప్పలేదు. రష్యాపూర్వదిగ్భాగంలో జాపానీయులు చేస్తూన్న అల్లర్లకి రష్యనులు యుద్ధం ప్రకటించవలసినదే. కాని, నేటి రష్యను నియంత చాలాజాగ్రత్తయైనవాడు. ఆతడు కేవలం ఆర్భాటానికి, ప్రతి ష్ఠకి, ప్రాకులాడి ప్రారంభించిన మహత్కార్యం భగ్నం చేసుకొనడు. అలాగని ఊరుకొనీ రకం కాదు. అతిశీఘ్రంగా దూరప్రాచ్యఖండాన తన సేనలన్నీ సిద్ధంచేసుకుంటూన్నాడు. అక్కడికి వెళ్ళి కాపురం ఉండే వారికి సౌకర్యాలిస్తూన్నాడట. ఆప్రాంతం స్వతంత్రంగా నిలువబడి ఉండ గలిగేటందుకు కార్ఖానాలు, పరిశ్రమలు, అధికంగా పెంచివేస్తున్నాడట. వీటన్నిటినీ, సఫలం చేయాలంటే దేశంలోని ప్రజ బలిష్ఠంగా ఉండాలి. కూలీలు, రైతులే గనక ఆలాగ తయారయితే లోటేమిటి?

మంచుకురిసే రోజులు కావడంచేత తాలింఖానా జనశూన్యంగా వుంది. అక్కడనున్న భవనంతప్ప చూడడానికి ఏమీలేదు. భవనం నూతనపద్ధతులమీద నిర్మించబడింది. నిరాడంబరంగా వుంది. కాని, చాలాపెద్దది. వేలకొలది జనం కూర్చుని చూసేటందుకు వీలుంది.

## ౧౩

అక్కడనుంచి మా మోటారు బీదల నివాసస్థలాలకేసి (Slum quarters) బయలుదేరింది. అచ్చట కొద్దిరోజుల్లోనే కూలగొట్టివేయబడే కర్రగుడిసెలమధ్య మంచిమంచి అందమైన మూడంతస్థుల మేడలు కనపడ్డాయి. వానికి పెద్దకిటికీయున్నాయి. ఎలక్ట్రిక్ దీపాలు, ఎలక్ట్రిక్ పొయ్యిలు, ఆధునికపద్ధతులమీద నిర్మింపబడిన పాయిఖానాదొడ్లు, వీనితోటి ఆమేడలు చాలాసౌకర్యంగా ఉన్నాయి. ఆప్రదేశాలుచూస్తే కూలీల యొక్క విప్లవానికిపూర్వము స్థితి, నేటిస్థితి, స్పష్టంగా గోచరిస్తుంది. పూర్వపుటిండ్లు చాలవరకు రెండంతస్థులవి. అయితేనేం ఆరెండంతస్థుల ఎత్తు నేటిభవనాల ఒక్కఅంతస్థు ఎత్తుకంటేనూ తక్కువగా ఉంది. వెనుకటి ఇండ్లకి కిటికీలు లేనేలేవు. ఉన్నవైనా బయటనుంచి గాలిరావటానికిగాని, లోనిపొగ బయటికి పోవటానికిగాని, ఉపయోగించనంత చిన్నవి. చుట్టుప్రక్కలు చాలా అసహ్యంగా వుండేవి. పెంటగోతులు, బూడిదపోగులు, చెత్త—చెదారం, ఏమూలపడితే ఆమూలనే ప్రత్యక్షం. ప్రభుత్వం ఈయిళ్ళను ఒక్కొక్కదానినే కూలద్రోసి, వానిస్థానే నూతన సౌధాలను నిర్మిస్తూంది. కాని, మొత్తంమీద, నేడుకూడా ఇండ్లుచాలా తక్కువగా ఉండడంచేత, మనిషికి ఆరుచదరపు మీటర్లు (1 1/5 చద

రపు గజాలు=1 చదరపు మీటరు) మొదలు తొమ్మిది చదరపు మీటర్ల వరకు వైశాల్యంగల గదులు ఇస్తున్నారు. అంతకంటె ఎక్కువ ప్రదేశం కావలసివస్తే అదనపుప్రదేశానికి ఎక్కువకిరాయి వసూలు చేస్తారు. కాని, ఒకటి. పెద్దకుటుంబాల వాళ్ళకి మాత్రం కొన్ని ప్రత్యేకసౌకర్యాలు కలుగ చేయబడుతున్నాయి. కమ్యూనిష్టుపార్టీమెంబరయినా సరే, కాకపోయినా సరే, ఫ్యాక్టొరీకూలీ అయినాసరే, ఆఫీసులో క్లర్కు అయినాసరే, ప్రతిమనిషి తాను ఆక్రమించుకొన్న ప్రదేశముయొక్క వైశాల్యాన్నిబట్టి అద్దెను ఇచ్చుకోవాలి. కొంతమంది ఒకేగదిలో నివసిస్తూ రమఆదానిపట్టిఅద్దె చెల్లిస్తూన్నారట. ఇచ్చే అద్దెని పట్టి ఇండ్లయొక్క అందచందాలు ఆధారపడి ఉంటాయి. ప్రభుత్వంయొక్క కోఆపరేటివ్ బ్యాంకులనుండిగాని, మ్యునిసిపాలిటీల గృహనిధినుండిగాని, అప్పుపుచ్చుకొని, 'కోఆపరేటివ్' ప్రణాళికప్రకారం కట్టబడిన భవనాలు కొన్ని ఉన్నాయి. అన్ని చోట్ల లోవలె వీనికి అద్దె తీసుకొనరు. ఆకోఆపరేటివులో సభ్యులైనవారంతా ఇంటిమరమ్మతులకి అప్పుతీర్చడానికి ఎంతధనం అవుతుందో దానిని తమలోతాము పంచుకొని చెల్లించుకుంటారు.

"ఒకమనిషికి ఆరు చదరపుమీటర్లమొదలు తొమ్మిదిచదరపు మీటర్లవరకు వైశాల్యంగల గది చాలదు?"

"అహ. చాలదనే మాఅభిప్రాయం. అందుచేతనే పనులు అంత బాగుండకపోయినా అనుభవంలేని కూలీలచేతనే త్వరత్వరగా ప్రభుత్వం భవనాలు కట్టించి వేస్తూంది."

"కాని, ఆ అభిప్రాయం చాలా పొరపాటు. గట్టితనంలేని ఇండ్లు కట్టించి నిష్కారణంగా పెడబ్బును దుర్వ్యయం చేసివేస్తున్నారు. నేను లెనిన్‌గ్రాడ్‌లో చూచినట్లు పనికలిగి కూలీలను ఒకపనిలోనుంచి మరొకపనిలోనికి తీసుకుపోతే సామానుకొంత పాడుకాకమానదు."

"నిజమే. కాని, ఈకూలీలకి నివసింపచేటందుకు చోటెక్కడ చూపించడం అన్నది మామొదటిబాధ. అందులోనూ ఈమధ్యని పట్టణాల లోనికి జనం మహాప్రవాహంలా వచ్చి పడిపోతున్నారు. 1926 లో మాస్కోజనాభా ఇరవైలక్షలు. కాని 1931 నాటికి 37 1/2 లక్షలవరకు పెరిగింది. ఆకాలంలోనే లెనిన్‌గ్రాడ్‌లో జనాభా నూటికి 37-1 మంది పెరిగేరు. ఈపెరిగిపోతూన్న జనసంఖ్యకి ఇళ్లు కావాలా?"

"పల్లెటూళ్లనుంచి పట్టణాలలోనికి ఇంతమందిజనం వచ్చేస్తూ వుండడానికి కారణం ఏమిటి?"

"బహుశా పట్టణవాసంజీవితంలోని ఆకర్షణమేమో."

"కాని, జారుల కాలంలో మాత్రం ఈ ఆకర్షణం లేదు? ఆరోజు లలో పట్టణాల కింతఎక్కువగా జనం వచ్చివేయలేదు."

"కాని, ఆరోజులలో జీవితానందం అనుభవించడానికి నేడున్నన్ని సౌకర్యాలు లేవుగాదా?"

"క్షమించండి. దీనికిగల కారణం మరొకటని నాఊహ. మీప్రభు త్వం కార్ఖానా కూలీలకి ఎక్కువ సౌకర్యాలు కలుగచేస్తూంది. ప్రభుత్వం ఇంతవరకు వారిచేతులలోనే ఉండడం దీనికి కారణం. నేచెప్పినమాట నిరాధారం కాదు. ప్రథమపంచవర్షప్రణాళికలో కూలీలకోసం రైతులనుంచి బలవంతంగా ధాన్యం వసూలు చేశారు. మిల్లులు ఎక్కువగానున్న ప్రదే శాలమీదనే ప్రభుత్వం తమదృష్టిని కేంద్రీకరింపచేశారు."

"మేము రష్యాని పారిశ్రామికదేశం చేయదలచుకున్నాము. కను కనే కార్ఖానాలమీద మాదృష్టి కేంద్రీకరించక తప్పదు."

"మీరు కార్ఖానాలగొడవలో రైతులసంగతే మరచిపోయేరు. అందుచేతనే ప్రభుత్వాదరణ పొంది సుఖంగా బ్రదుకడానికి నగరాలలో చేరుతున్నారని తలుస్తాను."

"అయితే అదికూడా ఒకకారణం కావచ్చును. కాని, నేడు ప్రభుత్వం రైతులవిషయమే ఎక్కువశ్రద్ధతో చూస్తూంది."

ఆమెమాట నిజమేకూడా. హోటలుకు వచ్చేసేటప్పుడు ఆమె "కామ్రేడ్ కోర్టు చూద్దామా" అంది.

"అంటే ఏమిటి?"

"కార్ఖానాలలోను, ఇతరసామూహికసంస్థలన్నిటిలోను కూడా, కూలీలే తమన్యాయస్థానాలను ఏర్పాటుచేసుకొని తమ 'కామ్రేడ్లు' చేసిన నేరాలు విచారిస్తూంటారు."

"బహుశా అది ఒక పంచాయితీమాదిరిది అనుకుంటాను. కాని, ఈపంచాయతీ తీర్పును ఆతడు అంగీకరించకపోతే చేసేపని యేమిటి?"

"ఆహా. వాళ్లు పంచాయతీ తీర్పును తిరస్కరించనేలేరు. ఈతీర్పుకి వెనుక ఒకసంఘముయొక్క ఏకీకృతమైనశక్తి వుందని వారెరుగుదురు."

"మీఏకత్వం అంటే ఉద్దేశ్యం ఏమిటి? నేను విదేశాలలో పుస్తకాలలో చదివిన కమ్యూనిస్టుపార్టీసమావేశాలా?"

"అబ్బే! కాదు. కాదు. అవి రేవు. కామ్రేడ్ కోర్టుల్లో ఒకే యూనిట్ లోని సభ్యులయొక్క నేరాలే విచారించబడతాయి. ఇంక పార్టీమీటింగులంటే సభ్యులంతా చేరి వాదప్రతివాదాలు చేసుకునేవి. పార్టీసభ్యుల నేరాల్ని విచారించేవి మాత్రమే. కోర్టుల్లో ఏపార్టీకి సంబంధించిన వాళ్లనైనా విచారించవచ్చును. నేరారోపణజరిగిందా అంటే ముద్దాయీ చిన్న విషయంకూడా దాచలేడు. కనక నేరాన్ని స్వయంగానే అంగీకరిస్తాడు. కాని, పార్టీమీటింగు పార్టీలోని సభ్యుల్ని శిక్షణలో ఉంచడానికి మాత్రమే ఉపయోగిస్తుంది."

"నేరాలనంగీకరించేపద్ధతి క్రైస్తవుల పాప- స్వీకారసిద్ధాంతం (Theory of Confession) మాదిరిగా ఉంటుందనుకుంటాను."

"అచ్చే! కాదు. కాదు. క్రైస్తవులు ఒక్క-ధర్మపిత ఎదుటమాత్రమే దోషస్వీకారం చేస్తారు. ఈశ్వరుడు అంతమాత్రంక్షమించేస్తాడనే వారి యూహ. కాని, ఇక్కడ మావిధానం అదికాదు. ఈకోర్టుముందు ఏమాటాదాగదు. ఒకవేళ ఏదయినా విషయం దాచితే మరొకడెవ్వడో దానిని బయటపెట్టేసితీరుతాడు. అందుచేత నేరస్థుడు చులకనగా నేరం ముందే అంగీకరిస్తాడు. అదీగాక ఇచ్చటి దోషాంగీకారం తప్పుక్షమించ బడుతుందనే దృష్టితో జరుగదు. చేసినతప్పును పట్టి పార్టీనుంచి బహిష్కరించడమో నియమితకాలంవరకు బహిష్కరించడమో జరుగు తుంది. ఈఅపరాధస్వీకారం బుద్ధిమంతులు, స్వతంత్రబుద్ధిగల సత్పురు షుల, ముందు జరుపబడుతుందికాని, నోరు-వాయలేని చెవిటిమొద్దు దేవునిముందరా, పరాన్నజీవులయిన ఫాదిరీలముందరా కాదు."

"దీనివిషయం తెలిసిందికదా అంతకంటె ముఖ్యమైనది మరి యేదయినా చూస్తాను."

అన్నాను, ఒకనిముషం ఆగి.

"మంచిదే. ఈవేళరాత్రి "నైట్‌శానటోరియం" చూద్దాము."

"ఔను. అది బాగుంటుంది." అక్కడికి రాత్రి వెళ్ళడానికి నిశ్చ యించుకున్నాము.

మధ్యాహ్నం భోజనం చేశాక నాగదిలోనే విశ్రాంతి తీసుకుంటూ కూర్చున్నాను. నాగదిలోని కిటికీకి ఎదురుగానే 'మస్కొవా'నది. దాని ఆవలిఒడ్డుననే 'రెడ్‌స్క్వేర్', విశాలకాయంగల 'సెంట్ బేసిల్ చర్చి' కనిపిస్తూన్నాయి. పట్టణంకేసి చూస్తే బెర్లిన్-పారిస్‌లాగ, అంతవర కెందుకు ఆఖరికి కలకత్తా-లాగయినా తయారుకావాలంటే ఎంతోకాలం పడుతుందని తోస్తూంటుంది. పట్టణంలో అంతజనసమ్మర్దం లేదు. పెద్దపెద్ద బండరాళ్ళతో నిండినరోడ్లమీద అంతగా రహదారీలేదు.

గుఱ్ఱపుబళ్లు, ట్రాములు, ఎప్పుడోకాని కనపడవు. ప్రజల్ని చూస్తే మురికీ, దరిద్రం ఓడుతూన్నట్లు ఉంటారు. కాని, బీదలయిన కూలీలకి ఇక్కడ కలుగజేయబడుతూన్న సౌకర్యాలు మరేదేశంలోను లేవు. ప్రజలయొక్క జీవితవ్యయప్రమాణం చాలా తక్కువగా ఉందని రష్యనులే అంగీకరిస్తారు. కాని, ద్వితీయపంచవర్షప్రణాళికతో తమ దరిద్రం వదలిపోతుందని వారి ఆశ. నేటి పరిస్థితులలోకూడ కూలీలస్థితి వెనుకటికంటె చాలా బాగావుంది. పుచ్చి పురుగులోడుతూ, కూలిపోతూన్న కొంపలకి బదులు, ఆధునికపద్ధతులమీద నిర్మించిన సుందరభవనాలలో వాళ్లు నివసిస్తున్నారు. వారిపిల్లల్ని చూస్తూండడానికి, చదువుచెప్పించడానికి, 'క్రెచీ'లు, 'కిండర్ గార్టెన్ స్కూళ్లు' ఉన్నాయి. వారు కూలిపనిచేసుకుంటూనే ఉన్నా, ప్రభుత్వంలో పెద్దఉద్యోగాలు పొందవచ్చు. వారికి ఉచితంగా ఆసుపత్రులు, క్లబ్బులు, గ్రంథాలయాలు నడపబడుతున్నాయి. ఆకలిబాధ వారిని ఇప్పుడు పీడించడం లేదు. నిర్ణీతమైన భోజనం వారికి చవుకలో దొరుకుతూంది. వారేకార్ఖానాలలో పనిచేస్తున్నారో వానిమీద వారికి అధికారం వుంటూంది. ఇంజనీయర్లకంటె, మేనేజర్లకంటె కార్యకుశలతలో తక్కువఅయినా హోదాలో వారికంటె తక్కువకాదు. వాళ్ళు కావాలంటే పెద్ద ఉద్యోగుల్ని కలుసుకొని వారికి ఆలోచనలు చెప్పవచ్చును. చాటున మాటునరాకుండా బహిరంగసభలలో కార్ఖానాలలోని గోడమీదపత్రికలలో, R. K. E. ఎదుట (People's Commissariate for Workres & Peasants' Inspection.) ఉన్నతాధికారుల్ని విమర్శించవచ్చును. ఈ R. K. E. అన్నది రష్యాలోని సంస్థలలో చాలా బలీయమైనది. కార్ఖానాలలోని పనిపాటల్ని, కూలీల పరిస్థితుల్ని జాగ్రత్తగా పరీక్షించడానికి ఈసంస్థ పుట్టింది. ప్రతి కూలీ 'ట్రేడ్ యూనియన్' సభ్యుడు అయితీరాలి. ప్రపంచంలోని ఇతర

దేశాలలో కార్ఖానాల యజమానులతో కుస్తీలుపట్టడానికే ఈ 'ట్రేడ్ యూనియన్లు' ఉపయోగిస్తున్నాయి. కాని, ఇక్కడ పోరాడడానికి, యజమానులు లేరు. అందుచేత పోరాడవలసిన పనిలేనేలేదు. కూలీలను పనులలో ప్రవేశపెట్టేపని కార్యదాయకసంస్థలది. (Employing bodies) అందుచేత కూలీల హక్కుల్ని కాపాడడము, 'కార్యదాయకసంస్థల'కి వానిపనిలో సహాయం చేయడం రష్యాలోని 'ట్రేడ్ యూనియన్ల' పని. వేరువేరుపరిశ్రమలకి వేరువేరు 'ట్రేడ్‌యూనియన్లు' ఉన్నాయి. ఏపరిశ్రమలో పనిచేసేవాడు దానికి సంబంధించిన యూనియనులో సభ్యుడుగా చేరితీరాలి. కార్యదాయకసంస్థలు 'ట్రేడ్‌యూనియన్ల'తోటే కంట్రాక్టులు స్థిరం చేసుకుంటాయి. కూలీలకి కలిగేబాధల్ని యంత్రాలయాధికారులు తొలగించకపోతే, 'షైబ్‌కము'కుగాని 'జైప్‌కము'కుగాని అంటే కార్ఖానా కమిటీలకి అర్జీ పంపుకోవాలి. ఈకార్ఖానాకమిటీలని, కూలీలంతా నిర్వహిస్తారు. కనక, ఈకమిటీలే రష్యాలోని, సమర్థములయిన సంస్థలు.

కార్ఖానాలలో పనులు చేయించడంలోకూడా ఎన్నో సౌకర్యాలు కలగచేయబడినాయి. అన్నికార్ఖానాలలోను రోగులకు ఆసుపత్రులు, నాలుగేండ్లపిల్లలకి 'క్రెచీ'లు తప్పకుండా ఉంటాయి. కొన్నికార్ఖానాలలో కూలీలకి చదువుచెప్పించి మేస్త్రీలుగా (Technician) ఇంజనీయర్లుగా, వకీళ్ళుగా, రసాయనశాస్త్రజ్ఞులుగా, ఉపాధ్యాయులుగా తయారుచేసేటందుకు సౌకర్యాలు ఉన్నాయి. కార్ఖానాలలో పనిచేస్తూన్నా, ఆఫీసులలో పనిచేస్తూన్నా, ఏపనిచేసేవారికయినా పనిదినాలు అయిదే. ప్రతి ఆరవదినం సెలవుగా లెక్క. కాని, కార్ఖానాలన్నిటిలో పనివాండ్రందరికీ సెలవుదినము ఒక్కటిగానే ఉండదు. ఈపద్ధతి కొత్తగా పెళ్ళిచేసుకున్నవారికీ, నూతనప్రేమావేశం తగ్గనివారికీ, చాలాబాధకరంగా ఉంటుందని నాయూహ, ఎందుకంటే పురుషునికి సెలవురోజు స్త్రీకి పనిరోజుకావచ్చు.

అధీగాక కూలీలు వేరువేరుజట్లుగా ఏప్పుడ వంతులువారీగా పగళ్ళు రాత్రులు పనిచేయవలసి యుంటుంది. అందుచేత మగవాడికి పగలు సెలవయితే, ఆడుదానికి రాత్రి సెలవు రాకపోవచ్చు. ఈపరిస్థితులలో భార్యాభర్తలు కలుసుకొనడానికి సమయమే దొరుకకపోవచ్చును. ఇది చాలా పెద్దబాధే. కాని, ఈపరిస్థితులు తరుచుగా తటస్థించవని ఊహిస్తాను. ఏడాదికంతకీ జాతీయోత్సవాలు అయిదుమాత్రమే ఉన్నాయి. తేలికపనుల లోనివారికి ఏడాదిలో రెండువారాలు; బరువుపనులవారికి నాలుగు వారాలు; పూర్తి జీతంమీద సెలవులిస్తారు. రష్యాలో వారంఅంటే ఆరేరోజులన్నమాట మరచిపోకూడదు. రోగంపడ్డప్పుడు, కూలిపడుచుల ప్రసవ దినాలప్పుడు, పూర్తిజీతంమీద సెలవు ఈయబడుతుంది. కాని, ఈ సెలవులలోని జీతాల్ని 'సామాజిక — భీమా — విభాగం' నుంచి వసూలుచేస్తారు. ఈ'భీమావిభాగానికి' కూలీలు తమ జీతాలనుంచి 'ప్రీమియములు' చెల్లించపనిలేదు. కార్యదాయికసంస్థలే కూలీలకిస్తూన్న జీతాలనిపట్టి నూటికి 14రూబుళ్లు భీమాకంపెనీకి చెల్లించుతాయి. ఈభీమాకంపెనీలు ప్రసవసమయాలలో స్త్రీలకు వారిచ్చే నెలజీతాలకుతోడు నూటికి పదిలేకపన్నెండురూబుళ్ళు భత్యంక్రింద ఇస్తాయి. కార్ఖానాలలో పనిచేసేటప్పుడు గాయాలుతగిలి నిరుపయోగులైన కూలీలకి అరవైఏళ్లుదాటిన ముసలివాళ్ళకి ఈభీమావిభాగంనుంచి జీవితాంతం వరకు భత్యం ముట్టుతూ వుంటుంది. ఈభీమాశాఖయే కూలీలకోసం ఆరోగ్యశాలలు, విశ్రామాలయాలు, శిశుపోషణాలయాలు, నడిపిస్తుంది.

నాకు తెలిసినంతవరకు రష్యాలో సామాన్యకూలీకి 70 మొదలు 100రూబుళ్లవరకు, బుద్ధిమంతులైన కూలీలకి 150 మొదలు 250రూబుళ్లవరకు రష్యనుఇంజనీర్లకయితే 300మొదలు 1000వరకు విదేశీయులకు అంతకంటె ఎక్కువ జీతాలు కూడా ఈయబడుతున్నాయి. కళాకారులు,

గ్రంథకర్తలు ఇంకా ఎక్కువ సంపాదిస్తున్నారట.

కాని, జీతాలలో కనిపిస్తున్న ఈ తేడాయే వాళ్ళజీవితముయొక్క స్థితిలో కూడా ఉంటుందని ఊహించడం పొరపాటు. ఒకకూలీ నూరు రూబుళ్లు ఒకఇంజనీరు ఎనిమిదివందలు సంపాదిస్తున్నాడనుకొనండి. అంతమాత్రంచేత ఇంజనీరు కూలీకంటె ఎనిమిదిరెట్లు ఎక్కువ సుఖపడ తాడనుకొనడం పొరపాటు. నూరురూపాయలజీతగాడు ఒకగదికి పదిరూబుళ్ళు అద్దెఇస్తే ఎనిమిదివందలజీతగాడు 80రూబుళ్లు ఆగదికే అద్దె ఈయవలసియుంటుంది. మామూలుగా ప్రతిమనిషికీ అత్యావసరములయ్యే వస్తువులకి ఒకనిర్ణీతమైన ధర ఏర్పాటుచేయబడింది. అవిగాక ఇంకేవస్తువులు కొనుక్కోవలసివచ్చినా వానిఖరీదు కొనేవాని సంపాదననిపట్టి పెరుగుతూ వుంటుంది. ఈవిధంగా ప్రభుత్వం కుడిచేతిలో ఇచ్చినదానినే ఎడంచేతితో వసూలు చేస్తూంది. ఆమనిషిపోయినాక ఆతని ఆస్తిఅంతా ప్రభుత్వమే వశం చేసివేసుకుంటుంది.

ఈవిశ్రాంతిసమయంలో మార్గదర్శికను కొన్నిప్రశ్నలు అడిగేను.

"మీప్రభుత్వం కమ్యూనిస్టులకి సమస్తసౌకర్యాలు కలిగిస్తూ ప్రజల్ని కమ్యూనిస్టులు కావడానికి తొందరపెడుతూందనుకుంటాను."

"నిశ్చయంగా. అది స్వాభావికమే కూడా. జారుల కాలంలో జనసామాన్యంయొక్క పరిస్థితులు బాగుపరచడానికై నానాబాధలు పడినది కమ్యూనిస్టులే. అందుచేతనే కమ్యూనిస్టులకి నేడు ప్రాధాన్యత ఈయబడుతూంది. కాని, కార్ఖానాలలో కమ్యూనిస్టులు కానివారూ ఉన్నారు. వారిలో కొందరు పూచీగల ప్రభుత్వోద్యోగాలలోకూడా ఉన్నారు."

"అయితే సరే. కాని, ఈ 'పయనీర్లు', 'కామ్సోమోల్,' 'షాక్ బ్రిగేడ్,' లేమిటి?"

"ఇవన్నీ వేరువేరు వయస్సులలోనున్న కమ్యూనిస్టుసంస్థలు.

అందరికంటె తక్కువవయస్సుగల కమ్యూనిస్టులను 'అక్టోబరుపిల్లలు' అంటారు. అక్టోబరులోనేకాదు విప్లవం జరిగింది? వారికంటె కొంచెం వయసుకలవారిని 'పయనీరు' లంటారు. ఇరవైనాలుగేళ్ళ వయస్సున్న యువతీయువకులయిన కమ్యూనిస్టుల సంఘాల్ని 'కమ్యూనిస్టుయువక సంఘా' లంటారు. వీనినే తరుచుగా 'కామ్‌సోమోల్' అనికూడా పిలుస్తారు. ఈసంస్థలోని సభ్యులు తమకు ఒప్పగించబడిన ఉత్తమకార్యాన్ని సఫలంచేయగలుగుతే వారిని కమ్యూనిస్టుపార్టీలో చేర్చుకుంటారు. వారు కమ్యూనిస్టుపార్టీ ఆజ్ఞలప్రకారం సర్వస్వం త్యాగం చేయిడానికి కూడా సిద్ధంగా ఉండవలసియుంటుంది. ఇదేకఠినమయిన పని."

"మీరు కమ్యూనిస్టులా?"

"నిశ్చయంగా. కమ్యూనిస్టుయువజనసంఘసభ్యురాలిని."

గర్వంతో ఆమెకండ్లు మిలమిలలాడినాయి.

"ఈ'షాక్‌బ్రిగేడ్' ఏమిటి?"

"పార్టీలోని ఏదయినా ఒకదళానికి ఒకనిశ్చితకార్యక్రమాన్ని ఇచ్చినప్పుడు, వారుదానిని పూర్తిచేయగలుగుతే 'షాక్‌బ్రిగేడ్' అనేపేరిట సమ్మానిస్తారు. వారికి 'జయపతాక'నిస్తారు."

## ౧౪

'ట్రామ్' బాట వెంబడినే కొన్నిసందులు దాటి, మేము కొలది నిముషాలలోనే 'నైట్ శానటోరియం' చేరుకున్నాము. ఈసందులలో దీపసౌకర్యాలేమిలేక ఇంచుమించుగా చీకటికోణాలవలె ఉన్నాయి. 'శానటోరియం'లో మేము మొదట భోజనశాలలోకి వెళ్ళేము. 'సెంట్రల్ హీటింగ్' విధానంద్వారా గదులన్నిటిలోనికి వేడి కలుగచేయబడుతూంది. మార్గదర్శిక ఈసంస్థయొక్క 'ఇన్‌ఛార్జి'ని పిల్చుకువచ్చింది. ఆమెయే మాకు ఆసంస్థనంతను చూపించింది. మెట్లు ఎక్కేటప్పుడు ఒకగదిని మాకు చూపించేటందుకోసం కాబోలు కుడిచేతివైపున యున్న గది తలుపులు తోసి తెరిచింది. లోనయున్న ఒకఆడుది చీత్కారం చేయగానే ఏదో ప్రార్థించి, తలుపు మూసివేసింది. తరువాత మేము మెట్లు ఎక్కి పైకి పోయాము. మొదటిఅంతస్థులో మెట్లకి కుడిప్రక్కన ఒకచిన్న గదిఉంది. అచ్చటనే ప్రతిదినము ఆరోగ్యాశ్రమము (శానటోరియం) లో ఉండేవారు వైద్యపరీక్ష చేయబడతారు. వారి శరీరోష్ణము, నాడి, తూకము, మొదలయినవన్నీ సక్రమంగా వ్రాసుకోబడతాయి. ఇన్‌ఛార్జి స్వయంగానే ఈపని నిర్వహిస్తుంది. అక్కడనుంచి మేము కచ్చేరీసావడిలోకి వెళ్ళేము. ఇక్కడ రేడియోసెట్టు, వార్తాపత్రికలు ఉంచబడియు

న్నాయి. రాత్రి ఎనిమిదిగంటలు కావడంచేత సావడిలో ఎవ్వరూ లేరు. ఇన్‌ఛార్జి పడకగదులన్నీ తెరచి చూపించింది. స్త్రీలకు పురుషులకు వేరు వేరు గదులు ఉన్నాయి. అక్కడనున్నవారంతా పరిశుభ్రమైన తెల్లని శయ్యలమీద సుఖంగా నిద్రపోతూన్నారు. ఒకగదిలో నర్సువద్ద కొందరు పిల్లలు ఉన్నారు. రోగులంతా నిద్రపోతూ వుండడంచేత ఎవ్వరినీ ఏప్రశ్నలు వేయడానికి సాహసించలేకపోయాను. మేము అవన్నీ తిరిగి మరల క్రిందికి వచ్చేశాము. అక్కడ నాకొక చిన్నగది చూపించేరు. రోగులంతా కార్ఖానాలనుంచి వచ్చేటప్పుడు తమమురికి గుడ్డలన్నీ అచ్చట వదలివేస్తారు. ఇక్కడనుంచి చూస్తే శానటోరియంయొక్క ప్రధాన ద్వారం ఈమూలనే వున్నదనీ, మేము దొడ్డిదారిని భవనంలో ప్రవేశించామనీ, అందుచేతనే, మొట్టమొదట భోజనశాల మాకుకనిపించిందనీ, బోధపడింది. ఈమురికిగుడ్డలనుంచే గదిని ఆనుకొని స్నానాల గదివుంది. అక్కడ వేడినీటిగొట్టాలు చన్నీటిగొట్టాలుకూడా ఉన్నాయి. ఆడవాళ్ళకి మగవాళ్ళకి వేరువేరుగా స్నానపుగదులున్నాయనే జ్ఞాపకం. బహుశా ఇందాక మేము పైకివెళ్లేటప్పుడు శానటోరియంఇన్‌ఛార్జి (ఆడుది.) ఈగది తలుపునే తెరచి వుంటుంది. ఆసమయంలో అచ్చట స్నానంచేస్తూన్న ఒకామె గంద్రగోళపడి వుంటుంది.

కూలీలు ఈగదిలోనికి వచ్చి మురికిగుడ్డలు వదలి, ఆగదిలో స్నానంచేసి శానటోరియంలోని శుభ్రమైన బట్టలుకట్టుకొని, సావడిలో కాస్తసేపు విశ్రమించి పత్రికలు చదివియో, రేడియోవినియో ఆనందిస్తారు. ఏడున్నరకి భోజనం చేసుకొని, రాత్రియంతా అక్కడనే విశ్రాంతి తీసుకుని తెల్లవారగనే తమ పనులలోకి వెళ్ళిపోతారు. వారి మధ్యాహ్నభోజనాలు కార్ఖానాలలోనే. వారు సాయంకాలము లోపున ఈమూలకి రానేరారు. ఈవిధంగానే స్కూలుపిల్లలుకూడా ఇక్కడ

నివసిస్తారు. కాని, వీరి భోజనాలుమాత్రం ఆరున్నరకే అయిపోతాయి.

ఇక్కడ ఒకమాట చెప్పవలసియుంది. ఈ శానిటోరియం అన్నది హాస్పిటలుమాత్రం కాదు. అస్వస్థతగానున్న కూలీలు, రోగ భయంగలవారు, దుర్బలశరీరులు, శరీరపుష్టికోసం, ప్రత్యేకాహార విహారాల అవసరంకలవారు, దీనిలో ఉంచబడుతారు. ఇందులో చేర దలచినవారు కార్ఖానాడాక్టరునుంచి సర్టిఫికేటు సంపాదించాలి. స్కూలు పిల్లలయితే స్కూలుడాక్టరునుంచి తీసుకురావాలి. ఇక్కడ ఈయ బడేది సామాన్యభోజనమే. కాని, బీదవాని ఇంటిభోజనం కన్న పుష్టి కరంగా ఉంటుంది. ఇక్కడి పద్ధతులుకూడా బాగున్నాయి. గదులు, శయ్యలు, అన్నీ ఎంతో శుభ్రంగా వున్నాయి. యిందులో చేర్చు కున్నందుకు రోగులవద్ద ఏమీ తీసుకొనరు. దీని ఖర్చంతా భీమా శాఖయే భరిస్తుంది. రష్యన్‌ప్రభుత్వంయొక్క ఆరోగ్యశాఖవారు డాక్టర్లను ఇస్తారు. వారిజీతాలుకూడా భీమాశాఖ ఇచ్చుకోవలసిందే. రష్యన్‌కార్ఖానాలు ఇరువదినాలుగుగంటలూ పనిచేయడంచేత అందులో వంతులువారీగా పనిచేస్తూండేవారు, ఈశానిటోరియంకి వేరువేరు కాలా లతో వచ్చి పోతూంటారు. దేశానికంతటిలోకి మాస్కోజిల్లాలోనే ఈసౌకర్యాలు యెక్కువగా ఉన్నాయనీ, ఈజిల్లాలో యిలాంటివి ఆరు శానిటోరియములు ఉన్నాయని చెప్పేరు.

## ౧౫

ప్రొద్దుటే మేము ట్రాముమీద "సమాజగృహం"(Community house) చూడడానికి బయలుదేరేము. అక్కడి ప్రజలు — ఏవిధంగా ఉంటున్నారో, ఏమి తింటున్నారో, ఏమి చదువుతున్నారో, ఏవిధమైన వినోదాలలో కాలం గడుపుతున్నారో చూడాలని తోచింది. ఈ వేళ వాతావరణంలో వేడిమి సెంటిగ్రేడ్ థర్మామీటరులో సున్నకికూడా 9 డిగ్రీలు తక్కువగా వుంది. ఈ చలి రష్యనుల కొక లెక్కకాదు. "ఈమాత్రం నవంబరులోనే ఉంటుంది. ఈనెలలో సున్నకి 30 డిగ్రీలు తక్కువ ఉండాలసిందే. బహుశా ఈఏడాది అమెరికాలో మంచు ఎక్కువగా కురుస్తూ ఉండి వుంటుంది. అందుచేతనే ఇక్కడ ఇంత తక్కువగా ఉంది" అన్నారు అంతా.

యూరపుఖండముయొక్క ఉత్తర—మధ్యభాగాలలో శీతకాలపు రోజులలో సూర్యదర్శనం దుర్లభమే. అయినా, రష్యాలోమాత్రం దానికి విరుద్ధంగా కరకరా ప్రొద్దుపొడిచింది. ఎండకూడా తీవ్రంగానే ఉంది.

"సమాజగృహం" ట్రాంబాటకి పక్కనే ఉంది. దాని ముంగిట కాళ్ళకి కర్రలుకట్టుకొని మంచులో (Ski-ing skating) ఆడు

కుంటున్నారు. ఈముంగిరివాకలి వేసవికాలంలో సుందరమైన ఉద్యాన వనంలా ఉంటుందని తోచింది. 'గృహం' చాలాపెద్దది. పొయ్యిగడ్డల వలె ఒకదానికొకటికలసిన మూడుపెద్దభాగాలుగా కనిపిస్తుంది. భవనం అంతా అనేకభాగాలుగా విభజింపబడిఉంది. ప్రతిఒకభాగంలోను రెండేసి గదులున్నాయి. ఈగదులు నెలకి నలభై రూపాయల అద్దెతీసుకొని కూలీలకి ఇస్తారు. గదులు మామూలుగానే అలంకరించబడి చాలా పరిశుభ్రంగా ఉన్నాయి. 'సమాజగృహం'లో ఉన్నవారికొరకు సమ్మిళిత భోజనశాల, చాకలిదుకాణము, ఉన్నాయి. కాని, కమ్యూన్‌లోని సభ్యులు తోస్తే స్వయంగా వండుకొనికూడా తినవచ్చును. రెండున్నరఏళ్ల వయస్సు వరకుగల పిల్లలకోసం 'క్రెచీ' ఉంది. ఇదికూడా 'లెనిన్‌గ్రాడ్' లో ఉన్నట్లేవుంది. అంతకంటె ఇది చిన్నదిగా వుంది. అంతే. ఇందులో సంగీతోపకరణాలుకూడాలేవు. ఈ'క్రెచీ'లో పిల్లలు తిండితినడం చాల చమత్కారంగావుంది. నవ్వుకు చుట్టూ పిల్లలుచాలగంభీరంగా కూర్చుండి యున్నారు. వాళ్లు కొంచెం ఆవేగంతో నోరుతెరచుకొని తమవంతు కోసం ఎదురుచూస్తున్నారు. వారిశయ్యలు, బట్టలు, రుమాళ్లు చాలా స్వచ్ఛంగా ఉన్నాయి. ఆభవనంయొక్క ఒకశాఖలో రెండున్నరమొదలు ఆరేండ్లవయసువరకు గల పిల్లలకోసం ప్రాథమికపాఠశాల కిండర్‌గార్టెన్ స్కూలు ఉన్నాయి. వారివారి వయస్సుల్నిపట్టి పిల్లలు మూడుభాగాలుగా విడతీయబడి యున్నారు.

వానిలో ఒకతరగతిని చూచి చాలా సంతోషించేను. అది అందరికంటె చిన్నవయసుపిల్లలది. అధ్యాపకురాలు మధ్యన కూర్చుండియుండగా పిల్లలంతా చుట్టూ చేరేరు. ఒకడు మెడని కౌగలించుకున్నాడు. ఒకడు నడ్డిని వ్రేలబడుతున్నాడు. ఒకడు తనచిన్నిచేతులతో బుగ్గలు పట్టుకున్నాడు. అందరూ ఏమిటో అడుగుతున్నారు. ఆమె వాళ్లకి ఏదో

కథ చెప్పుతూందని చెప్పేరు. ఇక్కడ విద్యాప్రారంభం కథలతోనే చేయబడుతుంది. ఆకథలలో, పంచవర్షప్రణాళికయొక్క అద్భుతకార్యక్రమాన్నిగురించి, జారులు చేసిన దురంతాల్ని గురించి, రష్యాయొక్క భవిష్యత్తుని గురించి చెప్పుతూవుంది. రష్యాయొక్కఈభవిష్యన్నాగరికులు ఆకథల్ని ఎంతోశ్రద్ధగా వింటున్నారు. ఈఇంటికి సంబంధించి ఒక పఠనాలయము, నాటకశాల కూడా ఉందని చెప్పేరు. దగ్గరలోనే ఒక హైస్కూలుకూడా వుంది. సమాజగృహంలోని కుటుంబాల పిల్లలు ప్రారంభికపాఠశాలలను విడువగానే ఈస్కూలులోచేరి చదువుకోవచ్చును. రష్యాదేశం అంతటాకూడా నేడు సమ్మిళిత భోజనాలయాలు, స్కూళ్ళు, చాకలిదుకాణాలు, క్లబ్బులు, నాటకశాలలు, మొదలయినవానిని విశేషంగా స్థాపించడానికి ప్రయత్నాలు జరుగుతున్నాయి. వ్యవసాయంలోను, పరిశ్రమలలోను, కూడ ప్రత్యేకనిపుణుల్ని తయారుచేయడానికి బ్రహ్మాండప్రయత్నాలు చేస్తూంది. ఈసమాజగృహంలోని వారందరు హోదాలో సమానులే. వారిసంపాదనలు సమాజంలోని హెచ్చుతగ్గులకి కారణాలు కాజాలవు. భోజనాలయంలో అందరికీ ఒకటే భోజనం. 'క్రెచీ'లలో వారిపిల్లలు అందరూ సమానంగానే చూడబడతారు. స్కూళ్లలోకూడా ఇంజనీయర్లపిల్లలకి ఒకవిధంగానూ, కూలీలపిల్లలకి ఒకవిధంగానూ, బోధించరు. పిల్లల్ని కమ్యూనిస్టు పద్ధతులమీద పెంచుతారు. మొదటినుంచీ వ్యక్తిగతస్వార్థాన్ని చంపుకొని సమాజం (Commune) యొక్క అభివృద్ధికోసమే ప్రయత్నించాలని నేర్పుతారు.

౧౬

మేము నెమ్మదిగా నడచిమే హైస్కూలు దగ్గరకి వచ్చేము. మావలెనే చూడడానికి వచ్చిన యాత్రికదళం ఒకటి అక్కడ మాతో కలిసింది. వారిలో అమెరికనులే ఎక్కువమంది ఉన్నారు. మొట్టమొదట్లో మేమంతా ఒకగదిలోనికి వెళ్లేము. అచ్చట పిల్లలంతాకూడి 'పియానో' మీద పాటలు పాడుతున్నారు. ఒకమూల నొకమేజావుంది. దానిమీద కొందరు పిల్లలువంగి రేడియోసెట్టుయొక్క నిర్మాణాన్ని పరిశీలించి చూస్తున్నారు. స్కూలులో చదువుకూడా వంతులు వారీగానే జరుగుతూ వుంటుంది. ఒకదళం వ్యావహారికశిక్షణ (Practical) పొందుతూవుంటే రెండోదళం పాఠాలు నేర్చుకుంటూ వుంటుంది. ఇంతేకాకుండా పిల్లలంతా ఎన్నోదళాలుగా విభజింపబడియున్నారు. ఒక్కొక్కదళానికి ఒక్కొక్కవారము నిర్ణయించబడియుంది. రష్యాలో వారం అంటే ఆరు దినాలే లెక్కయని, సెలవులకని ప్రత్యేకంగా ఒకనిర్ణీతదినం లేదని వెనుక చెప్పేనుకదా? ఈపాఠశాల విషయంలో కూడా అంతే. ఒకదళం ఆదివారంనుంచి లక్ష్మీవారందాకా చదివి శుక్రవారం సెలవులోఉంటే ఇంకోదళం సోమవారంనుంచి అయిదురోజులూ వచ్చి శనివారం సెలవు తీసుకుంటుంది. స్కూళ్లు, ఫ్యాక్టొరీలు, నిరంతరాయంగా విజృంభణగా

సాగిపోవడానికే ఈపద్ధతి అవలంబించబడింది. ఈస్కూలులో మొత్తం మూడువేలమంది చదువుతున్నారట. వీరు ఒక్కొక్కదళంలో 1500 మందిచొప్పున రెండుదళాలుగా విభజింపబడ్డారు. ఈరెండుదళాలకి వేరు వేరువారాలు నియతము కావడంవలననే ఇంతమందికి చదువుచెప్పడం సులభం అయింది.

తమ వంతుకోసం నిరీక్షిస్తూన్న బాలురు వ్యర్థంగా కథుర్లతో కాలం గడపక, సంగీతశాలలో చేరి నేర్చినవారివద్ద సంగీతం నేర్చుకొనో, శాస్త్రీయవిషయాలు అభ్యసించో, కాలంసద్వినియోగం చేస్తారు. ఆడువాండ్రు—మగవాండ్రు కలిసియే చదువుతారు. ఒకవిద్యార్థిని పిలిచి ఒకపల్లెటిగేయాన్నీ, విప్లవగీతాన్నీ, పాడమని అడిగేము. అక్కడ వారికి పాఠాలు చెప్పుతూవున్న గురువు, మా కోరిక మన్నించేడు. గ్రామగీతం చాలావిధాల భారతీయగీతాలను పోలియున్నట్లే తోచింది. నాకు సంగీతం తెలియదు కనక ఆరనిగానం మనదేశపురాగాలు వేనితో కలుస్తుందో నాకు తెలియలేదు. కాని, అది మనదేశపుపాట మాదిరిగానే ఉంది. గ్రామగీతంయొక్క తాళం ప్రకారం కొందరు చప్పట్లు కొట్టుతూ చేతులు పట్టుకొని నాట్యం చేయసాగేరు. విప్లవగీతంలో కూడా మన దేశపుకళలు ఉన్నట్లే కనపడింది. కొన్నిశబ్దాల ఉచ్చారణకూడా ఇక్కడి పోలికగానే ఉంది. పూర్వపురష్యా, మతవిశ్వాసాల విషయంలో, జమీందారీ—సామంతరాజ పద్ధతులలో చాలవరకు మనదేశాన్నే పోలియుండేది.

ఇంకొకపెద్దసావడిలో విద్యార్థులకు (స్త్రీ—పురుషులు.) కవాతు, ఆటలు నేర్పబడుతున్నాయి. ఆసావడిలో ఇంచుమించు ఏభైమంది విద్యార్థులు ఒకచోట పోగయియున్నారు. వారిలో చాలమంది స్త్రీలే. నేనువారి గురువుతో మాటలు కలిపేను.

"మీస్కూలులోనున్న విద్యార్థులలో స్త్రీలెందరు? పురుషులెందరు?"

"నూటికి 70మంది స్త్రీలు 30మంది పురుషులు ఉంటారు."

"అయితే ఆడవాళ్లు మగవాళ్ళని ఓడించేసేరన్నమాట."

"నిజమే. ఆడుపిల్లలు చాలా తెలివి గాను, చురుకు గాను, ఉంటారు. వారు చులకనగా, త్వరలో, నేర్చుకోగలరు."

"మీరు చెప్పిన లెక్కల వలన మగవారు చదువుకొనడం లేదనుకొననా? లేక, స్త్రీలకంటె మగవాళ్ళు మీదేశంలోనే తక్కువగా ఉన్నారా?"

"కాదు. కాదు. ఈమధ్యవరకూ ఆడవాళ్ళని పాఠశాలలకి దూరంగా ఉంచేరు. అందుచేత నేడు వారిసంఖ్య ఎక్కువగా ఉంది. కాని, ఇతరపాఠశాలలలో, ఇక్కడ ఉన్నంత ఎక్కువగా లేరు."

విద్యార్థు లంతా ఆరోగ్యంగాను, ఉత్సాహంగాను ఉన్నారు. వారిని చూడగానే మనదేశపు విద్యార్థుల దీన—దుర్బలముఖాలు జ్ఞాపకం వచ్చేయి.

మమ్మల్ని ఒక్కొక్క గదిలోకే తీసుకొనిపోయి చూపించేరు. ప్రతిచోట క్రమశిక్షణ, ఔచిత్యం, తొణుకుతూవుంది. ఒకగదిలో పిల్లలకి ప్రోత్సాహం, దండన, ఈయబడుతూన్న విధానాలు చూపించబడినాయి. అక్కడ ఒక పెద్దబోర్డు వ్రేలాడుతూవుంది. దానిలో సగభాగానికి ఎరుపు రంగు, సగభాగానికి నలుపురంగు, పూయబడియున్నాయి. మంచి బాగుగా పనులు నిర్వహించిన బాలురపేర్లు ఎరుపురంగుమీద, చెడుపనులు చేసిన వారి పేర్లు నలుపురంగుమీద వ్రాస్తారు. ఇక్కడ "గోడ మీది పత్రిక"లు 'హస్తలిఖిత పత్రికలు' కూడ కనిపించేయి. విద్యార్థులచేత ప్రోగుచేయబడిన వార్తలు, సామయిక ప్రసంగాలు, సాహిత్యవిషయికలేఖలు, పంచవర్షప్రణాళికప్రకారం ప్రతిశాఖలోను కలిగినహానివృద్ధులు, పిల్లవాడు

పాఠాలు చదవకపోయినా సోషలిస్టులకు వ్యతిరేకములయిన అభిప్రాయాలు కలిగిఉన్నా అతని ప్రవర్తనను గురించిన విమర్శనలు, ఈపత్రికలలో ప్రకటించబడుతూ వుంటాయి. రష్యను విద్యార్థుల్ని శిక్షించేటందు కుపయోగించబడుతూన్న కొరడాలివే. ఎవ్వరినీ కొట్టరు. ఎవ్వడయినా విధ్యార్థి తప్పుచేస్తే ఆతనిని విచారించడానికి విద్యార్థులచే నడుపబడే "మిత్రుల న్యాయస్థానం" ఉంది. ఓషధిశాస్త్రాన్నిగాని, దానికి సంబంధించిన ఇతరవిషయాల్నిగాని, నేర్చు కుందుకు, బ్రదికియున్న చెట్లు, చెట్ల బొమ్మలు, కూడా యున్నాయి. ప్రతివిద్యార్థి ఏదోఒక విదేశభాషని — ఇంగ్లీషు—జర్మను—ఫ్రెంచి భాషలలో వేనినయినా నేర్చుకోవలసిందే. పదమూడు పద్నాలుగేండ్ల పిల్లలకే రాసాయనికశాస్త్రాలు, భౌతికశాస్త్రాలు, ఓషధిశాస్త్రం నేర్పబడుతున్నాయి.

అన్నిటికంటె అడుగు అంతరువులో వుంది, యంత్రసామగ్రిగల గది. ఇచ్చట విద్యార్థులు చేతులతోనే యంత్రాలు తిప్పి సామాన్యములైన వస్తువులు తయారుచేస్తూవుంటారు. ఈకార్ఖానాలో ప్రతివిద్యార్థి రోజుకు రెండుగంటలు పనిచేసి తీరాలి. వీరిని వారానికి నాలుగుగంటలపాటు ఏదయినా పెద్దకార్ఖానాలోనికి పంపి, పని నేర్పిస్తారు. ఇక్కడి విద్యార్థులచే నడపబడిన 'హస్తలిఖితపత్రిక' యొక్క కొన్ని ప్రతులు నాకిచ్చేరు. ఆపిల్లలు వ్రాసి జాగ్రత్తపెట్టుకొన్న డైరీలుకూడా చూపించేరు.

పంచవర్ష ప్రణాళికప్రకారం ఏయేసంవత్సరాలలో ఎంతెంత అభివృద్ధి ఏయేశాఖలలో కలిగించాలో ముందు నిర్ణయించి, ఆఅంచనాలని ఆయాశాఖల ప్రధానకార్యాలయాలకి పంపిస్తారు. అచ్చట, ఆయాశాఖలు తమ అధికారంలోవున్న యూనిట్లకీ మరల అంచనాలు తయారుచేసి పంపిస్తారు. ఈయూనిట్లు తమ అధీనంలోఉన్న దళాలకి, మరల పని విభజించి అంచనాలు తయారుచేసి పంపిస్తారు. ప్రతిదళము తన సభ్య

లలో, తనకీయబడినపనిని పంచిపెడుతుంది. ఈవిధంగా పంచవర్షప్రణాళికయొక్క కార్యక్రమాన్ని ప్రతికూలి, ప్రతివిద్యార్థి, ప్రతికళాకారుడు, ప్రతిఇంజనీయరు, ప్రతిరైతు, ఒక ప్రత్యేకభాగాన్ని నిశ్చితరూపంలో నిర్వహించవలసిన బాధ్యత కలిగియున్నాడు. అందుచేతనే ప్రతివిద్యార్థి డైరీని జాగ్రత్తపెట్టుట తప్పనిసరి అయింది. దీనివలన ప్రతిమనిషి తనకు నియమించబడిన పనినిఎంతవరకు నిర్వహించేదో స్పష్టంగా తెలుస్తుంది. స్కూళ్ళలో, కార్ఖానాలలో, సమిష్టిక్షేత్రాలలో అన్నిచోట్ల "షాక్ బ్రిగేడ్లు" సిద్ధం అయినాయి. కొంతమంది విద్యార్థులు "ఇజ్వెస్టా" "ప్రావదా" పత్రికలలోనుంచి "లెనిన్—స్టాలిన్" మొదలయిన దేశనాయకులచిత్రాలు కత్తిరించి "గోడమీదిపత్రికలకు" అంటిస్తూండగాచూచి చాలా ఆశ్చర్యపడ్డాను. ఉపాధ్యాయులుగాని, ఉపాధ్యాయినులుగాని, తమపెద్దతనం చూపించక పిల్లలతో కలసిమెలసి తిరుగుతున్నారు. ఒకప్పుడు విప్లవ ప్రారంభదినాలలో పంతుళ్ళు విద్యార్థులచేతనే పాలించబడేవారు. పాఠ్యక్రమాన్ని నిర్ణయించడం, బోధనాక్రమాన్ని నిర్ణయించడం, పంతులును నియమించడం, త్రోసివేయడం, విద్యార్థిసంఘాలు చేస్తూండేవి. పంతులువార్లకు అవి చాలా దుర్దినాలు. కాని, నేడు వారిస్థితి బాగుపడింది. వారికి జీతాలు బాగా ముట్టుతున్నాయి. ప్రభుత్వం వారిని గౌరవిస్తూంది. "పల్లికుపాఠశాలల ఉపాధ్యాయులికి ఎప్పుడూ లభించిఉండనంత ఉన్నత స్థానం ఈయబడాలి" అంటూ 'లెనినే' ఆదేశించేడు. రష్యనులు తమ నాయకుని మాటలలోగల యాథార్థ్యాన్ని బాగా గ్రహించగలిగేరు. పూర్వం అధ్యాపకుల్ని బూర్జువాలనుగాచూసి వారిపిల్లల్ని కూలీలపిల్లల తర్వాతవారినిగా చూసేవారు. కాని నేడు వారికట్టి యగౌరవం కలుగ చేయబడడంలేదు. విద్యార్థులలో నూటికి 33 మంది రైతుబిడ్డలు 50 మంది కూలీలపిల్లలు అయివుంటారు. భూస్వాములు పూర్వపు

అమీర్లు మొదలయినవారిపిల్లలు, రెండేళ్ళకి తక్కువకాకుండా ఏకార్ఖా నాలో నయినా పనిచేసి, నూతనసమాజానికి ఉపయోగిస్తారని 'సర్టిఫికెటు' సంపాదిస్తేనే పాఠశాలలలో చేర్చుకోబడతారు.

రష్యాలో విద్య చాలా తీవ్రగతితో వ్యాపిస్తూంది.

"చదువుకున్న వారుంటే గాని రాజనీతి నడువదు. నిరక్షరాస్యులకి నీలివార్తలు, కోతలు, అంధవిశ్వాసాలు, అబద్ధపుగాధలు తప్ప మరి ఇతరాలు బోధపడవు. వీనికీ, వర్గవైరన్యానికీ, చాలా దూరం వుంది" అని లెనిన్ ఒకమారు చెప్పేడు. అందుచేత జనానికంతకీ సోషలిస్టు ఆదర్శాలు వంటపట్టించేటందుకు జనసామాన్యాన్ని విద్యావంతుల్నిగా చేయడానికి ప్రభుత్వం సర్వశక్తులు వినియోగిస్తూంది. ఈ ప్రయత్నాలు కొంతకాలం చాలా తప్పుదారుల నడిచినాయి. బోల్షివికులు తర్వాత తమతప్పుగ్రహించేరు. వారు తాముచేస్తూన్నది తప్పని తెలియగానే దిద్దుకుంటుకు వెనుక ఆడరు. 1932 లో కమ్యూనిస్టుపార్టీయొక్క కేంద్రకార్యకారిణీసమితి అంతవరకూ అవలంబించబడుతూన్న విధానం తప్పని సూచించింది. రాజనీతి నేర్పడంలో భూగోళం, చరిత్ర, గణితం, సాహిత్యం, శాస్త్రాలు మరచిపోవడంగాని, అశ్రద్ధచేయడం గాని, పొరపాటని సూచించింది. అంతవరకు విద్యార్థులకు కేవలం కొన్ని రాజనీతివాక్యాలు, విప్లవనినాదాలు, జారుల అన్యాయకథలు మాత్రమే నేర్పబడేవి. పూర్వసమాజంలో గౌరవంగా చూడబడిన ప్రతి వస్తువును, సంగీతాన్ని, నాటకాలను, చరిత్రనుకూడా తన్నిపారవేశారు. తరువాత వారుచేస్తూన్న పొరపాటు గ్రహించేరు. అందుచేత విద్యార్థులు విజ్ఞానవంతులు కావడానికి తోడుపడే పద్ధతిలో పాఠశాలలను మార్పుచేశారు.

స్కూళ్ళలోను, కాలేజీలలోను, చదువుకొంటూన్న విద్యార్థుల

సంఖ్యలనుచూస్తే రష్యాలో విద్యావ్యాప్తి ఎంత తీవ్రంగా జరుగుతూందో తెలుస్తుంది.

"వేరువేరు విద్యాసంస్థలలో విద్యార్థుల సంఖ్యలు"

| | 1924–25. | (ఇంచుమించు) 1932 లో |
|---|---|---|
| ప్రారంభికపాఠశాలలు | 70,00,000. | 1,90,00,000. |
| సెంకండరీ | 5,00,000. | 45,50,000. |
| యూనివర్సిటీ | 1,25,000. | 5,00,000. |
| వ్యవసాయము | 1600. | 2,07,800. |
| పరిశ్రమలు | 2,67,000. | 8,50,000. |

నేడు రష్యాలో 8 మొదలు 11 ఏండ్లవయస్సువరకుగల బాల బాలికలు చదువుకొనుట తప్పనిసరి. 1933 లో ఆహద్దు 12 ఏండ్ల వరకు పెంచినారట. మాస్కోలో 15 ఏండ్లువచ్చేవరకు స్కూలుకు వెళ్ళడం తప్పనిసరి.

ప్రభుత్వభాషయని ఒక నియమం లేదు. ఏప్రాంతాలకాప్రాంతాలు తమ ప్రాంతీయభాషలనే పాఠశాలలలో ఉపయోగించుకొనేటందుకు అధికారం కలిగియున్నాయి. రష్యాఅంటే చిన్నదేశం కాదు. ఒక మహా ఖండమంత దేశం. అక్కడ భాషలకి కూడా లోపం లేదు. అందుచేత ఈస్వాతంత్ర్యము విద్యాభివృద్ధికి బాగా తోడ్పడింది. రష్యాలో చాలా భాషలకి —జిప్సీ, బుగ్యత్, మొదలయినవానికి—లిపియే ఉండేది కాదు. అటువంటి భాషలలోకూడా నేడు పుస్తకాలు, పత్రికలు, శబ్దకోశాలు, ఎన్నో ముద్రించబడియున్నాయి. నేడు రష్యాలో ఇంచుమించు 70 భాష లలో పాఠశాలలు నడిపించబడుతున్నాయి. తక్కువ జీతాలు తెచ్చు కుంటూన్న కూలీంపిల్లలకీ మధ్యాహ్నభోజనం పాఠశాలలో ఉచితం గానే పెట్టుతారు. ఇతరుల పిల్లలనుండి ఒకపూట భోజనానికి 12 కోపె

క్కులు మొదలు 25 కోపెక్కులువరకు వసూలు చేయబడుతుంది. (100 కోపెక్కులు=1 రూబులు=రు 1—9—6 లు)

హైస్కూలు పాఠ్యక్రమమంతా పూర్తిగావాలంటే పదిసంవత్సరాలు పడుతుంది. కాని, ఈహద్దు 12 సంవత్సరాలు చేస్తారని చెప్పేరు. కొంచెం వయస్సువచ్చిన పిల్లలు రోజుకు ఆరుగంటలు, చిన్నపిల్లలు నాలుగుగంటలు, చదువుకోవలసియుంటుంది. నాతోనున్న అమెరికను యాత్రికుడు బీటలువారిన గోడలు, బ్రద్దలయిన గచ్చుచూపించి,

"వీటిని చూడండి. ఈ భవనం కట్టి ఇంకా అయిదారేళ్ళకు మించలేదు.కాని. త్వరగా కావాలనిఎల్లాపాడుచేశారో. వీళ్ళు తొందరపాటువలన, అజ్ఞానంవలన, ఎంతోధనం తగులపెట్టేశారు."

అన్నాడు. ఆభవనం కొత్తగాకట్టినదేయని నా మార్గదర్శిక చెప్పింది. కాని, చూపులకిమాత్రం ఏభై ఏళ్ళకి పూర్వపుదివలె ఉంది.

## ౧౨

మధ్యాహ్నభోజనం అయినతరువాత 'ప్యాస్‌పోర్టు తెచ్చుకొనడానికి, నాహోటలు నానుకొనియే ఉన్న యాత్రికశాఖవారి కార్యాలయానికి వెళ్లేను. నాపూగ్గవర్శిక ఆపని చూస్తూంటే నేను తీరుబడిగా గోడలపై అతికించిన ప్రకటనలను పరిశీలించసాగేను.

"హల్లో! ఆరోగ్యంగా ఉన్నారా?" అని ఉత్సాహపూర్ణమైన పలుకు వినిపించింది. నేను వెనుక తిరిగి చూశాను. ఆమాటలాడినది ఒకసుందరియగు పడుచు. నేనామెను గుర్తించనే లేకపోయాను. నా తెలివి మండా. ఆమె తీక్ష్ణదృష్టులు నా ఆరాటాన్ని కనిపెట్టివేశాయి.

"మీరు నన్ను గుర్తించలేకపోయారు? అబ్బే! ఇంత మరుపు కూడదు. మిమ్మల్ని చూస్తూనే గుర్తించగలిగేను. మీపేరు 'బెన్‌రఈ' కాదు? ఏమిటి?"

ఆమె మాటనిజమే కాని, ఎవ్వరు ఈవిడ? ముఖం ఎరిగినట్లే తోస్తూంది. ఈమెను ఎక్కడ చూసేను?

"నేనే మిమ్మల్ని ఆరోజున స్టేషనునుంచి తీసుకువచ్చేను. ఇంత త్వరగా మరువకూడదు సుమండి. అబ్బే."

అని మధురస్వరంతో మెరుస్తూన్న కళ్ళు తిప్పుకుంటూ మంద

లించింది.

ఓహో! ఔను. ఇప్పుడు జ్ఞాపకం వచ్చింది. నా మతిభ్రష్టతకి నేనే చాలా సిగ్గుపడి ఆమెను క్షమార్పణము కోరుకున్నాను.

"ఇక్కడ ఎవరికోసం నిల్చున్నారు?"

"మార్గదర్శిక ప్యాస్‌పోర్టు తీసుకురావడానికి వెళ్ళింది."

"మీరు ఈవేళ వెళ్ళిపోతారా?"

"బహుశా రేపు వెడతాను."

"బాగుంది. ఉండండి. ప్యాస్‌పోర్టు తెచ్చిపెడతాను."

అంటూనే మెరపులా అదృశ్యం అయింది.

రష్యనులు చాలా అందంగా ఉంటారు. వాళ్ళముఖాలు బలిష్ఠంగాను, సుందరంగాను ఉంటాయి. మహాస్వతంత్రులు. ధారాళమైనవారు. స్పష్టంగా మాట్లాడుతారు. ఈరష్యనుస్త్రీలకు, పారిసు, బర్లిను, నగరాలలోని, దుస్తులు లభిస్తే, వారికన్న అందమైనవాళ్ళు యూరపుఖండంలోనే ఉండరు.

మార్గదర్శికతోకలిసి నేను 'పెట్రోవ్‌కా' వీధిలోనున్న 'టార్గసిన్' చూడడానికి బయలుదేరేను. ఈ'టార్గసిన్' అనేది విదేశీయులకోసం నిర్మించబడిన దుకాణం. విదేశీయులు తమరష్యాప్రయాణమునకు చిహ్నరూపంగా ఈదుకాణంలో ఏవయినా కొనుక్కోవచ్చును.

అదయినా హోటలకు ఆట్టేదూరంలో లేదు. అందుచేత కాలినడకనే బయలుదేరేము. దారిలో పొడుగైన బూడిదరంగు కోట్లుతొడిగిన పటాలపుసిపాయీలు కొందరు ఎదురైనారు. మార్గదర్శిక వారిని చూపిస్తూ "వారే మా రక్తకవచదళసభ్యులు." అంది.

"వీరి దుస్తులు బూడిదరంగుగా ఉన్నాయేమి, మరి?"

"విప్లవదినాలలో ఎర్రగానే ఉండేవి. కాని, నేడు ఈలాగే

ఉంటున్నాయి.''

''ప్రభుత్వం వీరిని చాలా శ్రద్ధగా పోషిస్తూందని తోస్తూంది. వీళ్ళకి బట్టలు చాలా ఉన్నాయి. ముఖాలు చూస్తే తిండికూడా బాగున్నట్లే తోస్తుంది."

"వీళ్ళ పెద్దకోట్లు రెండేసి కూలీదుస్తులు అవుతాయి. ప్రభుత్వం వీరిమీదనే ఆధారపడి యుండడంచేత వీరిని జాగ్రత్తగానే చూస్తున్నారు."

"టార్గసిన్'' ఒకపెద్ద దుకాణం. అందులో తినుబండారాలు, దుస్తులు, బూట్లు, పాత్రసామాను, పుస్తకాలు, ఫొటోగ్రాఫులు—అన్ని రకాల వస్తువులు అమ్మబడుతాయి. దుకాణం చాలా పరిశుభ్రంగా వుంది. సరుకులు కూడా అందంగా అమర్చబడియున్నాయి. యూరపులో ఇతర నగరాలలో ఉండే మంచిమంచి దుకాణాలకి, దీనికి, తేడాఏమీలేదు. రష్యాలో ఇతరప్రదేశాలలోకంటె ఇక్కడ వస్తువులు విదేశీయులకు చౌకలో దొరుకుతాయి. డాలర్లు—పౌనులు మొదలయిన నాణేలు కూడా తీసుకుంటారు. నేను హోటలులో పదిషిల్లింగులిచ్చి కొన్న సీమరేగు పండు ఇక్కడ మూడు నాలుగుపెన్నీలలో వస్తూంది. కాని, విలాసవస్తువులు ఇక్కడకూడా ప్రియమే. కర్రతో చేసిన మామూలు సిగర్‌పెట్టెకి రెండుపౌనులు పుచ్చుకొన్నారు. 'మారిస్ హిండస్' వ్రాసిన 'Humanity uprooted' పదిషిల్లింగులు, ఒక్కచిన్నరుమాలుకు రెండో మూడో పౌనులు వసూలు చేశారు. 'వైలూటా' (విదేశీ) నాణేలు గలవారికి ఇక్కడ సామాను చవకగా ఉంటుంది. ఇది విదేశీయులకే ఉద్దేశించబడింది. కాని, రష్యనులుకూడా ఇక్కడ కొనుక్కుంటూ ఉంటే చూసేను. ప్రశ్నించినమీద విదేశాలలోనున్న బంధు—మిత్రులకోసం, వారు కొంటున్నారని తెలిసింది. యాత్రికులు, రష్యాను విడిచేటప్పుడు ఈ'టార్గసిన్' యొక్క 'క్యాష్‌మెమో' లో లేని వస్తువులు తీసుకుపోనీయ

బడవు. మారకం లెక్కకట్టి డబ్బు వసూలుచేస్తూన్న షరాబు తెలివితేట లయినవాడుగా తోచలేదు. లెక్కలు తేల్చేటప్పటికి చాలా కాలము పట్టుతూవుంది. ఒకమాటికీ, ఇంకొకమాటికీ, ధరకట్టడంలోకూడా లేడా కనపడుతూంది. ఒక్కొకప్పుడు పౌనుకి ఏడున్నరరూబుళ్లు లెక్కకట్టులాడు. అప్పుడే మరొకదానికి ఆరున్నరో, ఏదో, రూబుళ్లు అంటాడు. 'లెనిన్ గ్రాడ్'లో నేనున్న హోటలులోనే ఈమాదిరి దుకాణం ఒకటివుంది. కాని, అక్కడ ఈ'టార్గసిన్' యొక్క పేరైనా వినలేదు.

రష్యనులు తమవద్దనుండే రూబుళ్ళతో ఈ'టార్గసిన్'లో సరుకులు కొనడం సాధ్యపడదు. వారికోసం 'కోఆపరేటివ్ స్టోర్సు' ఉన్నాయి. మూడువందలకు తక్కువగాని సభ్యులు ఏకమై, 'కోఆపరేటివ్ స్టోర్సు' తెరువ వచ్చు. 'Centrosoyus' (సెంట్రల్ కోఆపరేటివ్ స్టోర్సు) ఏకమొత్తంగా చాలాసరుకు తయారుచేయించి వానిని 'జిల్లాస్టోర్సు'కి పంచిపెడుతుంది. కార్యదాయకసంస్థలు తింటిపెట్టని ప్రజలకోసం ఈస్టోర్సు భోజనాలయాలు నడిపిస్తాయి. దేశంలోని చిల్లరసరుకులలో నూటికి 65పాళ్ళు ఈకోఆపరేటివుల చేతిలోను 30పాళ్ళు ప్రభుత్వం చేతిలోను 5పాళ్ళు వ్యక్తుల చేతులలోను ఉన్నాయి.

మేము తిరుగుతూ తిరుగుతూ 'స్వేర్డులోవ్ స్క్వేర్' లోని వచ్చేము. దీనిని పూర్వం 'థియేటర్ స్క్వేర్' అనేవారు. దీనికి ఒక పార్శ్వాన 'గ్రేండ్ థియేటరు'యొక్క విశాలసుందరభవనం ఉంది. ఇంకొకమూల ఒక చిన్న థియేటరు ఉంది. ఇచ్చటనే ఒకఆఫీసులో మార్గదర్శిక నా కో స ం రైలుటిక్కెట్టు కొని 'పడక' ఆకట్టించింది. ఈపనికికూడా చాలా సమయం ఖర్చు అయింది. ఈఆలస్యంకి కారణం రష్యను ఉద్యోగుల అసమర్థతయే. ఇక్కడనుంచి కాలినడకనే 'లెనిన్ ఇన్టిస్ట్యూట్' 'స్వాతంత్ర్య స్తంభము' ఉన్న చోటికి వచ్చేము.

ఈస్తంభము 1917 లో పొందిన విజయానికి చిహ్నరూపంగా నిర్మించ బడింది. 'లెనిన్ ఇన్స్టిట్యూట్' అన్నది ఒక గొప్పగ్రంథాలయము. ఇది ప్రపంచంలోనికెల్ల పెద్దది. దీనిలో ఏబదిలక్షలు పుస్తకగ్రంథాలు సేకరించబడియున్నాయట. సర్వనాశంచేసివేసేరని తిట్లుపడే బోల్షివిక్కులు నిర్మించిన ఉత్తమసౌధాలలో ఇదియొకటి. 'విప్లవవస్తుప్రదర్శనశాలను' 'చారిత్రకవస్తుప్రదర్శనశాలను' చూసుకుంటూనే ముందుకు వెళ్ళేము. కాని, కాలం లేకపోవడంవలన వానిని సరిగా పరిశీలించలేకపోయాను.

యూ. ఎస్. ఎస్. ఆర్. యొక్క 'గైడ్ బుక్' ద్వారా రష్యాలో 'వోక్సు' అనే సంస్థ ఉన్నదని, అది విదేశీయులతో వైజ్ఞానికసంబంధం ఎక్కువ చేయడానికే ప్రయత్నిస్తూందని తెలుసుకున్నాను. దానికి రాజనీతితో ఏమి సంబంధం లేదట. ఈసంస్థయే రవీంద్రకవీంద్రుని రష్యాకు రప్పించింది. ఈసంస్థ దేశదేశాలలోని కవులతో, తత్వజ్ఞులతో, నటులతో, నర్తకులతో, కళాకారులతో ఇతరవిషయాలలో పరిపూర్ణులయిన వారితోను, సంబంధం ఏర్పరుచుకొని, వారి స్నేహ, సంపర్కాలవలన నేర్చుకోవలసినవి గ్రహించి రష్యను విజ్ఞానాభివృద్ధికి తోడ్పడుతుంది ఈసంస్థయొక్క చిరునామా—

'17, Trubnikovski Pereulok, Moscow, 69.'

నేను నామార్గదర్శికతో కలిసి ఈసంస్థచూడడానికి వెళ్ళే నేనెవ్వరితోనయినా మాటలాడడానికి వచ్చేనని, రష్యను విజ్ఞా రష్యనురాజ్యాంగవిధానాన్ని గురించి తెలుసుకోదలచియున్నానని ఇ తెలిసిన వారు కావాలని మార్గదర్శిక అచటివారితో చెప్పింది. సేపటిలో ఒకముసలియాతడువచ్చి రష్యనుఏసగల ఇంగ్లీషు ఆఫ్టర్ నూన్' అని పలకరించేడు.

నేను హిందూదేశాన్నుంచి వచ్చియుండడంచేత ప్రాచ్య

శాఖాధికారి పంపించబడినాడు. కాని, పాపం ఆయనకి ఇంగ్లీషుబాగా రాదు. అందుచేత మార్గదర్శిక సహాయం తప్పిందికాదు. ఈసంస్థ "Soviet Culture Review" అనే మాసపత్రికను, "Socialist Construction in U. S. S. R" అనే వారపత్రికను ఇంగ్లీషు, ఫ్రెంచి, జర్మను భాషలలో ప్రకటిస్తూంది. రష్యాలో ఏమిజరుగుతూ వుందో, అచ్చట యేవిధమైన అభివృద్ధి కలుగుతూందో, నిజమైన వార్తల్ని ఇవి విదేశీయులకు తెలుపుతాయి. ఈసంస్థవారు నాకీపత్రికల సంచికలను ఎన్నిటినో ఇచ్చేరు.

"మీదేశంలోని విజ్ఞానాభివృద్ధిని, దేశాభివృద్ధిని, కూడా నాకళ్ళతో చూసేను. ఆవిషయంలో మిమ్మల్ని ప్రశ్నించి పీడించను. కాని, రష్యాలోని రాజ్యాంగవిధానం నాకొక మహాసమస్య అయిపోయింది. 'రిఫరెన్సు' పుస్తకాలు చూస్తే సోవియట్లదే పరిపాలనలా కనిపిస్తుంది. ఏసోవియటులోను పూచీగల ఉద్యోగాలలో 'స్టాలిన్' పేరు కనపడదు. కాని, ఆతడే 'డిక్టేటర'ని అంతా చెప్పుతారు. ఏమిటిది ?"

ఈవృద్ధుని సమాధానాలు మార్గదర్శిక అనువదించి నాతోచెప్పింది.

"'స్టాలిన్' కమ్యూనిస్టుపార్టీకి. కార్యదర్శి. ఆయనకు 'సోవియటు యూనియను'తో ఏమీ సంబంధం లేదు. ఈయూనియనులో స్వతంత్రిము పొందిన నలభై రెండు రాష్ట్రాలు ఉన్నాయి. వానిలో తొమ్మిది మాత్రం సోవియటుసంఘముగా ఏర్పడినాయి. మిగిలినవానిలో స్వతంత్ర ప్రజాతంత్రాలు (Autonomous Republics). స్వతంత్రరాష్ట్రాలు. (Autonomous Regions) ఆంతరికవిషయాలలో నలభై రెండు భాగాలుకూడా సర్వస్వతంత్రాలు."

"ఆంతరికవిషయాలంటే"

"దేశంలోని శాసనాలు, ఆరోగ్యము, విద్య, విజ్ఞానము, పరి

శ్రమలు, మొదలయినవి. కాని, ఆర్థికవిషయాలలో, కూలీలవిషయంలో యూనియనుతో సలహా చేయనిదే ఏమీ చేయకూడదు. అంతరరాష్ట్రీయ విషయాలలో యూనియనుయొక్క కేంద్రకార్యనిర్వహణసమితిదే పూర్ణాధికారం ."

"మీఉద్దేశం. మిలిటరీ, రక్షణసైన్య, విదేశాంగనీతులనియా?"

"ఔను. వీనితోపాటు రహదారిసాధనాలు, విదేశవర్తకం, సివిలు, మిలిటరీశాసనాలు, ఆర్థికప్రణాళికలు. మొదలైనవి కేంద్రసంస్థ ద్వారానే జరుగుతాయి."

"అయితే, ఇంక ఆభాగాలకున్న స్వాతంత్ర్యం ఏమిటి? వ్యవహారంలోకి వచ్చేటప్పటికి అన్నీ దానిసత్వంలోనే ఉంటాయి."

"అదేలాగ?"

"బ్రిటిషుప్రభుత్వంకూడా భారతదేశానికి ఈమాదిరి స్వాతంత్ర్యమే ఈయడానికి సిద్ధంగా వుంది. స్వాతంత్ర్యానికి కీలకాలవంటి, ఆర్థికవిభాగాన్ని, వైదేశికశాఖని, సైన్యాల్ని, యుద్ధపుటోడల్ని, తమచేతిలో ఉంచుకొని మిగిలినవన్నీ భారతీయులకి ఈయడానికి సిద్ధంగా ఉన్నారు. కాని, మేము అంగీకరించడం లేదు. ఒకవేళ భారతదేశం మీయూనియనులో చేరుతానంటుందనుకొనండి. దానివలన మాకు వచ్చే లాభం ఏమిటి? ఈమాత్రపు టధికారాలు, బహుశా ఇంతకంటె ఎక్కువ అధికారాలే బ్రిటిషువారు ఇస్తామంటున్నారు కదా?"

"కాని, మాదేశాలు ఇష్టం లేనప్పుడు యూనియనునుంచి విడిపోవచ్చును."

"ఈషరతు అన్నిదేశాలలోను కాగితంమీద ఉంటుంది. కాని ఏప్రజాతంత్రాన్ని చులకనగా మీయూనియనునుంచి విడిపోనిస్తారని నేననుకొనను. 'అజర్‌బైజన్,' 'ఆర్మీనియా' 'జార్జియా' రాష్ట్రాలు స్వతంత్రం

ప్రకటించడం మళ్లీ అచ్చట సోవియటులధికారాన్ని స్థాపించడం మీరె రగరు?"

"పోలండు, ఫిన్లాండు, ఇస్తోనియా, లిథుయేనియా, లిట్వియాలు తమప్రత్యేకప్రజాతంత్రాలను స్థాపించుకుంటామన్నపుడు మేమేమి అడ్డం చెప్పలేదు."

"కాని, మీరు ఔదార్యంకొలదీ ఊరుకోలేరు. ఆరోజులలో ఏమి చేయడానికి మీలో శక్తిలేదు."

మార్గదర్శిక ఓడిపోయినట్లుగా చేతులెత్తింది. ఆమె ఆస్వరూపం చూసి అంతా నవ్వేరు. అప్పుడు జ్ఞాపకం వచ్చింది. నేనున్నది, రష్యాలోనని. 'యూనియన్'ను తిరస్కరిస్తూ మాటలాడడంలో ఎటువంటి ఆపదలున్నాయో ఎవరికితెలుసును?

"సరే, మీశాసకసంస్థల కార్యవిధానం ఏమిటి?"

"కేంద్రకార్యకారిణీసమితుల సంఘం" (Union of central Executive committee) రెండు భాగాలుగా విభజింపబడిఉంది. ఒక దానిని "సోవియట్ ఆఫ్ యూనియన్సు" అంటారు. దీనిలో ప్రతిరాష్ట్ర యూనియనుయొక్క జనాభానుపట్టి ఎన్నుకోబడిన నాల్గువందలమంది ప్రతినిధులు ఉంటారు. రెండవది "సోవియట్ ఆఫ్ నేషనాలిటీస్" అంటారు. దీనికి రష్యాలో నివసిస్తూన్న జాతుల నుండి ప్రతినిధులు వస్తారు. ఈవిధంగా కేంద్రసమితిలో యూనియన్ల ప్రతినిధులు, జాతుల ప్రతినిధులుకూడ ఉంటారు.

"సోవియట్ ఆఫ్ నేషనాలిటీస్" లో సభ్యు లెందరుంటారు?"

"ఇంచుమించు నూటమున్నైమంది. సంఘములుగా ఏర్పడిన ప్రతి రాష్ట్రము 'రాజ్యాంగ' ఆర్థిక, వైజ్ఞానిక,' విషయాలలో సర్వస్వతంత్రా లని చెప్పేనుకదా? మాదేశాన్ని జాతిభేదాల్ని పట్టిచూస్తే 185 భాగాలుగాను

భాషాభేదాన్ని పట్టి చూస్తే 147 భాగాలుగాను, మతభేదాల్ని చూస్తే ఇంకా ఎన్నోభాగాలుగాను, విభజించవచ్చు. మొదట్లో రష్యనుభాషే రాజభాషగా ఉండేది. ఇతరభాషలకి రాజకీయరంగంలో నిషేధం ఉండేది. ఇప్పుడు ప్రతిజాతికి ప్రతిశాఖకి తనతనస్వభాష ఉపయోగించుకుందుకు అధికారం ఈయబడింది. దేశంలో ఒక్కభాగంయొక్క వృద్ధికోసం ఇంకొకభాగాన్ని ఉపయోగించడం అనేది నిషేధించబడింది. ప్రతిప్రజాతంత్రము తనరాష్ట్రం లోని ప్రాకృతికసంపదన్ని స్వేచ్ఛగా అనుభవిస్తూంది."

విధానం బోధపడింది. కాని, కమ్యూనిస్టుపార్టీ విషయం ఇంకా మనస్సులో బెరుకుతూనే వుంది. దానికి వచ్చిన సమాధానం అంత సంతృప్తి కరంగా లేకపోవడంచేత మరల ప్రశ్నించేను.

"అయితే 'స్టాలిన్' ఎవరు? కేంద్రశాసనసభతో ఆయనకున్న సంబంధం ఏమిటి?"

"ఏమీ సంబంధం లేదు."

"అయితే ఆయనను డిక్టేటరు అంటారేం?"

"డిక్టేటరు గనకనే."

"ఈసోవియట్లు అనీ. ప్రజాతంత్రాలనీ. ఈనాటకం అంతా ఎందుకు? ప్రజలచేత ఎన్నుకోబడని, రాజ్యాంగవిధానంతో ఏమాత్రం సంబంధంలేని, మనిషి ప్రతివిషయాన్ని తనఇష్టంవచ్చినట్లు నడిపించే టప్పుడు ఈసోవియట్లు, ఈకార్యనిర్వాహకసంఘాలు ఏందుకోసం?"

మార్గదర్శిక ఆయనతో సంప్రదించింది.

"ప్రభుత్వంతో ఆయనకు ఏమీ సంబంధంలేదు. కేవలం తనపార్టీకి నాయకుడు, మార్గదర్శి, మాత్రమే. దేశాధ్యక్షుడు కేంద్రకార్యకారిణీసమితి యొక్క అధ్యక్షుడే."

నేను తిరిగివచ్చివేళాటప్పుడు మార్గదర్శికను మరల ప్రశ్నించేను.

"స్టాలి"న్‌కు ప్రభుత్వంలో సంబంధం లేదని మీరు నమ్ముతారా?"

"అతడే అంతా."

"అయనమేకాదు. కమ్యూనిష్టుపార్టీయే రష్యాకి అధికారిఅనడం ఉచితం."

"ఎందుకు కాకూడదు. కమ్యూనిస్టులే విప్లవం నడిపించేరు. స్వాతంత్ర్యం సంపాదించేరు. అందుచేత వారికి ప్రాధాన్యత ఉందనడంలో తప్పేముంది?"

"పూచీగల ఉద్యోగాలన్నీ కమ్యూనిస్టుల చేతులందే ఉన్నాయా?"

"అన్నీకాదు. కాని, చాలవరకు కమ్యూనిస్టులే. దేశంలో ఈపార్టీదే సర్వాధికారం. 'క్రెమ్లిను'నుండి అది ప్రతివిషయాన్నీ శాసిస్తూంది. మీరు భయంకరమని చెప్పిన జి. పి. యూ; రక్తకవచసైన్యము; వారి అధికారంలోనే ఉంది. Polit Bureau అనబడే ఈపార్టీశాఖ రక్షణను, ఉత్పత్తిని, నీతిని, నియమిస్తూంటుంది.

ఆమె చెప్పినది నిజం. కార్యప్రణాళికఅంతా పార్టీ చేతిలో ఉంది. వ్యావహారికరూపంలో పార్టీదే అధికారం అంతా. మంచుతో కప్పబడిన మాస్కోనగరవీధులలో నెమ్మదిగా నడుస్తూ, ఆమెమీద ప్రశ్నలవర్షం కురిపించేను. ఆమెకూడా స్వతంత్రంగా స్వచ్ఛంగా జబాబులిస్తూ వచ్చింది.

"1932 సంవత్సరపు బడ్జటులో ప్రభుత్వం ముప్పదికోట్ల రూబుళ్ళు అప్పుతీసుకున్నట్లుగా ఉంది. ఈఅప్పును ఎవ్వరిచ్చేరు? వడ్డీ ఎంత? ప్రజలే ఈఅప్పును ఇచ్చేరా?"

"ఔను. ప్రభుత్వం ప్రజలనుంచే తీసుకుంది. వారికి వడ్డీకూడా ఇస్తుంది. నవ్వుతారెందుకు? ప్రభుత్వమే బూర్జువా వర్గాన్ని సృష్టిస్తూ ఉన్నదనా? కాదు. కాదు. ప్రజలు చాలా ఎక్కువ ఆదాయపుపన్ను, ఉత్తరాధికారపుపన్ను, ఇచ్చుకోవాలి."

"అయితేనేం? ప్రజలు తమవద్ద నిరుపయోగంగా ఉన్నదబ్బుతో శ్రమపడ నక్కరలేకుండా కొద్దో గొప్పో ఆర్జించగలరు. ఆఖరుకి ఈఅప్పుపత్రాలు, బట్టలు, పాత్రసామగ్రి, వగైరాలవలె వ్యక్తిగతసంప దయే కదా? అందుకుతోడు అవి కొంత ఉత్పత్తికూడా చేయగలుగు తున్నాయి. ఉత్పత్తికి తోడ్పడే సాధనాలమీద వ్యక్త్యధికారం తొలగించి నామన్న మాట ఇక్కడికి అబద్ధమని తేలిందికదా? వ్యక్త్యధికారాల్ని నశింపచేయడం ముఖ్యమైన ఆదర్శం కదా, సోషలిస్టులకి?"

"కాని, ప్రభుత్వానికి ఇంతింత పనుల్ని నిర్వహించడానికి ధనం అవసరం కదా? అదీగాక, నేడు వ్యక్తివ్యాపారం చేసుకోవచ్చునని శాస నంలో మార్పుకూడా చేశారు. అయినా ప్రభుత్వం ఏవ్యక్తివద్దను పెద్ద పెద్దమొత్తాలుగా అప్పుతీసుకొని యుండలేదు."*

"అయితే ఈఋణం ఎవ్వరు తీసుకుంటారు? కేంద్రకార్యాకారిణీ సమితియా?"

"కాదు. సమితి కేవలం శాసకసంస్థ మాత్రమే. బహుశా "గైస్ బ్యాంక్" తీసుకుని ఉంటుంది. యూనియనుకు "సెంట్రల్‌బ్యాంకు" అదే."

"మీదేశములోని బ్యాంకింగు వ్యవహారం అంతా దీనిద్వారానే జరు గుతూ వుందనుకుంటా."

"అంటే మీఉద్దేశ్యం వ్యక్తులు దాంట్లో ధనం పెట్టుకుంటున్నా రనా?"

"ఔను. ఒక్కవ్యక్తులే కాదు. ఫ్యాక్టొరీలు, సమిష్టిక్షేత్రాలు, మొద

* "ఈ 30 కోట్ల రూబుల్లు నాలుగుకోట్ల ప్రజలనుండి పుచ్చుకున్నా రని నాకు చెప్పేరు."

ఎఫ్. డబ్ల్యూ. పథిక్- లారెన్సు- యొక్క "ఫైనాన్సు"లో.

లయినవికూడా."

"మేము "కోఆపరేటివ్ బ్యాంకుల"లోను, 'సేవింగ్సు'లోను (వీనిశాఖలు మొత్తం ౭౦,౦౦౦. ఉన్నాయి.) కాతాలు పెట్టుకుంటాము. కాని ఫ్యాక్టొరీలు, రహదారీశాఖ, కార్ఖానాలు, మొదలయినవి "గైస్ బ్యాంకు"లోను "ప్రోమ్‌బ్యాంకు"లోను కాతాలు పెట్టుతాయి."

"ప్రోమ్‌బ్యాంకు" ఏమిటి?"

"ఈప్రోమ్‌బ్యాంక్ కొత్త కార్ఖానాలు స్థాపించడానికి దీర్ఘవాయిదాల మీద అప్పులు ఇస్తుంది. ఇది వడ్డీ తీసుకొనదు. ఇంక 'గైస్‌బ్యాంక్.' స్వల్పవాయిదాఅప్పులు నూటికి 5 మొదలు 7 వరకు వడ్డీపుచ్చుకొని ఇస్తుంది."

"అయితే "ప్రోమ్‌బ్యాంకుకి" పెట్టుబడి పెడితే వచ్చేలాభం ఏమిటి?"

"ఈప్రోమ్‌బ్యాంక్ కార్ఖానాలు ప్రారంభించడానికే ఏర్పడింది. అది, కార్ఖానాలు అమ్మిన సామగ్రిమీద నూటికి 22 వంతులు పన్ను వసూలు చేస్తుంది. ఇంక "గైస్‌బ్యాంక్" కార్ఖానాలు నడవడానికి, అభివృద్ధికి అప్పులిస్తుంది. దేశీయ- విదేశీయవ్యాపారం, పరిశ్రమలు, అరణ్యపు పంటలు, కర్రెన్సీప్రచారం, ఈబ్యాంకు చేతిలో వుంటుంది."

"మీరు లాభమనీ, వడ్డీయనీ, అంటున్నారు. కార్ఖానాలు లాభాల నేలాగ తీస్తాయి. మీకార్ఖానాలు ఉత్పత్తిచేయబడిన సరుకును, కిట్టుబాటు వెలలకే అమ్ముతారని ఊహిస్తున్నాను. వాళ్లు లాభాలెందుకు, ఎవరికోసం తీస్తారు?"

"కాదు. మీఅభిప్రాయం పొరపాటు, కార్ఖానాలు; రైల్వేలు; ఎలక్ట్రిక్-కంపెనీలు; ఇంజన్లు- ట్రాక్టర్లు తయారుచేసే ఫ్యాక్టొరీలు; అన్నివిధాల పరిశ్రమలు; వేరువేరు ట్రస్టులచేత నడపబడుతూఉంటాయి. ప్రతి

ట్రస్టు లాభ-నష్టాలను, లెక్క- తేల్చాలి. ట్రస్టులు కిట్టుబాటుఖరీదులపై నూటికింతయని లాభంవేసి తమసరుకులను అమ్ముకుంటాయి. ఈట్రస్టు లలో ఒకదానికొకటి సంబంధం లేదు. పెట్టుబడిదారీదేశాలలో వేరువేరు ట్రస్టులకి ఏవిధంగా సంబంధంలేదో అలాగే ఇక్కడకూడా."

ఆమెమాటలు నాకు బోధపడక పోవడంవలన మరల వివరంగా చెప్పమనిఅడిగేను.

"కేంద్రప్రణాళిక (Central Planing) అనే మాట విన్నాను. వేరువేరుట్రస్టులు స్వతంత్రంగా వ్యవహారించేటప్పుడు 'సెంట్రల్‌ప్లానింగ్' అవసరం ఏమిటి?''

"కాని, 'గైస్‌ద్యాంక్' ఒక కేంద్రసంస్థకాదా? ట్రస్టులన్నీ దాని అధీనంలో ఉంటాయి. ముడిసరుకులకి—తయారయిన సరుకులకి ధరలను అదే నిర్ణయిస్తుంది. ఆనిర్ణయించబడిన ఖరీదుల్ని గురించి ఏట్రస్టు కయినా ఇష్టం లేకుంటే, పునరాలోచనకోసం "గైస్-బ్యాంకు''కే తెలియ చేస్తుంది. కాని, ఆసరుకు తయారుచేసిన ట్రస్టుకి తెలుపదు. ఇంక ఉత్పా దనవిషయంలో. రాబోయే అయిదుసంవత్సరాలకి ఉత్పత్తికావలసిన సరుకులను అంచనావేసి ట్రస్టులకి, కంపెనీలకి, పంపిస్తారు. ఈట్రస్టులు ఈఅంచనాలను తమఫ్యాక్టోరీలకు పంపిస్తారు. అచ్చటి కూలీలు వానిని ఆలోచించి అవసరములయిన మార్పులు సూచిస్తారు. అచ్చటినుంచి మరల పునరాలోచనకు పంపబడుతాయి. ఆఖరున అన్నివిషయాలు ఆలో చించి ఏమిచేయాలో నిశ్చయం చేస్తారు. 'సెంట్రల్‌ప్లానింగ్' పద్ధతి ఇది. బోధపడిందా?"

"సరే. ఉత్పత్తివిధానం ఇది విడుదల విషయంలోకూడా కేంద్ర సంఘానికి అధికారం ఉండవద్దు? లేకుంటే అధికోత్పత్తి—వ్యాపార మాంద్యం, సిద్ధం కావా?''

"మీరు చెప్పేది నిజమే. కాని, విడుదల మీదకూడా 'కేంద్రసమితికి' అధికారం ఉంది. యంత్రాలు, ఖనిజపదార్థాలు, ముడిసరుకు అంతా కూడా సర్కారు ఫ్యాక్టొరీలకే పోవలసియుంటుంది. కనుక ఉత్పత్తికి వలెనే విడుదలకూడా నియమంలో పెట్టడం సులభం."

"ఇప్పుడు మీరు వ్యక్తిగతవ్యాపారానికి అవకాశం ఇచ్చేరు. వ్యవసాయదారులు ధాన్యపుపన్ను మాత్రం ఇచ్చి, మిగిలినదానిని బజారులో తోచినట్లు అమ్ముకోవచ్చును. అప్పుడు ప్రభుత్వం అంచనాప్రకారం ఉత్పత్తిలో తేడా రాదా?"

"చట్టం ప్రకారం రైతులు తమసరుకు బజారులో అమ్ముకోవచ్చును. కాని, ఆఅమ్మేటప్పుడు పన్నులు ఎక్కువగా ఇచ్చుకోవాలి. కనుక, తిన్నగా ప్రభుత్వసంస్థలకి అమ్మడానికే ప్రయత్నిస్తారు. ప్రత్యేక వ్యాపారులకి —ఆఖరుకి వేరుగా బళ్ళుతోలుకొనే వారికి సహితం—రేషన్ కార్డులు దొరకవు. ఇంకపరిశ్రమలలో ఏవోకొన్ని గృహపరిశ్రమలు తప్ప మరేవీ వ్యక్తులచేతిలోలేవు."

## ౧౮

నేను మరికొంతమంది యాత్రికులు కలసి జైలుఖానా చూడడానికి బయలుదేరేము. ఇక్కడి జైళ్ళనుకూడా "సంస్కారగృహా"లనే పిలుస్తారు. మమ్మల్ని గుమ్మంలో దిగవిడిచి మార్గదర్శిక బహుశా అనుజ్ఞ కోసంకాబోలు లోనికి వెళ్ళింది. మాకాళ్ళకిందనున్న మంచును నలగగొట్టులూ మాలోమేము ఈదేశములోని చిత్రాలనుగూర్చి మాటలాడుకొనసాగేము.

"ఈవిప్లవకారుల్ని పిశాచాలపలె ఉంటారనుకుంటూఉండేవాళ్ళం."

అన్నాడొకడు. ఇంకొకడు సమాధానం ఇచ్చేడు. "ఇతరనాగరిక దేశాలలోని వారిలాగే ఉన్నారు. తేడా ఏమీలేదు."

దానిమీద ఒకఆడుది అందుకుంది.

"పూర్వపువస్తువులన్నీ నాశనం చేసివేశారనీ, విప్లవానికి పూర్వం ఉండే అమూల్యములైన కళలన్నిటినీ ధ్వంసం చేసివేశారనీ, ఎవ్వరి పిల్లలోకూడా తెలియబడకుండాఉన్న అనాధశిశువులు ఎందరో ఉన్నారనీ, పత్రికలనిండా అబద్ధాలే."

"అవన్నీ పచ్చిబూతులబుంగలు. గతమహాయుద్ధంలో అవిచేసిన దుష్ప్రచారం, విషవాయువు లకంటేను, సబ్మెరీనులుకంటేనూకూడా

భయంకరంగా ఉండేది."

అన్నాడొక అమెరికను. ఇంతలోకి తలుపుగొండ్లెము తీస్తూన్న చప్పుడయింది. మేమందరం ఒక్కొక్కరమే లోన ప్రవేశించేము. 'వైటింగ్ హాలు' లోకి వెళ్ళేక మమ్మల్ని లెక్కపెట్టి పేర్లూ—చిరునామాలు వ్రాసికొన్నారు. బహుశా 'విజిటర్సు—బుక్కు' లోనని ఊహించేను. అటుతర్వాత ఒకచిన్నవాకిలి దాటి ఇంకొకసావడిలోకి వెళ్ళేము. ఇక్కడ నొక్క టీదుకాణము—తినుబండముల దుకాణము ఉన్నాయి. ఖైదీలు ఇచ్చట తమకు కావలసిన సరుకులుకొని తినవచ్చును. ఇక్కడ పదిహేను నిముషాలవరకు కూర్చోవలసివచ్చింది. తర్వాత లోనికి వెళ్ళేము.

మొట్టమొదట మమ్మల్ని మొదటి అంతరపులోనున్న నాటకశాల లోనికి తీసుకు వెళ్ళేరు. రంగము చాలా విశాలంగా ఉంది. ప్రేక్షక స్థానాలు చదునుగా ఉన్నాయి. అక్కడకొన్ని కుర్చీలుకూడా ఉన్నాయి. గోడలమీద పెద్దపెద్ద అక్షరాలతో "మన ప్రణాళికను పూర్తిచేసి దేశమునకు సాయం చేయండి" మొదలయిన పంచవర్షప్రణాళికకు సంబంధించిన హెచ్చరికలు వ్రాయబడియున్నాయి. ఖైదీలుకూడా తమనాగరిక కర్తవ్యాలను మరచిపోకూడదనే, ఇవి ఎర్రనిరంగుమీద తెల్లని అక్షరాలలో వ్రాయబడి యున్నాయి. ఈరంగముమీద ఖైదీలు నాటకాలనాడుతూ, సినీమాలుచూస్తూ, కాలం గడుపుతారట. ఖైదీలకుకూడా సినీమాలు, నాటకాలూనా, యని మేమంతా ఆశ్చర్యపడ్డాము. మామార్గదర్శిక పూర్వపు ఖైదుఖానాలకు, నేటివానికిగల భేదాన్ని వివరించింది. నేరస్థుల్ని దండించి, ప్రతీకారం తీర్చుకొనే ఉద్దేశ్యంతో పూర్వపుజైళ్ళు నడుపబడేవి. కాని నేటిజైళ్లు. తప్పిజారి పొరపాటున చెడ్డమార్గాలు త్రొక్కిన సామాజికులను సన్మార్గంలోనికి కొనిరావడానికే నూతనసమాజంలో అర్హ

స్థానం పొందగల నాగరికులనుగా చే య డా ని కీ, ఉద్దేశించబడినాయి. ఇప్పుడు వీనికి టూర్మా (జైలు) అనేపేరు ఉపయోగించక 'సంస్కార గృహాలు' అనే అర్థం ఇచ్చే 'ఇస్ప్రావ్‌డమ్' అనే పేరు ఉపయోగిస్తున్నారు.

ఇచ్చటినుంచి మమ్మల్ని గ్రంథాలయం ఉన్నగదిలోకి తీసుకొని వెళ్లేరు. ఇచ్చట అధ్యక్షుడు, ఉపాధ్యక్షుడు, కూడా ఖైదీలే. చదువరులు ఖైదీలే. ఈగ్రంథాలయమే కాక ఇచ్చటివారికి ఒక పాఠశాల కూడా ఉంది. ఇక్కడ పుస్తకాలయములో, అచ్చట పాఠశాలగదులలో ఉన్న అలమారులలో ఖైదీలచే నేయబడిన బట్టలు, కుట్టబడిన వస్త్రుల యొక్క మంచి, చెడ్డనమూనాలు, ఖైదీలచేతనే తయారు చేయబడిన ఇతరవస్తువుల నమూనాలు ప్రదర్శించబడియున్నాయి. ఆ నమూనాలలో ఎక్కడ తప్పులు ఉన్నాయో, అవి యెందుచేత కలిగినాయో, తెలియ పరచే అట్టలు గోడలమీద వ్రేలగట్టబడియున్నాయి. ఇతరఖైదీలు మరల అటువంటి తప్పులేన్నీ చేయకూడదని వాని యుద్దేశ్యం. గ్రంథాలయంలో ఒకమూల నొక ఖైదీ తయారుచేసిన ఒకమాదిరియంత్రము వ్రేలాడకట్టబడియుంది.

ఇతరఖైదీలు దీనినిచూచి చర్చలు జరుపడానికే ఇది ఇచట వ్రేలగట్టబడింది. పనికాలము పూర్తియైన తర్వాత క్రమపద్ధతిప్రకారం చదువు చెప్పించి వారిని నాగరికులనుగా చేయడానికి ప్రయత్నాలు జరుగుతున్నాయి. ఇచ్చటి ఖైదీలు తీరుబడివేళల గ్రంథాలయాన్నుంచి పుస్తకాలు తీసుకొని చదువుకుంటూ కూర్చుంటారు.

తరువాత ఖైదీలు నివసించే గదులు చూసుకుంటూ ముందుకు సాగేము. ఈగదులు సన్నగా, చిన్నవిగా, ఉండక విశాలంగాను, పెద్దవిగాను ఉన్నాయి. ప్రతిగదిలోను ఎన్నో 'స్ప్రింగ్' మంచాలూ;

వానిమీద మెత్తని పరుపులూ; తెల్లనిదుప్పట్లూ; తలగడలు; ఉన్నాయి. ప్రతిగదిలోను, రేడియోయొక్క "లౌడ్‌స్పీకర్లు" ఉన్నాయి. రష్యాలో 'రేడియోబ్రాడ్‌కాస్టింగ్ స్టేషన్లు' పెద్దవి డెబ్బైఒకటి చిన్నవి నాలుగు వేలు ఉన్నాయట. ఈచిన్నస్టేషన్ల శక్తి చాలా తక్కువగా ఉంటుంది. ఇంచుమించు నూరువరకు లౌడ్‌స్పీకర్లతో సంబంధం వుంటుంది. పెద్ద పెద్దకార్ఖానాలు, సంస్కారగృహాలు, ఇంకా ఈలాగంటి ప్రజాసంస్థలు. తమకు ఇన్ని 'లౌడ్‌స్పీకర్లు' అవసరం అని ఋజువుపరిస్తే, స్వంతంగా 'బ్రాడ్‌కాస్టింగ్‌స్టేషను' తెరుచుకుందుకు అనుమతి ఈయబడుతుంది. సామాన్యంగా ఈచిన్నస్టేషన్లు పెద్దస్టేషన్లనుండి వచ్చేవార్తలను తమ కిందనున్న 'లౌడ్‌స్పీకర్లకు' అందిస్తూంటాయి. అప్పుడప్పుడు తమ 'స్టూడియో'నుంచే ఉపన్యాసాలు పాటలు, గ్రామఫోనురికార్డులు, విని పింపచేస్తాయి. ఈజైలులోనో హైస్కూలులోనో ఈమాదిరి స్టేషను చూసినట్టే జ్ఞాపకం. ప్రధానస్టేషనుల కార్యక్రమంలో నూటికి అరవై వరకు కళాసంబంధమునైన విషయాలు; ఇరవైవరకు రాజకీయప్రచారో పన్యాసాలు, పదింటివరకు ప్రభుత్వవార్తలు, పదింటివరకు కూలీల వృత్తు లకు సంబంధించిన పాఠాలు, ప్రచారం చేయబడుతాయి.

శుభ్రమైన బట్టలు కట్టుకొని ఖైదీలు తమగదులలో కూర్చుండి యున్నారు. కొందరు పత్రికలు చదువుతున్నారు. కొందరు కబుర్లు చెప్పు కుంటున్నారు. కొందరు ఫిడేలు వాయించుకుంటున్నారు. వారంతా తమ తమ ఇండ్లవద్ద నున్నట్లే ఉన్నారు. ఇద్దరో–ముగ్గురో ఆనందంగా టీ త్రాగుతున్నారు.

"ఇప్పుడు, ఇటువంటివేళ త్రాగడానికి టీ ఇస్తారా?"

"ఇవ్వరు. బయటి దుకాణంలో కొనితెచ్చుకుంటారు."

"కొనడానికి డబ్బులో."

"వీరందరికి కూలి ఇస్తారు. దానిలో సగభాగం జైలు ఆఫీసులో జమకట్టబడుతుంది. ఆధనం వారు విడుదల అయినప్పుడు వారికే ఇచ్చి వేస్తారు. మిగిలినసగం వారు భోజనమునకు, బట్టకు, టీకి, క్షవరానికి, గడ్డం కత్తిరింపించుకుందుకు, వినియోగించుకుంటారు."

"బయట కూలివానికి ఎంత కూలి ముట్టుతుందో అంతా ఇక్కడి వారికి ముట్టుతుందా?"

"అహా. నెలకి ఇరవైరూబుళ్ళకంటె ఎక్కువరావు."

ప్రతిగదిలోను, పది—పన్నెండుగురు కైదీలు ఉన్నారు. వారంతా చాలా ఉత్సాహంతో కనిపించేరు. ఈప్రదేశంలో జైలుఖానాల కాఠిన్యం గాని, నిర్బంధంగాని, కనపడలేదు.

"మీరందరు సుఖంగా ఉన్నారా? మీకేవిధమైనకష్టాలు లేవు?"

అని ఒకకైదీని ప్రశ్నించేను. మార్గదర్శిక నాప్రశ్న వారికి తెలియ చెప్పేటప్పటికి వారంతా నవ్వు ఆరంభించేరు.

"లేవు. మాకిచ్చట సుఖంగానే వుంది. బాగానేవున్నాము."

"అయితే విడుదల అవడంకంటె ఇక్కడ ఉండడమే మీకిష్టంగా వుంటుందా?"

"అచ్చే. అచ్చే. మాయిళ్ళకి పోవాలనే ఉంది. పెళ్లాం పిల్లలతో కలసి ఉండాలనే తలుస్తున్నాం. ఇక్కడ మా ఆదాయమూ తక్కువే. మాకున్న ఓటుహక్కుకూడా లాగివేయడం మరీ బాధగా వుంది."

వాస్తవానికి ఇది చాలా బాధకరమైనదే. రష్యాలో ఓటుహక్కు లాగివేయబడినవారిని కుక్కకంటె నీచంగా చూస్తారు. ఈకూలీప్రభుత్వంలో ఆతనికేవిధమైన స్థానం వుండదు. అట్టివారిపిల్లల్ని, సార్వజనికములైన తాలింఖానాలలోనికికూడా చేరనీయరు.

మేము వరాండాలోనుంచి క్రిందికి దిగివచ్చేశాము. అచ్చట ఒక

గది ముందు కొందరు మనుష్యులు వరుసగా నిలువబడియుండగా చూసేను. అదియొక మంగలిదుకాణమట. దానిముందు ఇంచుమించు ముప్పదిమంది శాంతంగా నిలుఎబడి తమవంతుకోసం ఎదురుచూస్తు న్నారు. మేము దుకాణంలో ప్రవేశించేము. అది చాలా బాగుంది. గోడల్ని పెద్దపెద్ద అద్దాలు వ్రేలాడుతూన్నాయి. క్షౌరానికి అవసరమైన సామగ్రిలన్నీ అక్కడ ఉన్నాయి. గదిఅంతా 'షాంపూ' యొక్క పరిమళంతో నిండిపోయి వుంది. మూడు—నాలుగుకుర్చీలమీద ఖైదీలు కూర్చుండి క్షౌరం చేయించుకుంటున్నారు. ఒకబల్లవద్ద కొందరు కూర్చుండి చదరంగం ఆడుకుంటున్నారు. పని పూర్తియైనవాడు ఈవలకు రాగానే రెండవవాడు అతని స్థానం ఆక్రమించుకుంటున్నాడు.

"క్షౌరం చేయించుకున్నందుకు డబ్బులు ఈయాలా?"

"ఆ: తమకూలిలోనుంచి వీరికి ఈయాలి. గడ్డం కత్తిరింపించుకుంటే ఇరవైకోపెక్కులు 'లవెండరు'తో జుట్టు దువ్వించుకుంటే ముప్పైకోపెక్కులు ఇవ్వాలి. కాని, వీళ్లు డబ్బంటే లెక్కచేయరు. వీరి బంధువులు ఈవేళ వీరిని చూడడానికి వస్తున్నారు. తమ భార్యలవద్ద అసహ్యం ఓడే ముఖాలతో ఉండడానికి ఎవ్వరూ అంగీకరించరుకదా?"

ఓ! ఈవిప్లవవాదులకికూడా విలాసాలమీద ఇచ్ఛపుడుతూందా?

"ఎన్నాళ్ళకు ఒకమాటు బంధువుల్ని చూడడానికి అనుజ్ఞ ఇస్తారు?"

"ఈవిషయం ఖైదీల ప్రవర్తనని పట్టి ఉంటుంది. శాసన ధిక్కారం చేసినవారికి సామాన్యంగా బంధుదర్శనానికి, జాబులు వ్రాసికొనడానికి, కూడ అనుమతి ఈయబడదు. కాని, వారిప్రవర్తన బాగుంటే ఏడాదికి ఇరవై రెండురోజులకు పైబడి సెలవు దొరుకుతుంది. ఈసెలవు రోజుల్లో వారు ఇంటికిపోయి బంధువులతో కలసిఉండవచ్చును. ఇచ్చటి

కంటె ఎక్కువకూలి దొరికే కార్ఖానాలలోనో, పరిశుభ్రక్షేత్రాలలోనో పనిచేసుకోవచ్చును.''

. సత్ప్రవర్తన కలిగియున్నందున ఇంచుమించు 1200మంది ఖైదీలు నియతసమయానికి ముందే విడిచిపెట్టబడినారని ఈమధ్యనే పత్రికలలో చదివినమాట జ్ఞాపకం వచ్చింది.

"పైవారికి ఎన్నిఉత్తరాలు తోస్తే అన్నీ వ్రాయవచ్చునా?''

''ఆ! ఎన్ని వడితే అన్ని, ఎప్పుడు తోస్తే అప్పుడు. కాని, నియమోల్లంఘనం చేస్తూన్నట్లు ఆతనిమీద ఫిర్యాదులు రాకూడదు. 'సెన్సారు' ఉత్తరాలను చూస్తూంటుంది. కాని, వ్యక్తిగతవిషయాలలో కలిగించుకొనదు."

''వాళ్ళకి తోచినన్నిమారులు పైవారితో కలుసుకోవచ్చునా?"

''ఇవన్నీ వారి ప్రవర్తనను పట్టి ఉంటాయి. మీరెంతసేపు బంధుదర్శనమో అనే అంటున్నారు. 'క్రిమినల్ కాలనీల'లోనివారు సెలవురోజులలో దగ్గరనున్నఊళ్ళకు పోయి ఉండవచ్చును. ఆఖరుకు కాలనీలలోనికి భార్యలను తెచ్చుకొని ఉంచుకోవచ్చును."

"ఏమిటి........?''

ప్రపంచచిత్రాలలో ఇది ఎనిమిదవదిగా తోచింది. ఖైదీలకు సెలవలు, పెళ్ళాముతో కాపురం! నిజానికి మానవత్వం పరిపూర్ణత పొందిందని చెప్పవచ్చును. రష్యనులు మానవుని సహజవాంఛలను చంపివేయలేదు. మనదేశాలలో ఖైదీయుకూడా మనుష్యులే యన్నమాట మరచిపోతున్నాం. మనుష్యుడు తాత్కాలికోద్రేకంలో ప్రస్తుతశాసనాన్ని ఉల్లంఘించినా, వాని శరీరంలోనివికూడా రక్తమాంసాలే యని ఆలోచించడం లేదు. ఆతనికి కూడా కామేచ్ఛ వుంటుంది. అది శరీరధర్మం. కాని, మనమీమాటనే తలపెట్టక జైళ్ళలోను, విముక్తులైనాకకూడా వారిని

పశువులవలె చూస్తున్నాం. చివరికి మనప్రవర్తన వారిని పశువుల్నిగానే చేసివేస్తూంది. అందుచేతనే మన జైలుఖానాలు మానవుని సంస్కరించి మంచివారిని చేయడానికిబదులు తుంటరులనుగాను, భయంకరులుగాను, తయారుచేస్తూన్నాయి. రష్యన్ జైళ్ళలో సెలవురోజులలో ఖైదీల భార్యలు వచ్చి వారితో ఉండవచ్చునట. అందుకొరకై ప్రత్యేకావకాశాలుకూడా కల్పించబడి యున్నాయట.

"జైలు అధికారులు పైవారిని లోనికి రానిస్తారా? ఈభవనం లోనికి రావడానికి మాకు చాలా ప్రయత్నం చేయవలసి వచ్చిందే."

"భవనం అంటున్నారేమిటి? సాధారణఖైదీలను 'క్రిమినల్ క్యాంపు'లలోనే ఉంచుతారు. వానికి చుట్టూగోడలు ఏవీ ఉండవు. అది కూడా ఒకచిన్నగ్రామంవంటిదే."

ఆమె మాటలు నాకు మరీ ఆశ్చర్యం కలిగించేయి.

"అయితే ఇదేమిటి?"

"ఇది 'సంస్కారగృహం.' చాలా పెద్దనేరాలు చేసినవారు, రెండవమారు నేరం చేసినవారు, ఇక్కడ ఉంచబడుతారు. మోసగాండ్రు దొంగలు మొదలయిన వారయితే మొదటి పర్యాయముకూడా ఇచ్చటికే పంపివేయబడతారు."

"గోడలు లేకుంటే వాళ్ళు పారిపోవరు?"

"అబ్బే! పారిపోవడం ఎక్కడికి? పారిపోతే ఏమితింటారు? సెలవురోజులలో రాత్రిపదిగంటలవరకు 'కాలనీ'కి బయటనే ఉండ వచ్చును."

"అయితే జైలు జీవనానికీ, నాగరిక జీవనానికీ, తేడా ఏమిటి?"

ఓ. 'కాలనీ'లో ఉన్నా 'సంస్కారగృహం'లో ఉన్నా రష్యాలో మహాపవిత్రంగా ఎంచబడే ఓటుహక్కు తీసివేయబడడమే విచారం

కలుగచేస్తుంది."

కొందరు ఖైదీలు బయట ముంగిలివాకిటిలో మంచుకురుస్తూఉన్నా కర్రలు కొడుతూ కనపడ్డారు.

మేము తిరిగి తిరిగి ఒక బట్టల మిల్లులోకి వెళ్ళేము. ఇక్కడ నూలువడికి నేస్తున్నారు. చాలమంది ఆడవాళ్ళున్నారు ఇక్కడ. ఈమిల్లులో ఖైదీలకు పనులునేర్పి సమర్థులయిన పనివారినిగాను, ప్రత్యేక నిపుణులనుగాను తర్ఫీదునిస్తారు.

"స్త్రీ—పురుషఖైదీలను ఒకచోటనే ఉంచుతారా ?"

"ఉంచరు. కాని, ఇష్టపడితే ఖైదీలయిన స్త్రీపురుషులు ఒకరి నొకరు ప్రేమించుకోవచ్చును. భార్యాభర్తలవలె కాపురంచేస్తూ ఉండ వచ్చును."

ఇది అన్నిటికంటేనూ ఆశ్చర్యంగా ఉంది.

"ఇక్కడ 'క్రెచీ'కనపడదే. పనిలోకి వెళ్ళేటప్పుడు వీరు పిల్లల్ని ఎక్కడ ఉంచుతారు. ఒకవేళ జైలులో ఉండగా బిడ్డల్నికనడం నిషిద్ధము కాదుకదా ?"

"కాదు. దగ్గర ఊరిలో పిల్లలనుంచి పాలీయడానికి పోయి వస్తూ ఉండవచ్చును. 'క్రిమినల్ కాలనీ'లలో 'క్రెచీ' లున్నాయే !"

"ఇక్కడ ఖైదీలు రోజుకి ఎన్నిగంటలు పనిచేయాలి ?"

"ఎనిమిది గంటలు."

"అయితే గదిలో ఆరుగురు ఖైదీలు వట్టినే కూర్చున్నారు కదా ? వారు పనిలోకి వెళ్ళలేదేం?"

"వారా ? వంతువచ్చినప్పుడు వెళ్తుతారు."

మేమంతా ఖైదీల భోజనశాలలోనికి వెళ్ళేము. ఆసావిడి చాలా పరిశుభ్రంగా వుంది. కొంతమంది సాయంకాలపువంట చేస్తున్నారు.

ప్రతి కైదీ తనకభినివేశం గలపనినే చేయడానికి ప్రోత్సహించబడతాడు. మంగలిశాలలో ఉన్న మంగళ్ళు అందరూ కైదీలే. ఇక్కడకూడా వారు క్షురకర్మనే నిర్వర్తించాలి. వారికికూడా అందరికివలెనే ఇరవై రూబుళ్ళ జీతమే ఈయబడుతుంది. క్షౌరము చేయించుకొన్న వారివద్ద వసూలు చేసినదంతా జైలుకార్యాలయంలో జమకట్టివేయవలసినదే.

ఈసంస్థనంతను వ్యావహారికరూపంలో కైదీలే నిర్వహిస్తున్నారు. ఎవ్వడయినా జైలు ఉద్యోగి తనకర్తవ్యంలో ఏదయినా లోపం చేశాడా కైదీలు తమ 'గోడకాగితాలలో, అతనిని విమర్శించవచ్చును. ఈనేరారోపణలు నిరాధారాలు, ద్వేషకృతాలు, కావుగదా యనిమాత్రమే అధికారులు చూస్తూంటారు. కైదీలకు పూర్తియైన వాక్స్వాతంత్ర్యం ఉంది. సమావేశాలలో రేడియోలలో, పత్రికలలో, వారు జైలుయొక్క ఉన్నతికి తగిన ఉపాయాలను, మార్పులను సూచించవచ్చును. ఇచ్చటికైదీలకు అనుక్షణం యోగ్యులయిన పౌరులు కావాలనీ, ప్రతివాడు దేశములో తలపెట్టబడిన మహత్కార్యాన్ని సఫలం చేయడంలో సంపూర్ణంగా పాల్గొనాలనీ, జ్ఞాపకం చేస్తూంటారు. ఇక్కడి కైదీలు ఎంత స్వాభావికపద్ధతిలో ఉంచబడున్నాతురో చూడండి. అతని ఆత్మగౌరవానికి ఎక్కడా బాధ కలగనీయరు. పైపెచ్చు ఆత్మగౌరవం కాపాడుకొనడానికి సంపూర్ణ సహాయం ఈయబడుతుంది. చదువు—వ్రాత—లెక్కలు—నేర్పబడతాయి. రేడియోద్వారాను, పత్రికలద్వారాను అతనికి ఉన్నతభావాలు కలిగించబడుతాయి. దేశవిదేశాలవార్తలు తెలుపబడుతాయి. వారికి పనులునేర్పి నేర్పరులనుగా తయారు చేస్తారు. జైళ్ళనుంచి విడుదలకాగానే జైలులోదిగత్రొక్కినధనం చేతికిస్తారు. దానిసహాయంతో తనకు పనిదొరికేవరకు భోజనం సంపాదించుకొనగలుగుతాడు. ఈకైదులోఉండడం అతని భావి జీవితంలో ఒకమచ్చ కాజాలదు. కైదుశిక్షపొందినవాడయినా సరే—

అర్హుడై నట్లయితే ఎంత ఉన్నతపదవినైనా పొందగలడు. జైలులో పడ్డాడనే కారణంచేత అతనికి ఉద్యోగం ఈయననడానికి వీలులేదు. ఖైదీ, పొరపాటున మార్గం విడిచి తప్పుదారుల పడినాడనీ, అతనిని సరియైన మార్గంలోకి తేవాలనీ, ఆలోచిస్తారు. అతనిని ప్రజలుకాని, ప్రభుత్వంకాని, తిరస్కరించలేరు.

నాతోనున్న యాత్రికుడొకడు "చాలా గొప్పవిషయం" అన్నాడు.

"రేడియో తిసుబంధముల టుకాణం. పత్రికలు, మంగలిదుకాణాలు, నాటకశాల, వీటన్నిటిని మించి గార్హస్థ్యజీవితం, ఇంక జైలేమిటి? "ఇంటి కంటె గుడి పదిలం" అన్నట్లుగా వుంది." అన్నాను."

"జైలు కాదండి యిది. 'సంస్కారగృహం' మాత్రమే. ఖైదీ యొక్క మానవత్వాన్ని అంతటినీ ధ్వంసం చేయడానికి కాదిది. వాళ్ళని అణచి ఉంచడానికి కాదు. వారిని అభివృద్ధిలోనికి తేవడానికి. దారితొలగిన సమాజసభ్యుల్ని సరియైన బాటలో పెట్టడమే దీని ఉద్దేశ్యం."

ఇదే నిజం. ఖైదీలనుండి ప్రతీకారం తీర్చుకొనే ఉద్దేశ్యంతో ప్రభుత్వం ప్రవర్తించదు. వారికి నచ్చచెప్పి ఒప్పించడానికే ప్రయత్నిస్తుంది.

## ౧౯

ఇక్కడితో నాసంచారం పూర్తి అయింది. ఆరోజుననే సాయం కాలం మాస్కోలో బయలుదేరేను. కాని, ఆవిప్లవకారుల దేశాన్ని గురించి చెప్పడం ముగించేముందు ద్వితీయపంచవర్షప్రణాళికను గురించి కొంచెం చెప్పవలసియుంది. రష్యాలో నేను ఉన్నప్పుడే వేరువేరు శాఖల అధికార్లు ప్రకటించిన రిపోర్టులు పత్రికలలో ప్రకటించబడినాయి. ప్రథమ ప్రణాళిక నడచిన నాలుగున్నర ఏళ్ళలోను, ఏమేమి చేయగలిగేరో అవన్నీ ప్రకటించేరు. ఆరోజులలో "మాస్కో డైలీన్యూస్" అనే ఇంగ్లీషుపత్రికను చూడడం తటస్థించింది. ప్రథమప్రణాళికలో ఎంత పని జరిగిందో ద్వితీయప్రణాళిక సాధించవలసినదేమిటో పాఠకులకి సులభంగా తెలియడానికి ఆపత్రికలోని కొన్ని అంకెలను వ్రాస్తాను.

| పని. | ప్రథమ ప్రణాళిక అంచనా. | ఉత్పత్తి. | ద్వితీయ ప్రణాళిక అంచనా. |
| --- | --- | --- | --- |
| ట్రాక్టర్లు | 91,000 | 1,05,850 | — |
| రైలుబళ్ళు | 12,600 | 20,000 | — |
| రైలుఇంజన్లు | 825 | 812 | — |
| జోళ్ళు | 6,01 కోట్లు | 7.68 కోట్లు | — |
| ఎలక్ట్రిక్ కార్లు | — | — | 12,000 మైళ్లు |
| .. కరెంట్ | — | 17 అరబు K. W. H. | 1 ఖరబు K. W. H. |
| ప్రతిమనిషికి విద్యుత్తు ఖర్చు | — | 100 యూనిట్లు | 500 యూనిట్లు |

రష్యాలో పరిశ్రమలు ఏవిధంగా వృద్ధిపొందుతున్నాయో తెలుపడానికి ఒక్కపరిశ్రమను ఉదాహరణగా చూపించదలచుకున్నాను.

| మోటారుపరిశ్రమ | | | నిర్మాణము. |
| --- | --- | --- | --- |
| 1930 లో | .... | .... | 8500 |
| 1931 లో | .... | .... | 24,400 |
| 1932 లో | .... | .... | 56,000 |

ఏపనిని సాధించడానికి అమెరికాకి ఇరవైఏళ్లు పట్టుతుందో ఆపనినే ఆరేళ్ళలో సాధించగలమని రష్యనుల నమ్మకం. ఆనమ్మకాన్ని నిజమైన అంకెలుచూపి ఋజువుపరచుకొనగలిగేరు కూడాను.

ఈరెండవప్రణాళికలో అధికభాగం పెద్దపెద్దయంత్రాలనిర్మాణమే ముఖ్యంగా ఉంచబడింది. ఇది పూర్తి అయ్యేటంంకు రష్యాపూర్తిగా తనకాళ్ళమీద తాను నిలువగలదు. అప్పుడు ప్రజలజీవితవ్యయప్రమాణం అధికం అయ్యేటంమకు ఉపయోగించే తేలికపనులమీదికి దృష్టి తిప్పుతుంది. ఇదివరకు లేనేలే వనతగినంత తక్కువగా ఉండేవి. వానినిగూర్చి

ఏమరితే రష్యా క్షణంలో నేలకూలుతుంది. కనుకనే వారు ఇంతవరకు వానిమీదనే ఎక్కువధ్యానం ఉంచి పనిచేశారు. వానికోసం ప్రజాసౌఖ్యం విడిచిపెట్టక తప్పిందికాదు. ఇంతవరకు రష్యాలో అల్పాల్పముగానున్న వర్గభేదము రెండవప్రణాళిక ఆఖరు కావచ్చేటందుకు మాపివేస్తారు. వర్గభేదములేని సమాజాన్ని సృష్టించాలని రష్యనుల ప్రతిజ్ఞ. నేడు బుద్ధిమంతులవర్గమువారు 'నేర్పరుల'నే పేరుతో (Skilled) పిలువబడుతున్నారు. ఇతరులకంటె వారికి ఎక్కువజీతాలు, సౌకర్యాలు ఉన్నాయి. ప్రజలందర్ని విద్యావంతుల్నీ, నేర్పరులను, చేసి ఈవర్గభేదమును అంతరింపచేయాలని రష్యనులపట్టుదల. కాని, ఈపని జరగాలంటే ఈమాదిరి ప్రణాళికలు ఇంకో మూడు—నాలుగు నిర్వహించబడవలసియుంటాయని నాయూహ.

రష్యానుంచి నేను తెచ్చినపుస్తకాలు, పత్రికలు, అన్నీ పోవడంచేత వానికిసంబంధించిన లెక్కలు నేను వ్రాయలేకపోయాను. అంతకు పూర్వం నేనువ్రాసిన వ్యాసాలలో ఏఅంకెల నుదాహరించేనో వానినే ఇందులోను ఎక్కించేను. నాకు చేతనైనంతవరకు ఏవిధమైనపక్షపాతము లేకుండా ఈరహస్యమయదేశముయొక్క వివరణాలన్నీ వ్రాసేను. సోవియటురష్యాలోని మంచిచెడ్డలు రెంటినీనేను చూసినవి చూసినట్లు వ్రాసేను.

ప్రపంచం అసంభవం అనుకొనే పనులనెన్నిటినో రష్యా చేసి చూపించింది. పదేళ్ళలో ఆదేశం పొందినంత అభివృద్ధిని పొందడానికి దానివలెనే వెనుకబడియున్న మరొకదేశానికైతే నూరేళ్ళకి తక్కువ పట్టదు. కాని, కమ్యూనిస్టులు చెప్పినమాటలు పూర్తిగా ఆచరణయోగ్యాలు కాలేదు. తీరా కార్యక్రమంలో పెట్టేసరికి వానిలో ఎన్నో మార్పులు చేసుకొవక తప్పిందికాదు. కాని, ప్రపంచంఅంతా అనుసరించి ఆచరించవగిన

సమాజవికాసాన్ని సాధించింది, రష్యా.

నేను సాయంకాలం బండీలో మాస్కోలో బయలుదేరేను. ట్రైనులో ఒకరష్యనుపెద్దమనిషితో పరిచయం కలిగింది. ఆయన ఒక గ్రంథకర్తయట.

"ఒక్కొక్క పుస్తకానికి మీకెంతడబ్బు ఇస్తారు?"

"నలభై వేలశబ్దాలకి నాలుగువందలరూబుళ్ళు ఇస్తారు."

"అయితే ప్రభుత్వం మీపుస్తకాలన్నీ కొంటారా?"

"ఎన్ని పుస్తకాలయినా వారికి కావాలి."

"మీరు నాటకాలు వ్రాస్తారా? నవలలా?"

"నేను పాఠ్యపుస్తకాలు వ్రాస్తాను. వాటి ఉపయోగమూ ఎక్కువే. లాభము ఎక్కువే. పైగా పుస్తకాల అమ్మకాన్ని గురించి విచారం అవసరంలేదు. పాఠక్రమాన్ని అనుసరించి పుస్తకాలు కనక వ్రాస్తే విద్యాశాఖ వారు వానిని తీసుకుంటారు."

"అయితే మీదేశంలో నాటకాలు, నవలలు, వ్రాసేవారికి డబ్బు బాగావస్తుందా?"

"ఆహా! 'మాక్సిం గోర్కీ'కి ఎన్నోలక్షల రూబుళ్లు వస్తాయి."

యూనిఫారం ధరించిన ఒక బాలిక మాపెట్టెలోనికి వచ్చి ఏదో అడిగింది. బహుశా టిక్కట్టు చూపమని అడుగుతూందని జేబులోని టిక్కట్టుతీసి చూపించేను. ఆమె నాటిక్కట్టు చూడకుండానే ఇంకొక చోటికి పోయి తనవద్దనున్న టిక్కట్లు తీసిచూపించింది. నాప్రక్కనున్న పెద్దమనిషి

"ఆమె లాటరీటిక్కట్లు అమ్ముతూంది." అని చెప్పేడు.

"ఈలాటరీ ధనం సైన్యాలకోసం, జలసైన్యాలకోసం ఉపయోగిస్తారు.

"లాటరీలో బహుమతులు ఏమి ఉంటాయి?"

ఆయన తనవద్దనున్న టిక్కట్టు చదివి వినిపించేడు.

"ప్రపంచం అంతా యాత్రి చేయించడం మొదటిబహుమతి. యూరపుసంచారం రెండవబహుమతీ, యూ. ఎస్. ఎస్. ఆర్. అంతా విమానంలో త్రిప్పడం మూడవబహుమతి. నాలుగవది మోటరుకారు— ఈలాగే ఉన్నాయి."

ఆగ్రంథకర్త మాటలధోరణిలో "ఏయే దేశాలు చూసేరు?" అని అడిగేడు. సమస్తభారతభూమి, యూరపుఖండాన్నీ, తిరిగేనని చెప్పేను.

"మీరు అదృష్టవంతులు."

"ఆ! ఇదెంత? ఈవిశాలప్రపంచంలో నేచూసినదేమిటి?"

"అయితేనేం మీరెన్నో దేశాలు చూసేరు. మేమిక్కడనే ఉండిపోవాలి. ప్రపంచం చూడడానికి లేదు."

"ఎందుకులేదు? మీడబ్బుతో మీరు తిరగడానికి వీలులేదు?"

"'ప్యాస్పోర్టు' దొరకడం కష్టం."

ఆయన రెండు లాటరీటిక్కట్లు కొని ఒకటినాకు బహుమతీ ఇచ్చేడు. ప్రభుత్వానికి సాయం చేయాలని ప్రతియాత్రికుడు ఒక్కొక్క టిక్కట్టుకొన్నాడు.

'బిగోసోవో' స్టేషనులో 'కస్టమ్సు ఆఫీసరు' మాసామానంతా తనిఖీ చేశాడు. అందుకు రెండుగంటలు పూర్తిగా పట్టింది. 'వైటింగ్ రూమ్'లో 'రేడియోలౌడ్‌స్పీకరు' ఒకటిఉంది. దానివలననే ఈనిర్జనప్రదేశవాసులకు ప్రపంచవార్తలు తెలుస్తూంటాయి. ఇక్కడ కూలీలు లేరు. అందుచేత మాసామాను మేమే మోసుకొనవలసి వచ్చింది. మాపెట్టెలు, కాగితాలు సమస్తం పరీక్షచేసివేశారు. బంగాళీభాషలో వ్రాయబడిన కాగితాలనికూడా అన్నిభాషలు ఎరిగిన అధికారులు విప్పిచదివేరు. 'లైన్' మీద

నున్న మంచును చిమ్ముకుంటూ రైలు మరల బయలుదేరింది. "బిగోసోవో' తర్వాత "లింద్రా"లో 'లిట్వియా' అధికారులు మళ్లీ పరీక్షచేసి "పన్ను వేయవలసినది ఏమిలేదుగదా?" యని అడిగేరు. మూడుగంటలు ప్రయాణం చేసినాక "డంగావపిల్సు"లో బండి మారవలసివచ్చింది. రష్యా వెళ్లే వారు 'విసా' తీసుకొనేటప్పుడు ఏదారిని వస్తారో చెప్పాలి. ఆరోజున పగలూ—రాత్రీ బండిలోనే గడిచింది. 'లిట్వియా' హద్దులు దాటేటప్పుడు, 'లిథుఆనియా'—'పోలండు'లవద్ద 'కస్టమ్సు' వాళ్ళ బాధతో తెల్లవార్లు నిద్ర లేకుండానే పోయింది. మరునాడుదయం తొమ్మిది గంటలకి 'బర్లిన్' చేరేను.

# శబ్దకోశం.

కులక్ :— వట్టినే కూర్చుండి, ఇతరుల శ్రమఫలన లాభాయి తీసే ధనికుడగు భూస్వామి.

జి. పి. యూ. :— Gaypayoo. కాపిటలిస్టులగు శత్రువులవారినుండి విప్లవాన్ని రక్షించడానికి ఉద్దేశించబడిన రహస్యగూఢచారిదళం.

ప్రొలిటేరియటు :— ఇది ఫ్రెంచిశబ్దం. రోమనుచరిత్రలలో ఈశబ్దాన్ని, మనము 'చండాల' శబ్దాన్ని వాడినట్లు అతినికృష్టజాతులవిషయంలో వాడబడింది. కాని, కమ్యూనిస్టులు దీనిని సమ్మానపూర్ణముగా చేశారు. ఇప్పుడు ఆశబ్దానికి అర్థం, "స్వకాయకష్టంతో తిండి సంపాదించుకొనేవాడు."

బూర్జువా :— ఈశబ్దానికి అసలు అర్థం "వ్యాపారం చేసుకొనేమధ్యతరగతి మనుష్యుడు." కాని, నేడు ధనికులకీ, ఇతరుల శ్రమమీద జీవించేవారికీ, ఉపయోగించబడుతూంది.

యు. ఎస్. ఎస్. ఆర్. :— Union of Socialist Soviet Republics

రక్తకవచదళం :— Red army. ఫ్రెంచివిప్లవదినాలలో విప్లవకారులు ఒకఎఱ్ఱటోపీని బల్లెపుకొనకు గుచ్చి, జెండాగా ఉపయోగించేరు. ఆనాటినుండి ఎరుపురంగు విప్లవచిహ్నంగా గుర్తించబడుతూంది. విప్లవదళాల్ని "Red army" అనిపిలుస్తారు.

లెనిన్సుకార్నర్ :— రష్యాలో సార్వజనికసంస్థలన్నిటిలో ఒకమూల 'లెనిన్' చిత్రము ఉంచబడి దానిపార్శ్వాన కమ్యూనిస్టుల ప్రచారానికి సంబంధించిన కాగితాలను అతికిస్తూంటారు. ఇదే 'లెనిన్సు కార్నర్.'

వీసా:—విదేశయాత్రల కవసరమైన "ప్యాస్‌పోర్టుల"మీద మనం చూడ దలచిన దేశపు రాజదూత సంతకం ఉండాలి. అదే 'వీసా.'

సోవియటు:—సైనికులు. కూలీల, ద్వారా ఎన్నుకొనబడిన పంచాయతీ లని అర్థం. ఈశబ్దం 1905 విప్లవం నాటినుంచీ చారిత్రిక ప్రఖ్యాతి చెందింది.

ఆర్. ఎస్. ఎఫ్. ఎస్. ఆర్.:—Russian Socialist Fedaration of Soviet Republics.

రూబులు:—రష్యను నాణెం. మారకంలో రు 1—9—6 లకు సమానం.

సూ చ న :—

౧౧౬ వ పేజీలో 3 వ పంక్తిలో "కాకపోవచ్చు" అనుచోట "కావచ్చు" అని చదువవలయును.

166



## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA112B118 |
| పుస్తకం పేరు | నా రష్యా యాత్ర |
| తారీఖు | 26/10/24 |
| ముందు అట్ట | no |
| వెనుక అట్ట | no |
| మొత్తం పేజీలు | 167 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | 1,2,164 |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | thasin |
| పేజీలు విడదీసినది | thasin |
| స్కాన్ చేసినది | thasin |
| పరీక్ష చేసినది | prathyusha |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |